# భారతి



నవంబర్

1954

*

వెల రు. 1.

# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1954

సంపుటము 31 : సంచిక 11

విడిపత్రిక వెల ఒక్క రూపాయి

# విషయానుక్రమము

-:0:-

## నవంబరు 1954


జాగృతి ప్రతిజ్ఞ—శ్రీ సాళ్వ కృష్ణమూర్తి 401

నరబలి—శ్రీమతి నర్గీస్ దలాల్ 403

జర్మనీపునర్జన్మ—శ్రీ పి. శ్రీరాములు 409

పులిసిద్దప్ప భార్య—శ్రీ కె. ఎ. ఎస్. రావు 414

అనంతవర్మచోడగంగదేవుడు: అనపాక తామ్రశాసనము—
శ్రీ మండ నరసింహము 424

హాస్యరసము—శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి 433

ముక్తమాల—శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి 441

సాతవాహను లెవరు—శ్రీ చీమకుర్తి శేషగిరిరావు 451

గడచిపోయిన గాథలు—శ్రీ బలివాడ కాంతరావు 457

నేటిసాహిత్యము: అపభ్రంశప్రయోగములు—శ్రీ కురుగంటి
సీతారామయ్య 465

అస్థిపంజరం—శ్రీ మంథా వెంకటరమణారావు 469

పెద్దన: మనుచరిత్ర—శ్రీ నిడుదవోలు వేంకటరావు 4[illegible]8

కలగూరగంప— 494

గ్రంథ విమర్శనము— 497

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాద కుండ

# తెల్ల వంత ఉతుకును



మీ బట్టలను సన్‌లైట్‌తో ఉతికినచో
మలినము ఎంత సులభముగా దొర్లిపోతుందో
మీరే చూడండి. కొద్ది నిమిషములలో
మీ తెల్లని బట్టలన్నియు (రుమాలునుండి
దుప్పట్లు వరకు) క్రొత్తవాటికంటె తెల్లగా
నగును : మరియు సన్‌లైట్‌తో ఉతుకుట
వలన మీ బట్టలు చాలకాలము నిలబడును."



"దీనిని బాగా జ్ఞాపకముంచుకొనండి—
సన్‌లైట్ సబ్బు రంగు బట్టలను తళతళమని
మెరసేటంత ప్రకాశవంతముగా మరికేట్టు
మరేదియు నుతుకదు. సన్‌లైట్ సబ్బునుండి
త్వరగావచ్చు నురగ బట్టలను బాదకుండగనే
వాటిలోని మలినమును తరిమివేసి వాటి అసలు
రంగును తిరిగి తెచ్చుటను మీరే చూడండి."




## సన్‌లైట్ సబ్బు

బట్టలను కాపాడును · శ్రమను తగ్గించును · ఖర్చును తగ్గించును

S. 222-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది




జయ
కార్తికము

# భారతి

సంపుటము 31
సంచిక 11


# * జాగృతిపజ్ఞ *


శ్రీ సాళ్వ కృష్ణమూర్తి


రఘుకులస్వామి పారావారధీశక్తి శయ్యా సుహృద్వృత్తి సాగి యొరసి
శ్రీ ధరిత్రీజాత స్నిగ్ధపాదాంభోజ లాక్షాస్ఫురద్రక్తి రంగరించి
శ్రీ సుమిత్రాదేవి స్మితసముస్మేష మా సేవావచఃప్రౌఢి సేకరించి
ఉత్సృష్ట సౌఖ్యాబ్ధి ఊర్మిళాహృదయార్త రేఖా సమాశ్లిష్ట ఋషిపథమ్ము

నధివసించిన నాహృదయాబ్జసీమ
పరమ వైరాగ్యభావసంపన్నమగుచు
జడలు దాల్చిన మత్తపస్సాధనోగ్ర
సాధు సేవా ప్రతిజ్ఞ ఆశ్రయము గనుత!

ధరణీధ్ర సాను దుస్తరపథోద్వృత్తి మై యరుగుచో శాతబంధురపు శిలల
ఉరుదరీ నిర్ఝరీపరిషిక్త సముపాంత వృక్షాగ్రపాత వార్బిందు తతిని
అగ్నిమన్యానుభగ్న భుగ్నార్చిరాకీర్ణ సానుభ్రమద్వాయు శాణరేఖ
శితికంఠ కంఠాహి హుతభుక్శిఖారేఖ నెగచిన విషధూమ గగనవీథి

ముక్త కూర్పాన జాగ్రదాభోగశక్తి
శీర్ష మణికోటి చిత్రితాశీవిషాగ్ని
ఉద్గమితమైన మన్మహోద్యద్గుణాంక
సాధుసేవా ప్రతిజ్ఞ ఆశ్రయము గనుత!

మృదువాయు చలిత పుష్పిత లతావృతాళి పరిణద్ధ మాధవోద్భాసి కాంతి
జ్వాలదగ్ని దీర్ఘవాసర నభోమణి చండిమోత్పాటితమ్ము గ్రీష్మోర్వరాత్రి
జలధరానేక కజ్జలగిరిన్యస్త వర్షాలతాతన్విభూషాస్రజమ్ము
శారదాకాశ విస్ఫారితాయత గరుద్రాజహంసాభ చంద్రాంశుపరసి

వన్యపథ హిమభిత్తి శర్వరికి హత్తి
కళుకుమని రాలు పలిత వృక్షచ్ఛదముల
నస్మదాత్మీయమూర్తి నాన్యాత్తశక్తి
సాధుసేవాప్రతిజ్ఞ ఆశ్రయము గనుత!

ఆకృష్ట సకలపుణ్యావర్తమోహానోద్ధురగతి భావబంధురత తోచి
ఉద్రిక్త వాయుసముత్కీర్ణగతి సేవా మొగలిపూవాసనలెగచి తాకి
కనుమూసి వినినంత వనవీధి నినదించు కీచకోత్కారమరుద్గీతి విన్చి
అచ్ఛమై యొండు ఊహాసుప్తి విడివడ్డ నేనుగా నాకు గాన్పించి నిలిచి

ఆత్మలోన చక్షుశ్శ్రీవ ఆప్తిగనిన
నిరవధికభక్తి ధృతజగద్భరణశక్తి
సాధుసేవాప్రతిజ్ఞ ఆశ్రయము గనుత
ధరణిజా వపుర్వల్లి గందంపుమ్రాను.

కథానిక

# * నరబలి *

## శ్రీమతి నరిస్ దలాల్

★ ★ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక అధ్వర్యాన జరుగుతున్న ప్రపంచ కథానికల రెండవపోటీ సందర్భంలో హిందూస్థాన్ టైమ్సుపత్రిక నిర్వహించిన అఖిలభారత పోటీలో ఇది ప్రథమ బహుమతినందిన కథ. భారతదేశంనుంచి ప్రపంచపోటీ కంప బడిన నాల్గు కథలలో మొదటిది. ఈకథకు హిందూస్థాన్ టైమ్సుపత్రిక రు. 1500 లు బహుమాన మిచ్చింది. శ్రీమతి నర్గీస్‌దలాల్ ఈకథను ఆంగ్లభాషలో రచించి పోటీలో పాల్గొన్నారు.

శ్రీమతి నర్గీస్‌దలాల్ జననం 1923 సం॥ జూన్ 13 వ తేదీ. భారతదేశపు అసిస్టెంట్ సర్వేయర్ జనరల్ శ్రీ జె. ఎ. ఎఫ్. దలాల్ గారిసతి. ఇరువురు కుమార్తెలూ ఒక కుమారుడూ వీరి సంతానం. గృహనిర్వహణలో అత్యంత శ్రద్ధగల నిరాడంబర జీవి. ఆంగ్లభాషలో, తఱచు, కథలూ వ్యాసాలూ వ్రాస్తూ వుంటారు. ★ ★

ఆ గతుకుల బాటవెంట కారు నెమ్మదిగా సాగిపోతోంది. తళతళలాడుతూవుండే దాని పార్శ్వ భాగాలు దుమ్ముకొట్టుకుని బూడిదపులిమినట్టు కావురసి పోయినై. చుట్టూ చూపుమేర దూరం, ప వరకూ, ఎండ్రుగొట్టిపోయిన ఒకే ఒక బట్టబంజరు. దూరాన కొండలమీద మాత్రం నీలవర్ణపు పొగతెరలా మృగతృష్ణ.

ట్రియానా ఏదో దాహంతో వున్నవాడులా కారులోనుంచి బయటికి తొంగిచూచాడు. భారత దేశాన్ని అవగతం చేసుకోవాలనే ఉద్దేశంతో ట్రియానా యిలా యీ దేశానికి అరుదెంచారు. ఈ దేశాన్ని గురించి ఏ అణుమాత్రమూ మిగలకుండా సమగ్రంగా తెలుసుకుపోవాలని ఆయన పరమదీక్షతో వున్నాడు. కన్నులపండువుగా మిసమిసలాడే పచ్చిక బయళ్లను చూచాడు; సీతారామకోరుతున్న కొండ కోనల సౌందర్యాన్ని తిలకించాడు. సిరులు తులదూగే 'టీ' తోటలను చూచాడు; ప్రాచీన శిల్ప సంపదలనూ, దేవాలయాల గోపురాదులనూ వీక్షించాడు. క్రొత్తగా నిర్మించుతున్న ఆనకట్టలను కూడా చూచాడు. కాని ఆయనకు తృప్తి కలుగలేదు. క్షామ ప్రాంతాలను చూడాలి—అదీ ఆయన ఆవేశం. ఆకలి పిశాచి అటమటింపజేస్తుంటే కంకాళాలుగా మారి పాలెండి వ్రేలి చివికిపోయిన స్తనాలతో అల్లాడుతున్న అభాగినుల చిత్రాలు సంపాదించాలి; ఊదబోయిన పొట్టలతో ఊచ కాళ్లతో ఊగిసలాడిపోతున్న పసిపాపల ఫొటోలు సంపాదించాలి. తాను స్వదేశానికి తిరిగి వెళ్ళాక వాటిని తన పత్రికలో ప్రకటించుతాడు. ఈ ఛాయా చిత్రాలన్నిటికీ ఒకటోరకంగా వుండేలాగు తీయాలని ఆయనప్రయత్నం. కారులోవున్న తదితరులకు యింత ఉబలాటం వున్నట్టు కనుపించదు. వారి నిస్పృహను లెక్కచేయకుండా ట్రియానామాత్రం పరమ ఔత్సుక్యంతో వున్నాడు. గ్లాసు తలుపులు మూసివున్నా వడగాలి లోపలికి దంచేస్తూనే వుంది. గాలితోపాటు ధూళికూడా లోపలికి చొరవ చేసుకుని, లోపలున్న మెత్తలూ దిండ్లూ సర్వం నానా కచాటీ అవుతున్నయ్.

ఆ యిద్దరు ఆడవాళ్లలో, చిన్నావిడ ముఖం గుడ్డతో తుడుచుకుని, తలప్రాణం తోకకువచ్చినట్టు వెనక్కు జాలిగిలబడ్డది. ఆవిడవయసు ఇరవై దాదాపు

వుంటుంది; ఆరోగ్యంతో మిసమిసలాడుతున్న చక్కనిముఖం; నల్లని వెంట్రుకలు, గోధుమరంగు తేనెకళ్లు. ఇంకా కొంచెం వయసు గల ఆ రెండో ఆవిడ ట్రియానా సోదరి. దిళ్లకూ పరుపులకూ ఎలా దూగరపట్టివుందో ఆవిడ దుస్తులనిండాకూడా అలాగే సన్నటి పొరగా దూగరపట్టి వుంది—దుస్తులే కాదు, శరీరమంతా కూడా. ముఖంమీదినుంచి కనుబొమల మీదకి మడ్డి ఓడుతోంది. ఈ గిజాటంతా తెలియనట్టు నోరు తెరచి, కళ్లు మూసుకుని మాగన్నుగా కునుకు తీస్తోంది.

ఈ వడగాలి లెక్కలేనట్టు కనుపించుతున్న వాడు డ్రైవరొక్కడే. అతను ఈ దేశం వాడు; యువకుడు; చలాకీ అయిన ముంజేతులు; కారు నడుపుతున్నాడన్న మాటే గాని అప్రయత్నంగా చేతులు వాటంతటికవి పనిచేస్తున్నట్టు కనుపించుతోంది. అతను లోగడ సైన్యంలో పనిచేశాడు. ట్రియానాకు ఆయా ప్రదేశాలు చూపించటానికి అతన్ని ఆదేశించారు. అతను చాలా మితభాషి, ఏదైనా ప్రత్యేకంగా చెప్పదగిన విషయముంటే తప్ప నోరు మెదపడు

ట్రియానా ముందుకు వంగి, అతన్ని పలకరించాడు:

'ఇదుగో ప్రీతమ్‌సింగ్—ఇటు చూడు—ఫలహారం చేద్దాం—దగ్గర్లో, కొంచెంసేపు విశ్రాంతి తీసుకోటానికి తగిన ప్రదేశమేదేనా వుంటే అక పోనీ—

ప్రీతమ్‌సింగ్ సమాధానం చెప్పలేదు గాని, సరేనన్నట్టు తలవూపాడు.

ట్రియానా రుసరుసలాడాడు. అసలు యీ దేశం వాళ్ళంటేనే అతనికి చిరాకు; అందులో యిలా మౌనంగా వుండే రకాన్ని చూస్తే మరీ మంట.

ట్రియానా వసబోసిన పిట్ట; అస్తమానం ఏదో ఒకటి మాట్లాడుతూ వుంటేగాని అతనికి తోచదు. కొంచెం కురచమనిషన్న మాటేగాని పుష్టిగల శరీరం. తాను ఆంగ్లజాతికి చెందినవాణ్ణని చెప్పుకుంటాడు. చెప్పుకోటమే గాదు—దీన్ని ఋజువు చేసుకోవటానికి బ్రిటిష్ పౌరుడుగా అతని చేతిలో పాస్‌పోర్టుకూడా వుంది. కాని యిది కొంత అనుమానించదగ్గ విషయంగా కనుపించుతుంది. ఎంచేతనంటే దేహచ్ఛాయ విషయంలో ప్రీతమ్‌సింగ్ కంటే అతను మరేమంత తెలుపు కాదు. నల్లటి ఆ కళ్లూ, నూనె రాచుకున్నట్టు నిగనిగలాడుతూ ఆ నల్లటిజుట్టూ పట్టిస్తున్నట్టుగా వున్నయ్. అతను, తన దేశాన్ని గురించీ, తన జాతినిగురించి ఎప్పటికప్పుడు ఎడాతెరిపీ లేకుండా తెగపొగడుకుంటూ వుంటాడు. ఇతర దేశాలనూ, ఇతర జాతులనూ పురుగుల్కింద తీసేసి దులపరించుకూ వుంటాడు. తన రక్తంలో సాంకర్యమేదో వున్నదని అనుమానంవుండే ప్రతిఒక్కడూ ఇలానే ప్రవర్తించుతూ వుంటాడు. నల్లచర్మం వున్న యావన్మందికీ అతను 'నిగ్గర్' అనే పదం వాడి, చీదరించుకుంటూ మాట్లాడతాడు. వాళ్లకి సంబంధించిన మంచినీ చెడునీ కూడా త్రోసిరాజుక్రింద కొట్టి పారేస్తాడు. ఇప్పుడు చుట్టూవున్న పంటపొలాలన్నీ అలా ఊసరక్షేత్రాలుగా మారి కంటబడుతుంటే, ఏదో తన లోపలున్న అక్కసంతా తీరి తృప్తిపడుతున్నట్టు కనుపించుతున్నాడు. 'రోగం కుదరాలిసిందే' అన్నట్టు సర్దాగా చేతులు నలుపుకుని ముచ్చట పడుతున్నాడు. ఇంగ్లీషువాణ్ణని చెప్పుకుంటే, తన దేహచ్ఛాయా, కాటుక కండ్లూ కూడా మారిపోతాయని ట్రియానా విశ్వసించుతున్నట్టున్నాడు.

ప్రీతమ్‌సింగ్ సాయుధదళాల్లో ఆఫీసరుగా పని చేసివున్న కారణంగా ?దేశాలూ చూచాడు. ట్రియానాను చూసి వీడు ఏ దేశంలో పుట్టివుంటాడని, అపహాస్యంగా లోలోపల నవ్వుకుంటున్నాడు. బహుశా యీ దేశానికంటే ఉష్ణాధిక్యతగల ప్రదేశంలోనే పుట్టివుండాలనుకున్నాడు. కాని, ప్రీతమ్‌సింగ్ మర్యాద మన్ననలు తెలిసినవాడు, అందుచేత లోపలనుంచి ఒక చెంప నవ్వ వస్తున్నా, ఆపుకుని మామూలుగా ప్రవర్తించుతున్నాడు.

కారు ప్రక్కకు తిరిగి రోడ్డుమీదినుంచి ప్రక్కనున్న వుంతలోకి దిగింది. కట్టెదుట శిథిల ...లమై పాడుబడివున్న ఒక పాతకోట. ఎండవేడిమి నుంచి ముహూర్తకాలం తలదాచుకోవటానికి కాస్త చల్లటి ఆశ్రయం.

అందరూ కారు దిగారు. గుదులు బటిపోయిన కాళ్లు విదిలించుకుని అమ్మా అనుకున్నారు. ఆ జవ్వని రెండు చేతులా మెడనొక్కుకుని పిల్లికూనలా పెద్దగా ఆవులించింది.

ట్రియానా ఆవిడవంక చూసి దిబ్బస కుక్కల్లా వున్న తన పెదవుల్ని నాలికతో నాక్కున్నాడు. పోయి ఆవిడ చెయ్యి బట్టుకుని:

'హెలెన్ - పదపద - అలా నీడలోకి పద. నీవిక్కడ వడగొట్టి చదికిలబడి పోవటం పొసగదు'— అంటూ, అనాచ్ఛాదితమైన ఆవిడ ముంజేతిని చలాకీగా నొక్కాడు.

ఆపిల్ల నెమ్మదిగా వదిలించుకుంది. ఆ రెండో ఆవిడవెంట కాళ్ళీడ్చుకుంటూ లోపలికి వెళ్ళింది. ఆ అమ్మాయికి ట్రియానా అంటే తగనిచిరాకు; అతని సోదరి జార్డన్‌సతికి హితురాలైన కారణంగా యీ జంజాటాన్నంతా భరించవలసి వచ్చింది. ఇదొక్కటే గాదు. తన కిష్టంలేని ఇలాంటి అనేక చికాకులు భరించవలసి వచ్చినై. కాని యిప్పుడు ఆవిడ వాటన్నిటినిగురించీ విచారించి లాభంలేదు.

వెనకనుంచి సామానులు మోసుకొస్తున్న వాన్ కూడా అక్కడికివచ్చి ఆగింది. నౌకర్లు గబగబా క్రిందికిదిగి ఫలహారాలబుట్టలూ రగ్గులూ క్రిందికి దించారు. క్షణాలమీద కావలసిన యేర్పాట్లన్నీ పూర్తిచేశారు. అప్పటిదాకా పల్లెత్తుమాటైనా పలకకుండా కిమనాస్తిగాకూర్చున్న జార్డన్‌సతి ఆకలి మొహం బెట్టి ఆ ఫలహారాలవంక ఆప్యాయంగా చూసింది. దుమ్ము గొట్టుకున్న ఆ మురికి చేతులతోనే, ఆదరా బాదరా, 'సాండ్‌విచన్' తీసి ఒకదాని తరువాత ఒకటి నోట్లో కుక్కేసుకుంటోంది.

హెలెన్ కొంత జాలిగానూ కొంచెం విహ్వాభావం తోనూ ఆవిడ చర్యను గమనించుతోంది. ఆ మెడ గుండీలేని, నీలవర్ణపు కమీజూ, యే విషయాన్నీ అంతగా ఖాతర్ చెయ్యని ఆ నిర్లిప్తత, ప్రీతమ్‌సింగ్ వాళ్ళకు సుదూరంలో ప్రశాంతంగా నిల్చునున్నాడు. వాళ్ళకూ అతనికి మధ్య, అధిగమించరాని అఖాతమేదో వున్నట్టు కనుపించుతోంది.

కారులో ప్రయాణం చేస్తున్నంతసేపూ, ట్రియానా, భారతీయులను గురించి యిష్టంవచ్చినట్టు మాట్లాడుతూనే వున్నాడు. వాళ్ళ మర్యాద మన్ననలనూ, వాళ్ళ సంప్రదాయ విశ్వాసాలనూ, పరిహసించుతూ, యకయకలాడుతూనే వున్నాడు. ఇదంతా వింటూకూడా ప్రీతమ్‌సింగ్ యీషణ్మాత్రం కూడా చలించకుండా నిబ్బరంగా కూర్చున్నాడు. అతి మర్యాదగా ప్రవర్తించుతున్నాడు. అతని ప్రవర్తనచూస్తే హెలెన్‌కు ఆశ్చర్యం వేసింది. నిజంగా ఇదంతా అతనికేమీ పట్టదా? లేక కావాలని వహించుతున్న మౌనమా? దుర్భేద్యమైన అతని మహామౌనం ట్రియానాను మరింత రెచ్చగొట్టి యింకా అనంతంగా పేలించుతోంది.

'అహాహాహా! — ఏమిఁదేశం! — నిజానికి స్వాతంత్ర్యం పొందాలిసిన పోతుగడ్డ!. జోక్యము నేది లేకుండా, ఆకలితోమాడి ఇక హాయిగా మరణించవచ్చు మీరంతా.'

ప్రీతమ్‌సింగ్ నోరుమెదపలేదు — ట్రియానాకు మరింత రేచిక్క పుట్టుకొచ్చింది. ఎలాగన్నా అతన్ని మాటాడించాలి. అవమానంతో అతని ముఖం కందగడ్డయేలాగు చెయ్యాలి. క్రోధంతో అతని కళ్లు చింత నిప్పులయ్యేలా రెచ్చగొట్టాలి. బారలు చాచి, ఎండి నెరియలు కొట్టి ఊసరక్షేత్రమై చుట్టూ పడి వున్న భూభాగంవంక చూపుతూ మళ్ళీ మొదలు పెట్టాడు.

'వరదలు, క్షామాలు, అవినీతి, అలివిమాలిన స్వార్థం, అన్నిటినీ తలతన్ని చెడ జెరిగిపోయిన ఈ జనాభా — ఇంకా యింతకంటే ఏం కావాలి మహాప్రభూ! — మేవుఁ ఇక్కడనుంచి అలా కాలుతీసి అవతల పెట్టామో లేదో, క్రమశిక్షణ అనేది సాంతం కరారావుడైపోయింది. తలకెక్కిన అధికారగర్వంతో రాజకీయనాయకులు పేలుతూవుండే అవాకులూ చవాకులూ తప్ప యిక్కడ వుండేడిసిం దేవిఁటి? ఇలాటి మురికికూపంలో మగ్గుతూన్న మీరు భద్రతా మండలిలో కూర్చుని, ఏ ముఖం పెట్టుకుని 'ఇలా చెయ్యండి అలా చెయ్యండి' అంటూ ప్రపంచానికి ధర్మోపదేశాలు చెయ్యటానికి పూనుకుంటున్నారో నాకు ఆశ్చర్యంగా వుంది. ఇలాటి స్థితిలోవున్న మీరు ఇతరులకు తగుదునమ్మా అంటూ సలహాలివ్వబూనటం హాస్యాస్పదమైన అవకతవక పని; సహించరాని అధికప్రసంగం గాని మరొకటి కాదు."

నిజానికి ఆ ఉద్రేకంలో ప్రీతమ్‌సింగ్ ఒక్క పెట్టున ట్రియానామీద విరుచుకుపడి అమాంతం పీక నులిమి వెయ్యాలిసింది — కాని క్షణంలో మళ్ళా తమాయించుకున్నాడు. బిగించిన పిడికిళ్లు విచ్చులుకున్నాయి: నిర్దుష్టమైన ఆంగ్లభాషలో అతి శాంతంగా: 'ప్రొద్దుగూకేలోగా రహదారి బంగళాకు చేరాలంటే మనం వెంటనే బయలుదేరాలనుకుంటాను' అన్నాడు.

ఇందతా వింటూంటే జార్డన్‌సరికి లోలోపల ఆందోళన బయలుదేరింది. కంగారుగా యిద్దరివంకా చూసింది. ముఖం గోత్తిముఖంలా తెలివితక్కువగా పెట్టి అతన్ని శాంతపరచాలనే ఆందోళనతో 'మిస్టర్ ప్రీతమ్' యీ కోటనుగురించి తెలుసుకోవలసిన విషయ మేమీలేదా' అని అడిగింది.

ప్రీతమ్ తలెత్తి ఆవిడవంకచూసి చిరునవ్వు నవ్వాడు. 'అఁ యేముంది — ఏదో పాతకోట' అన్నాడు. 'కాని ఈ పరిసరాలలో వున్న గ్రామాలను గురించిమాత్రం తెలుసుకోదగ్గ విషయాలు కొన్ని వున్నయ్ — ఏవిఁటంటే — పూర్వం యీ ప్రాంతా

లలో వర్షాధిదేవత వరుణదేవుడికి నరబలులు అర్పించేవారు. ఇప్పుడు కొత్తశాసనాలువచ్చాక అలాటివేవీ జరగటానికి వీల్లేదనుకోండి;—కాని యిప్పటికీ కూడా యిక్కడి జనంలో చాలామందికి అదే విశ్వాసం; ఒక్క ప్రాణం గనుక బలి యిచ్చివుంటే ఇలాంటి క్షామంయెప్పుడూ తటస్థించేదిగాదని వాళ్లకు గట్టి నమ్మకం.

ఈ మాటవిని జార్డన్‌సతి హడిలిపోయింది: 'అయ్యొ బాబోయ్!' అని గుండె కొట్టుకుంది:

'ఏమిటి? నిజంగా వాళ్లు మనుషుల్నే బలిస్తారంటావా!'

'ఎంత అఘాయిత్యం' అంది హెలెన్.

ప్రీతమ్‌సింగ్, బుజాలు కొద్దిగా ఎగరేసి కారులోకి యెక్కి స్టీరింగ్ పుచ్చుకున్నాడు:

"చూడండి! ఏ విషయమైనా ఆలోచించే వ్యక్తుల దృక్పథంమీద ఆధారపడి వుంటుంది. వందలాది ప్రాణాలను కాపాడటానికి ఒక ప్రాణాన్ని త్యాగంచేస్తే తప్పులేదని వాళ్ల అభిప్రాయం కావచ్చు; ఎక్కడో విదేశాలలో బ్రతుకుతూవుండే ముక్కూ మొహం ఎరగని అమాయక ప్రజల్ని హత్య చెయ్యటానికి ఇక్కడనుంచి మనుష్యుల్ని పంపటం—ఇది అడివిమనుషులు చెయ్యాల్సిన అకృత్యమని యిక్కడవాళ్ల అభిప్రాయం. అయినా యీ నరబలుల విషయం ఇప్పటి సంగతి కాదులెండి—ఎప్పుడో పెద్దలనాటి సంగతులు.

ట్రెయానా అగ్గిరాముడైపోయాడు: 'ఏమిటీ అక్షరజ్ఞానశూన్యులైన యీ అడివిజాతి వాళ్ళ కిరాతాచారాలకీ, విజ్ఞానవేత్తల సారథ్యంలో నడిచే అధునాతన యుద్ధతంత్రానికీ సాపత్యం తెచ్చావా?'

'సరే యిక బయలుదేరదాం' అని గొణుక్కున్నాడు ప్రీతమ్‌సింగ్, తనలో తను. కారు మెల్లగా సాగింది. తక్కిన విషయాలన్నీ ఎలా వున్నా కారు మాత్రం చాలా సొగసుగా వుంది. అలాటి ముచ్చటైన కారును నడిపే సావకాశం తనకు జీవితంలో మరో మారు లభ్యంకావటం దుర్లభమే. దిబ్బసకుక్కలా బలిసి కారులో కూర్చున్న ఆ మనిషి తన పత్రికలలో ఏమేమి వ్రాయబోతాడో అని ఆశ్చర్యపోతూ, తదేక దృష్టిగా రోడ్డువంక చూస్తూ కారు పోనిస్తున్నాడు.

ఆప్రాంతంలో ఎక్కడా పచ్చని పరక కంటబడటంలేదు. ఎక్కడో ఒకచోట మోడువారిపోయిన మహావృక్షం మేదో ఒకటి సుదీర్ఘములైన శాఖలను నిరామయాకాశంలోకి ఎత్తుకుని అతి దైన్యావస్థలో నిల్చుని వుంది. ఒకొక్కచోట పాడుబడిపోయిన గుడిసెలు కనుపించుతున్నయ్. ప్రాణి సంచలనం మాత్రం ఎక్కడా లేదు. అసలు ప్రాణి అనేది ఆప్రాంతంలో ఎప్పుడూ మెసలనే లేదేమోనన్నే భ్రమ కలుగుతోంది.

కారు రహదారి బంగళాకు చేరుకుంది. నిద్రమత్తులోవున్నట్టు కనుపించుతున్న ఒకముసలాడు వరండాలోకివచ్చి, అంత పెద్దకారునీ, అందులో వున్న మనుషుల్నీ చూసి ఆశ్చర్యపోయాడు. అది మామూలు నాటురకం రహదారిబంగళా. ఓటిబల్లలూ, కుంటికుర్చీలూ, స్ప్రింగులు విరిగిపోయి ఊగిసలాడుతున్న మంచాలూ దుమ్ముగొట్టుకుని, సాలిగూళ్ళుబట్టి నానాఃనత్స్యంగా వున్నయ్. అవన్నీ ఏ ఇక్ష్వాకుల నాటివో! ఇంతలోనే సామానులవాన్ వచ్చి చేరుకుంది; నౌకర్లు 'క్యాంపుకాట్లు', దళువ చేసిన దుప్పట్లు వగైరా అన్నీ బయటికితీసి క్షణాలమీద కావలసిన యేర్పాట్లన్నీ చకచకా పూర్తిచేశాడు. భోజన మజ్జనాదులకు కావలసిన సన్నాహాలకు ఉపక్రమించారు.

కళ్లు మిరుమిట్లుగొలిపే ఆ కారులైట్లూ, అహంగా అదంతా చూసి కాబోలు ఆ గ్రామస్థులు కొంతమంది బంగళా చుట్టూ మూగారు. జీబుతలలూ, చింపిరిగుడ్డలూ, బొమికెలు పొడుచుకువచ్చి అస్థిపంజరాల్లా వున్న దేహాలూ — భూతాలులా కనుపించుతున్నారు. హెలెన్ వాళ్లనిచూసి కంగారుగా కేకబెట్టింది. ఆ కేకతో ఇంకా అవతలగావున్న వాళ్ళుకూడా లోపలికి మూగారు, వాళ్లల్లో కొంతమంది చిన్నపిల్లలుకూడా వున్నారు.—హృదయవిదారకమైన దృశ్యం-కాళ్లూ చేతులూ పుడకలై పొట్టలు ఈలావున వాచివున్నయ్; నిర్జీవాలైన కళ్లతో తెల్లబోయి చూస్తున్నారు. పిడచలుగట్టి ముడుచుకుపోయిన మొహాల్లో ఆ కళ్లు ఇంతింతలుగా కనుపించుతున్నయ్.

వాళ్లనుచూస్తుంటే హెలెన్‌కు జాలివేసింది, 'అయ్యో పాపం!' అన్నది.

ట్రెయానా ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బులై, బుజాలు ఎగరవేశాడు 'ధుమా! రేపు ఫస్టుక్లాసైన ఫొటోలు తీస్తాను చూడండి!'

ప్రీతమ్‌వంక తిరిగి: 'ఇదిగో ఏమోయ్! రేపు వీళ్లందర్నీ రమ్మను ఫొటోలు తీస్తాను. ఇంతకంటే, పీనులైన ఆడవాళ్ళూ, ఆకలితో డొక్కలెండుకుపోయిన వాళ్ళూ వుంటే వాళ్లని తప్పకుండా తీసుకు రమ్మను—ఆ రకం పసిపిల్లల్ని కూడా తీసుకురమ్మను; బక్షీస్ ఇస్తానని చెప్పు.'

ప్రీతమ్‌సింగ్ వాళ్ళలో వున్న వృద్ధుణ్ణి ఒకణ్ణి పిల్చి, టూకీగా ఒకటి రెండు మాటల్లో ఏదో

చెప్పాడు. ఆ ముసలాడు ట్రియానావంక అదో రకంగా తేరిపారజూచాడు. ఆ చూపుకు తట్టుకోలేక ట్రియానా గిజాటుగా ఇటూ అటూ మెసిలాడు:

'ఏమిటి దయ్యంమొహం వేసుకుని అలా చూస్తున్నాడు! ఇంతకీ యితను చెప్పిందేమిటో వాడికి అర్థమై యేడుస్తోందా?'—

ఆ ముసలాడు ప్రీతమ్‌సింగ్ వంక చూసి, నెమ్మదిగా ఒకటి రెండు మాటలు ఏవో గొణిగాడు. ప్రీతమ్ ట్రియానావైపు తిరిగి: 'రేపు ప్రొద్దు పొడిచాక మిమ్మల్నే వాళ్ల గుడిశలదగ్గరికి రమ్మంటున్నాడు. మీకు కావలసిందంతా చూడవచ్చునంటున్నాడు. ఇంకా మీరు చూడదలిచిందేమన్నా వుందా అని అడుగుతున్నాడు'—అన్నాడు.

ట్రియానా హుషారుగా: 'లేకేం, వుంది—నరబలి చూడాలనుకుంటున్నానని వాడితో చెప్పు' అంటూ పెద్దపెట్టున పకపకా నవ్వాడు.

ప్రీతమ్‌సింగ్ ట్రియానావంక మౌనగంభీరంగా ఒక చూపు చూచాడు. ట్రియానా అట్టహాసం అతని గొంతులోనే మటుమాయమైంది. ఆ జనం ఒకళ్లొకళ్లే ఎక్కడివాళ్లక్కడే అదృశ్యమైపోయారు.

అంతా భోజనానికి కూర్చున్నారు. టిన్నుల్లో అమరాచేసి తెచ్చుకున్న రుచ్యాతిరుచ్యాలైన మధుర పదార్థాలు, అనంతరం కాఫీ, క్రీమూ పుష్కలంగా.

హెలెన్‌కు ఏమీ తినబుద్ధి వెయ్యటంలేదు. ఇదికాస్తా అదికాస్తా మునిపంట కొరుకుతోంది. తల పైకెత్తిచూస్తే ప్రీతమ్‌సింగ్ ఆ వటనకూడా లేదు, కాఫీమాత్రమే కతుకుతున్నాడు. జార్డన్ సతి కంగారుగా చుట్టూ ఆవరించివున్న అంధకారంలోకి బిత్తరబిత్తరపోయి చూస్తోంది—ఆ కంకాళ మూర్తుల ముఖాలూ ఆ నిర్జీవ నేత్రాలూ అంధకారంలోనుంచి మళ్ళా ఎక్కడ పొటమరించుతాయోనని నేగాబరాతో కాబోలు! ట్రియానామాత్రం తాపీగా కూర్చుని సుష్టుగా పట్టించుతున్నాడు: మధ్యమధ్య తెల్లటి జేబురుమాలుతో పెదవులు తుడుచుకుంటూ ఇంకా యింకా కూరుకుంటున్నాడు.

మర్నాడు కరకరలాడుతు ప్రొద్దు పొడిగించింది. ఆ బంగళాకు కుడిప్రక్కగా అల్లంతదూరంలో పట్టిపోయిన ఒక బావిచుట్టూ కొన్ని చెట్లు కనుపించుతున్నయ్. ఆ భూభాగానికంతా ఆ కాస్తే పచ్చగా కనుపించుతున్న ప్రదేశం. పదేపదే అటే చూడబుద్ధి వేస్తోంది. ట్రియానా తన కెమేరాను అమరా చేసుకుని మెళ్లో తగిలించుకున్నాడు.

'బయలుదేరు ప్రీతమ్! పోదాంపద!' అన్నాడు.

'నేను రావటంలేదు'—ప్రీతమ్‌సింగ్ తాపీ సమాధానం చెప్పాడు.

ట్రియానా, అగ్గిరాముడై అతనివంక ఉరిమి చూచాడు: 'డబ్బు పుచ్చుకున్నావ్—ఎవడికోసం

ఆ భారతీయ యువకుడు అతి ప్రశాంతంగా సమాధానం చెప్పాడు: 'ఈ ప్రదేశాలు చూపించటానికి నేను డబ్బు తీసుకున్నాను—ఇతరత్రా నాకేమీ ప్రమేయంలేదు.

ట్రియానా నోరు అప్పాలపందులా తెరిచి అతనివంక చూచాడు. ఉద్రేకంతో అతని ముఖం జేవురుముద్దయింది. ఆ ఆవేశాన్ని అణచుకోవటానికి అతను చేస్తున్న ప్రయత్నం ఇంతా అంతా కాదు. మారుమాట లేకుండా టోపీ నెత్తిన తగిలించుకుని, విసురుగా ద్వారం తెరుచుకుని గబగబా బయటికి వెళ్ళిపోయాడు. అప్పటికే తీక్ష్ణరూపం ధరించుతున్న సూర్యుడు కిరణాలతో అతన్ని ముఖంలో బాదుతున్నాడు. అతనున్న ఆవేశంలో అది లెక్కజేయలేదు—అతని హృదయంలో క్రోధ ద్వేషాలు జ్వాలలు రేగుతున్నయ్. ఆ నదీగర్భం ఏనాడో ఎండిపోయి ఇసుకపర్రగా మారింది. ఆ యిసుక పర్రకు అడ్డంబడి నడుస్తూ ఒకటి రెండుసార్లు తూలి పడి తనలో తను తిట్టుకున్నాడు.

అతను వేసుకున్న సూటు పలుచటిదే అయినా ఆ వేడిప్రదేశంలో తొడుక్కోవటానికి తగినంత అనువైంది కాదు. చమటలు క్రమ్మి కోటు మరకలు పడుతోంది. జేబులోనుంచి లవండర్ చిలకరించివున్న రుమాలు తీసి పదేపదే ముఖం తుడుచుకుంటూ, ఆ గుడిసెల దగ్గిరికి చేరుకున్నాడు.

గుడిసెల ముందూ ద్వారబంధాలమీదా మగవాళ్లూ ఆడవాళ్లూ భూమిమీద వొరిగి పడున్నారు. వాళ్ళని చూస్తే, ఇందులో వీళ్లు పడుచువాళ్లు, వీళ్లు ముసలివాళ్లు అని తేల్చడం కష్టం. అందరి ముఖాలూ ఒకేలాగు ముడుచుకుపోయివున్నాయి. ట్రియానా గుడిసెలదగ్గిరికి వచ్చినా వాళ్లెవళ్లూ లేచి రాలేదు. కళ్ళు మాత్రం తెరుచుకుని అతని చర్యలు గమనించుతున్నారు.

ట్రియానా మాత్రం బహు సర్దాగా వున్నాడు. ఇదంతా చక్కగా కుదిరింది. ఒకటోరకం ఫొటోలు! వహ్వా! ఒక గుడిసె ముందు అర్ధనగ్నంగా ఒక స్త్రీ బోర్లబొక్కలుగా పడివుంది. రొమ్ములదగ్గిరగా ఒక పసిబిడ్డ; ఆ ఆడమనిషిమీదుగా వొంగి క్రిందికి తొంగి చూశాడు పరిశీలనగా. ఆ బిడ్డ చచ్చిపోయివుంది. అల

భ్యాన్లైన పాలచుక్కలకు అంగలార్చుతున్నట్టు నోరు ఇంకా తెరచుకునేవుంది. బొమికెలపోగుగావున్న ఆ స్త్రీ భుజంమీద చేయివేసి గుడిసె నీడలోనుంచి యివతలికి జరపాలని అతని ప్రయత్నం. కాని యింతలో వాయుగర్భంలో ఏదో జివ్వుమన్నట్టు అతనికి ఏదో స్ఫురణ కలిగింది. కంగారుగా వెనక్కి తిరిగి చూచాడు. గుడిసెల ముందూ గడపల్లోనూ గుడిసెల్లోనూ నిర్జీవుల్లా పడున్న ఆడవాళ్లూ మగవాళ్లూ భూతల్లా లేచి నిల్చుని నిశ్శబ్దంగా ముందుకు సాగివస్తున్నారు. దీర్ఘ చతురస్రంగావుంది ఆ స్థలం. మూడువైపులా గుడిసెలున్నయ్. నాలుగోవైపుకు కూడా కొందరు వచ్చేశారు. వందలాది కళ్ళు అతనిమీదికి నిశితమైన దృక్కులను ప్రసరించుతున్నయ్. నిర్దాక్షిణ్యంగా ఏదో చేసివేసే సంకల్పం ఆ కళ్ళల్లో తీవ్రరూపం దాల్చి కనుపించుతోంది. నలువైపులనుంచీ అతన్ని ఆక్రమించుతున్నారు. క్షణక్షణం వలయంగా దగ్గర దగ్గరకి వచ్చేస్తున్నారు.

ట్రియానాకు హడలెత్తిపోయింది. అతని నరనరాల్లోకి చలిగుబుల్లా భయభ్రాంతి ప్రవహించిపోయింది తన్ను తాను రక్షించుకోవటానికి యీషణ్మాత్రమైనా ప్రయత్నం చెయ్యలేకపోయాడు. ఏమి చెయ్యటానికీ తోచక పైన తొడుక్కున్న గౌను బ్రరున చించేసి లోపల జేబులోనుంచి నోట్లకట్టలు తీశాడు.

'ఈగో! ఇవి తీసుకోండి...ఇవి తీసుకోండి' అంటూ అంగలార్చాడు.

నోట్లు అతనిచేతుల్లోనుంచి జారి క్రిందపడి చెల్లాచెదరైనై—వాటిని అజబట్టినవారే లేరు. ఆ నోట్ల మీదుగా పాదాలు నడచివచ్చి చుట్టుముట్టాయి.

'రక్షించండి!' అని అరిచాడు. అతని అరుపు అతనికే నిర్జీవంగానూ అస్పష్టంగానూ వినిపించింది. 'రక్షించండి! రక్షించండి!'—

కళ్లూ ముఖాలూ దగ్గిరికి వచ్చేసినై. కత్తులు తళతళలాడినై — ఒకేఒక ఆక్రందన — అనంతరం నిశ్శబ్దం. పైన రాబందులు వలయాలు తిరుగుతూ క్రిందిక్రిందికి దిగివస్తున్నయ్:

భోజనసమయానికి ట్రియానా రహదారి బంగళాకు తిరిగిరాలేదు. కాని అక్కడవున్న వాళ్లు యిందుకు అంతగా ఆందోళన పడలేదు. కాని ఉన్నట్టుండి దూరాన డోళ్ల మోత వినిపించటంతో డక్కపడ్డారు.

ఆదిలో నిమ్మ్రదినిమ్మ్రదిగా వినుపించుతున్న ఆ భేరీనినదాలు రానురాను భయదంగానూ ముమ్మరంగానూ వినిపించసాగినై. ఆ భేరికానినాదాల భీభత్సరావాలతో వాయుగర్భం దద్దటిల్లిపోతోంది. ఆ భీభత్సరావాలతో కలసి ఏవో మంత్రోచ్చాటనలుకూడా వినిపించుతున్నయ్; ఆ భేరీనినదాలతో బంగళా మార్మ్రోగిపోతోంది.

వాళ్లు ట్రియానాను వెదకటానికి బయలుదేరారు. చుట్టూ ఎక్కడచూసినా డోళ్లే అమితోత్సాహంతో ఆవేశంగా బాది పారేస్తున్నారు. కాని ట్రియానా భోగట్టా యిచ్చేవారు ఒక్కరూ లేరు ఆ ప్రశ్న అడగగానే, అర్థంకానట్టు శూన్యముఖాలు వేసి తలలు ఎగరేసుకుంటూ ఎవడి దోవను వాడు వెళ్ళిపోతున్నాడు.

దూరాన ఒకచోట రాబందులు గుంపుగా మూగివుండటం గుర్తించి, అక్కడికి చేరుకున్నారు. అప్పటికే ఆ కళేబరం పోల్చటానికి వీల్లేని స్థితిలో వుంది. ఆకళేబరాన్ని ఒక తెల్లటి దుప్పటిలో చుట్టి సామాన్ల వానులో పెట్టారు. దిగులు దిగులుగా ఏడుస్తూ జార్డన్ సతి కారులోకి ఎక్కింది. హెలెన్ ముఖం తెల్లగా పాలిపోయింది. ప్రీతమ్‌సింగ్ వంక మౌనంగా చూస్తోంది. అతన్ని యేదో అడగాలనుకుంటోంది గాని గుండెచాల్లేదు. మామూలు మౌనగంభీరధోరణిలో ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తిచేసుకుని ప్రీతమ్‌సింగ్ కార్లోకి ఎక్కాడు. కారు బయలుదేరేసరికి వర్షం ప్రారంభమైంది.

చినుకులు చినుకులుగా ప్రారంభమైన జల్లు ఇట్టే కుంభవృష్టిగా మారిపోయింది. వర్షం ఎడాపెడా దంచుతుంటే కారు టాపూ చట్రం మోతెత్తిపోతోంది.

కారులోవున్న ముగ్గురూ ఒకరి ముఖంవంక ఒకరు మౌనంగా చూసుకున్నారు. అంత కుంభవృష్టిలోనూ విజయావేశంతో భేరికానినాదాలు దూరాన్నుంచి యింకా వినిపించుతూనే వున్నయ్. ఆకలిగావున్న ఆభూగర్భం, ప్రాణప్రదమైన జలసేచనంతో తిరిగి చైతన్యతను పొంది దిగ్దిగంతాలూ మార్మ్రోగేలాగు అంకెలు వేస్తోంది!

# * జర్మనీ పునర్జన్మ *

శ్రీ పి. శ్రీరాములు

కొన్నేళ్ళక్రితం ఒక విదేశీ యాత్రికుడు జర్మనీలో పర్యటనచేస్తూ ఒక హోటలులో బస చేసున్నాడట. ఆ రోజంతా మబ్బుగావుండి చలి గాలి వీస్తున్న కారణంచేత, ఆయన బసలో నే వుండిపోయాడట. ఒక జర్మన్ కుర్రవాడు తానున్న గది వద్దకు రాగా, "ఇవ్వాళ వాతావరణం ఎంత అసహ్యంగావుందో చూడు!" అని ఆ యాత్రికుడు ఆ కుర్రవాణ్ణి పలకరించాడట. "ఈ అసహ్యపు గాలి ఫ్రాన్సు దిక్కునుంచే వీస్తున్నది. ఆ పాపిష్టిదేశం మూలనుంచి ఇంతకంటె మంచిగాలి ఎ  వీస్తుంది?" అని ఆ 15 ఏళ్ళ కుర్రవాడు తడుముకోకుండా బదులు చెప్పాడట. జర్మనీ ఫ్రాన్సులమధ్య తరతరాలుగా వస్తున్న శత్రుత్వం ఎంత ప్రబలమైనదో ఈ చిన్న సంఘటనను బట్టి ఊహించవచ్చు.

అంతర్జాతీయ రాజకీయాలలో—ముఖ్యంగా యూరప్‌ఖం వ్యవహారాలలో—జర్మనీ ఫ్రాన్సుల బద్ధశత్రుత్వానికి విశేష ప్రాధాన్యం వున్నది ఇది ఈనాడు కొత్తగా ఏర్పడిన వైరంకాదు. కొన్ని శతాబ్దాలనుంచీ వరుసగా వస్తున్నది క్లిష్టమైన అనేక ప్రపంచ సమస్యల పరిష్కారానికి ఫ్రాన్సు జర్మనీల శత్రుత్వం ఇదివరలో ప్రబలమైన అంతరాయంగా పరిణమించింది. ఇకమీదకూడా పరిణమిస్తూనే వుంటుందేమో ననుకోవలసి వస్తున్నది. యూరప్ ఖండంలో భవిష్యదశాంతినీ, సంఘర్షణలనూ నివారించాలంటే ఫ్రాన్సు జర్మనీల చిరకాల శత్రుత్వం పూర్తిగా సమసిపోయేట్లు చేసి, ఉభయ రాజ్యాలమధ్యా సంపూర్ణ సామరస్యం ఏర్పడేటు చేయడం అతి ప్రధానం

చరిత్రకారులు 1914 లో సంభవించిన ప్రథమ ప్రపంచయుద్ధానికి ముఖ్య కారణాలు మూడని వ్యక్తీకరిస్తారు. (1) సంప్రదాయసిద్ధంగా వస్తున్న ఫ్రాన్సు జర్మనీల శత్రుత్వం. (2) బ్రిటన్ జర్మనీల వైరభావం (3) రష్యా ఆస్ట్రియాల స్పర్థ. ఆ యుద్ధంలో జర్మనీ పూర్తిగా పరాభూతమై, దాని సామ్రాజ్య భూభాగాలను ఎక్కటి వాటిని అక్కడ ఉత్తరించి వేసినప్పటికీ, దాని నౌకాబలాన్ని పూర్తిగా హతమార్చి వేసినప్పటికీ, ఫ్రాన్సు జర్మనీల శత్రుత్వం మాత్రం సమసిపోలేదు. దాదాపు 90 సంవత్సరాల క్రితం జర్మనీ ఏకీకరణకర్త, బిస్మార్క్ మహాశయుడు ఆల్సేస్, లొరెయిన్ అనే రెండు ఫ్రెంచి రాష్ట్రాలనూ జర్మనీలో కలిపివేసుకోవడంతో ఈ రెండు దేశాల శత్రుత్వం ప్రారంభమైందంటారు. ఆల్సేస లొరెయిన్‌లు తిరిగి ఫ్రాన్సుకు సంక్రమించినపిమ్మట కూడా ఈ వైరం మరీ ఎక్కువైంది గాని, తగ్గలేదు.

ఐతే, ఫ్రాన్సు జర్మనీలమధ్య ఈ ప్రబల శత్రుత్వానికి కారణ మేమిటి? ఫ్రాన్సుపట్ల జర్మనీవైఖరీ, జర్మనీపట్ల ఫ్రాన్సు వైఖరి శత్రుత్వ రూపంలో ఏవిధంగా మరీ మరీ ఘనీభవిస్తూ వచ్చినవనే విషయాలను పరిశీలిద్దాము. ఫ్రెంచి, జర్మన్ ప్రజల మనోగత భావాలలోనే, మానసిక ప్రవృత్తులలోనే జీవిత దృక్పథాలలోనే కొన్ని ప్రధానమైన వ్యత్యాసాలు కొట్టవచ్చినట్లు కనబడుతవి.

యూరప్ ఖండంలోని ఇతర రాజ్యాల మాదిరిగా ఈ ఉభయదేశాల ప్రజలు కూడా క్రిస్టియన్ మతానికి చెందినవారే. జర్మన్ ప్రజలలో అధిక భాగం ప్రొటెస్టెంట్ శాఖవారు ఫ్రెంచి ప్రజలు కాథలిక్కులు. ఐతే తామవలంబించే మతంలో శాఖాభేదం వున్నంతమాత్రాన రెండు జాతులమధ్య బద్ధవైరం పెంపొందవలసిందేనా? ఇంతే కాదు, ఫ్రెంచి జర్మన్ ప్రజల జాతీయ లక్షణాలలో కూడా కొన్ని వ్యత్యాసాలు గోచరిస్తవి.

ప్రతి జర్మన్ పౌరుడూ ఒక మహాయంత్రంలో తానొక భాగమనే భావంతో క్రమశిక్షణతో పని చేయడంలో ఘటికుడని ప్రతీతి. పైనుంచి వచ్చే ఆదేశాలు స్వీకరించడంలో వాటిని శిరసావహించడంలో అతడికి అతడే సాటి. ఆవిధంగా ఆదేశాలను శిరసావహించడంలో జర్మన్ పౌరుడు విపరీతమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. ఈ విషయంలో ఫ్రెంచి జర్మన్ ప్రజలమధ్య ఉత్తర దక్షిణ ధృవాలకున్నంత

వ్యత్యాసం వున్నది. ప్రతి ఫ్రెంచిపౌరుడికి వ్యక్తిత్వ ప్రతిభ హెచ్చు. జర్మన్‌ప్రజలు సహజంగా ఆదర్శ వాదులు; అవసరమైతే అఖండ కార్యశూరులు; ఫ్రెంచివారిలో కార్యశూరత్వం అంతగా లేక పోయినా, అద్భుతమైన ఇంగితజ్ఞానం గోచరిస్తుంది; ఏవిషయానికైనా ఫ్రెంచివారు ఆచరణలో సాధ్యా సాధ్యాలను బహుజాగ్రతగా పరిశీలిస్తారు.

జాతీయ భావోద్రిక్తుడైనప్పటికీ, అన్ని తర హాల మనుష్యులతో జర్మన్‌పౌరుడు కలసి మెలసి సంచరించగలడు. దేశపర్యటనలన్నా, ఇతరులను కలుసుకొని ముచ్చటించడమన్నా జర్మన్లకు మహా సరదా. తాము తప్పుచేయడమంటూ జరగదనీ, తమ సమస్తవ్యవహారాలు దైవప్రేరితాలై సర్వదా సవ్య మైనమార్గాన నడుస్తూంటవని ఫ్రెంచివారి విశ్వాసం.

తమ జాతిఒక్కటే మహోత్కృష్టమైనదనీ, ఇతరజాతులన్నీ తమముందు బలాదూరనీ జర్మన్లు ప్రదర్శించే దురహంకారం ఫ్రెంచివారిలో మందు కైనా కానరాని మాట వాస్తవం. తన విజ్ఞానాన్నీ, విశిష్టసంప్రదాయాన్నీ చూసుకుని గర్వపడినప్పటికీ ఇతర నాగరికతలలో ఉత్కృష్టమైనదని తోచే దాన్నికూడా జీర్ణించుకోగల శక్తి జర్మన్ పౌరుడికి వున్నది. ఫ్రెంచివారి ధోరణి అలాంటిదికాదు. మహోత్కృష్టమైన మానవ నాగరికత అంతా తమ దేశంలోనే—ముఖ్యంగా పారిస్ మహానగరంలోనే —నిస్సందేహంగా మూర్తీభవించిందనీ, మహోన్నత మైన స్థాయిని అందుకున్నదనీ ఫ్రెంచిజాతి విశ్వాసం.

అగ్నిపర్వతాన్ని సైతం బద్దలుచేసి వేసేటంత అశాంతి లోలోపల వున్నప్పటికీ, అత్యద్భుతమైన మనోనిబ్బరాన్ని ప్రదర్శించగల నిండుకుండ జర్మన్ పౌరుడు. తొణకడు; బెణకడు: ఎంత ప్రధానమైన విషయంమీదనైనా ముభావాన్ని పాటించగలడు. ఫ్రెంచి పౌరుడిలో సహృదయత, సంఘ జీవితాభి లాష ఎక్కువ. ఎంత క్లిష్టసమస్యనైనా అతి క్షుణ్ణంగా అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తాడు జర్మన్ పౌరుడు. ఫ్రెంచి పౌరుడు అలాకాదు; ఏ విషయాన్నైనా అతి చులకనగా తీసుకుంటాడు. లోతుకు పోక పైపైనే పరిశీలిస్తాడు. ఏ విషయాన్ని అర్థంచేసుకోవలసి వచ్చినప్పటికీ జర్మన్ పౌరుడికి విధిగా కొంత వ్యవధి పడుతుంది. ఫ్రెంచి పౌరుడు సూక్ష్మవిషయాన్ని కూడా చిటికెలో గ్రహించినట్లు కనబడుతాడు.

జర్మన్ ప్రజలు వళ్లు దాచుకోరు; కష్టపడి పని చేస్తారు; ఫ్రెంచి ప్రజలకు తెలివితేటలు ఎక్కువ. జర్మన్ ప్రజలు వేళాకోళాన్నీ, చమత్కారాన్నీ సహించలేరు; ఫ్రెంచివారికి చమత్కారం ఉగ్గు పాలతో అబ్బిన విద్య. ఎంత అల్పమైన విషయా న్నైనా జర్మన్ దేశీయుడు విసుగుపుట్టేలా వర్ణిస్తాడు; ఫ్రెంచివారు భాషాకోవిదులనీ, వారి సారస్వత శైలి నిరుపమాన మైనట్టిదనీ సమస్త సభ్యతా ప్రపంచానికీ తెలిసిన విషయమే.

ఈవిధంగా జర్మన్, ఫ్రెంచిజాతుల విలక్షణ లనుగురించి ఎంతైనా చెప్పవచ్చు. ప్రపంచంలో భిన్నమనస్తత్వాలు, విభిన్న జాతీయ లక్షణాలు, జీవిత దృక్పథాలుగల జాతులు అనేకం వున్నవి. ఇంత మాత్రంచేత ఒక జాతి మరొక జాతిపై శాశ్వతంగా కత్తికట్టవలసిన పనిలేదు. కాని జర్మనీ ఫ్రాన్సుల వ్యవహారాలు మాత్రం శత్రుత్వపంథాలోనే సాగు తున్నవి. ఫ్రాన్సు అంటే జర్మనీకి భయం; జర్మనీ అంటే ఫ్రాన్సుకు హడల్. ఈ రెండుదేశాలు పర స్పర శత్రుత్వాన్ని చిరకాలంగా విషవృక్షంలా పెంచి పోషించుకుంటూ వస్తున్నవి.

తరతరాలుగా జర్మనీ సైనికంగా విజృంభిస్తూ వచ్చినమాట నిజమే. జర్మన్ వేదాంతులు, తాత్వి కులు యుద్ధాన్ని ప్రస్తుతించి, కీర్తించారు. ఒక జాతి మహోజ్వల ప్రతిభ సాధారణ శాంతిసమ యంలో బయటపడదనీ, యుద్ధసమయంలోగాని అది మహోన్నత స్థాయిని అందుకోదనీ హెగెల్ మహా శయుడు నిర్వచించాడు. అందుచేత ప్రజలు అను క్షణం ప్రశాంత మనస్కుల మాదిరిగా కాకుండా ప్రచండోద్వేగుల మాదిరిగా, ప్రమాద భూయిష్ఠుల మాదిరిగా జీవించడం నేర్చుకోవాలని వారు [illegible]ంచారు. 1939 మొదలు 1945 వరకూ సాగిన ద్వితీయ ప్రపంచసంగ్రామానికి కారణభూతు డైన నాజీనియంత హిట్లర్ సరిగా ఈ నిర్వచనాలనే ఆచరణలోపెట్టి అశేషప్రజానీకానికి ఘోర రక్త పాతాన్ని తెచ్చిపెట్టాడు.

ఐతే, ఒకవిషయం ఫ్రాంకో—జర్మన్ వ్యవ హారాలలో ప్రతిసారీ దండయాత్ర సాగించింది జర్మనీయేననీ, ఫ్రాన్సు నంగనాచి అనీ అభిప్రాయ పడకూడదు. యూరప్‌ఖండంలో ఫ్రాన్సుకూడా ఒక బలీయమైన సైనికరాజ్యమేననీ, ఇతర యూరపియన్ రాజ్యాలకంటే ఎక్కువగానే దండయాత్రలు సాగించిందనీ మరచిపోకూడదు. యూరప్‌లోని ఇతర

రాజ్యాలపై సాగించిన యుద్ధాలమాట అటుంచినప్పటికీ, ఒక్క జర్మనీపైనే ఫ్రాన్సు గత మూడుశతాబ్దాలలో అనేకసాగు — కొన్ని పర్యాయాలు నిష్కారణంగా కూడా దురాక్రమణలకు దిగింది. తను భూభాగాలపై ఫ్రాన్సు లెక్కగా ఇరవైసార్లు ముట్టడులు సాగించి యుద్ధానికి దిగిందని బిస్మార్క్ మహాశయుడు తన ప్రసంగాలలో పదేపదే అంటుండేవాడని చరిత్రకారులు చెబుతారు.

ఐక్య జర్మనీ ఏర్పడకుండా దాన్ని ముక్కకు ముక్కగా, చెక్కకు చెక్కగా వుంచడం మొదటి నుంచీ ఫ్రాన్సు ఏకైకలక్ష్యం. యూరప్ఖండ భౌగోళికవ్యవహారాలు, జాతీయపరిస్థితులు మూడు శతాబ్దాల క్రితం చెల్లాచెదురుగా, చిందరవందరగావున్న రోజులలో ప్రప్రథమంగా ఒకవిధమైన ఐక్యతను, సుస్థిరత్వాన్నీ సాధించిన మొదటిరాజ్యం ఫ్రాన్సు. తన ఐక్యతను భద్రపరుచుకోడానికీ, యూరప్ఖండంలో తన మాట చెలామణీని, శక్తిసామర్థ్యాలతో కాపాడుకోడానికి తమతో ఇంచుమించు సరిసమానంగా వర్ధిల్లగల జర్మనీని అనైక్యంగా వుంచడం ఫ్రాన్సుకు అవసరమైంది. 17 వశతాబ్దం పూర్వార్ధంనుంచీకూడా (రిష్లూ హయాంనుంచి) ఫ్రాన్సు జర్మనీపట్ల ఇదేఆట ఆడుతూ వచ్చింది.

ఐతే ఇక్కడ ఒక విషయాన్ని చెప్పక తప్పదు. జర్మనీని అనైక్యంగా వుంచాలని ఫ్రెంచి రాజకీయవేత్తలు చేసిన ప్రయత్నాలన్నిటిలో, వేసిన పథకాలన్నిటిలో వారు ఆశించిన ఫలితాలకు పూర్తిగా వ్యతిరేకమైన ఫలితాలు ఏర్పడినవన్నదే ఈ విషయం. ఫ్రెంచివారు తరుచూ సాగిస్తూవచ్చిన దండయాత్రల ఫలితంగానే ఐక్య జర్మన్జాతి ఆవిర్భించడం జరిగిందని చెప్పినా చెప్పవచ్చు. అందుచేతనే జర్మన్ జాతికి ఎవరైనా పితృసమానుడు వుంటే అతడు మొదటి నెపోలియన్ చక్రవర్తేనని చెప్పడం కూడా చరిత్రలో పరిపాటి అయింది. 1813 లో లీప్జిగ్ నగరంలో ఫ్రెంచివారి పరాజయం, జర్మన్ల విజయం జర్మన్జాతి విజృంభణకు బీజప్రాయమైంది.

పాతచరిత్రను వదలివేసి గత నలభైఏళ్ళ చరిత్రను చూసినప్పటికీ జర్మను వ్యవహారాలలో ఫ్రాన్సు వైఖరి ఒకేవిధంగా కనిపిస్తుంది. పశ్చిమ జర్మనీ ఆయుధ పునర్ధారణ విషయంలోనూ, దానికి సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య ప్రతిపత్తిని ప్రసాదించడంలోనూ ఇటీవల జరిగిన అంతర్జాతీయ సమావేశాలలో ఫ్రెంచినాయకులు బిడాల్, ప్లెవెన్, మెండెస్ ఫ్రాన్సు ప్రభృతులు ఎంత మొండిపట్టుదలను చూపారో ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం అప్పటి ఫ్రెంచి అగ్రనాయకుడు ముష్యూర్ క్లెమెన్సో, పాయింకేర్, మార్షల్ ఫాక్ ప్రభృతులు కూడా అంతే పట్టుదలను, మొండిధోరణిని ప్రదర్శించారు. అప్పటి అమెరికా అధ్యక్షుడు కీర్తిశేషుడు విల్సన్ మహాశయుడు ప్రవచించిన పధ్నాలుగు సూత్రాలపై శాంతిస్థాపన జరిగే షరతులమీద యుద్ధవిరమణకు జర్మనీ సమ్మతించింది. ఆచరణలో ఆ సూత్రాలకు క్రమక్రమంగా నీళ్ళు వదలడం జరిగింది. పధ్నాలుగు సూత్రాలపై జర్మనీతో యుద్ధవిరమణ ఒప్పందం చేసుకోవడం ఫ్రెంచి నాయకుడు క్లెమెన్సోకు ఎంతో హాస్యాస్పదంగా కనిపించిందట. "ఏసుప్రభువులాంటివాడు పది సూత్రాలతో తృప్తిపడ్డాడు. జర్మనీతో యుద్ధవిరమణకు పధ్నాలుగు సూత్రాలేమిటి?" అని ఆయన అవహేళన చేశాడని అంటారు.

ఒకవిధంగా చూస్తే జర్మనీని చూస్తే ఫ్రాన్సు ఇంత భయపడడం సహజమేనేమో అనిపిస్తుంది. గత నలభైసంవత్సరాలలో సంభవించిన రెండు ప్రపంచయుద్ధాలలోనూ చివరకు జర్మనీ ఓడిపోవడం సంభవించినప్పటికీ, జర్మనీ ఓటమిని ఒక్క ఫ్రాన్సు మాత్రమే సాధించలేదు. మిగతా ప్రపంచమంతా ఏకమై జర్మనీని ఓడించడం జరిగింది. మరొకసారి జర్మనీ సైనికంగా తమపై విజృంభిస్తే, ఇతరరాజ్యాలన్నీ ఏకమై తమపక్షాన జర్మనీని ప్రతిఘటిస్తవనే నమ్మకం ఏమున్నదని మొదటి ప్రపంచయుద్ధానంతరం ఫ్రాన్సు విపరీతంగా భయపడ్డది. దాదాపు ఐదుసంవత్సరాల పాటుసాగిన తొలి ప్రపంచయుద్ధమంతా అమెరికన్ భూభాగంమీదగాని, బ్రిటిష్ భూభాగంమీదగాని గాక, ఫ్రెంచి భూభాగంమీదే ఎక్కువగా సాగింది. అందుచేత మిగతా రాజ్యాలకంటే ఫ్రాన్సుకు సంభవించిన నష్టం అపారం. జర్మనీ శక్తివిహీనంగా వుండాలని ఫ్రాన్సు కోరిందంటే ఆశ్చర్యంలేదు.

చరిత్రకు పునరావృత్తిదోషం వున్నదంటారు పెద్దలు. ద్వితీయ ప్రపంచసంగ్రామం సమాప్తమై

తొమ్మిదిసంవత్సరాలు నిండి పదోసంవత్సరం జరుగుతున్నది. యుద్ధసమాప్తదశలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులఫలితంగా పశ్చిమజర్మనీని బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాలు, తూర్పు జర్మనీని సోవియెట్ రష్యా ఆక్రమించడం జరిగింది. అభాగ్య జర్మనీ, ఆక్రమణాధికారంవహిస్తున్న అగ్రరాజ్యాల అహమహమిక క్రింద పదేళ్లనుంచీ నలిగిపోతూ వచ్చింది. మొత్తం జర్మనీలో మూడింట రెండువంతులభూభాగం పశ్చిమ రాజ్యాలక్రింద, ఒకవంతు రష్యాక్రింద వుండిపోయినవి. పశ్చిమ జర్మనీ జనాభా దాదాపు 5 కోట్లు వుంటే, తూర్పు జర్మనీ జనాభా రెండుకోట్లవరకూ వున్నది తన అధీనంలోవున్న తూర్పు జర్మన్లకు రష్యా కమ్యూనిస్టు సిద్ధాంతాలను నూరిపోసింది. ఆరు, 36 సంవత్సరాలమధ్య వయస్సుగల పిల్లలను, యువకులను అందరినీ స్వతంత్ర యువజనోద్యమంలో సభ్యులుగా చేర్చింది. అర్థసైనికాధికారంతో వ్యవహరించే ప్రజా పోలీసుదళాలను సైతం రష్యా నిర్మించింది. మాజీనాజీ అధికారులయాజమాన్యాన 'జాగృత సంఘాలను' స్థాపించింది.

పశ్చిమ యూరప్‌లో కమ్యూనిజం వ్యాప్తిని ఎదుర్కొనడానికి పశ్చిమ అగ్రరాజ్యాలు ఇతర యూరపియన్ రాజ్యాల సహకారంతో సమష్టి రక్షణ వ్యవస్థాస్థాపనకు పూనుకొని పనిచేసినవి. దానిఫలితమే ఉత్తర అట్లాంటిక్ రక్షణవ్యవస్థ. ఈ వ్యవస్థలో పశ్చిమ జర్మనీకికూడా స్థానమిచ్చి దానిద్వారా 12 జర్మన్ సైనికదళాలను చేర్చాలని బ్రిటన్ అమెరికాలపథకం. ఈ పథకాన్ని ఆచరణలో పెట్టాలంటే అడుగడుగునా ఫ్రెంచి ప్రాతికూల్యాన్ని నిన్న మొన్నటివరకూ ఎదుర్కొనవలసి వచ్చింది.

సరిగా నాల్గు సంవత్సరాల క్రితం 1950 అక్టోబరులో అప్పటి ఫ్రెంచి ప్రధాని ప్లీవెన్ తన పార్లమెంటులో యూరపియన్ రక్షణ వ్యవస్థ నిర్మాణానికి ఒక పథకాన్ని ప్రవేశపెట్టాడు. తర్వాత ఐదునెలలకు 1951 ఫిబ్రవరిలో బెల్జియం, హాలెండు, లక్సెంబర్గ్, ఫ్రాన్సు పశ్చిమ జర్మనీల ప్రతినిధులు ప్యారిస్‌లో సమావేశమై ఆ పథకం మంచి చెడ్డలను పరిశీలించారు. ఆ పిమ్మట 1952 మే 27. న యూరపియన్ రక్షణ వ్యవస (ఇదే ఇ. డి. సి.—యూరపియన్ డిఫెన్సు కమ్యూనిటీ) ఒప్పందంపై ఆ ఆరు రాజ్యాల విదేశాంగ మంత్రులు సంతకాలు చేసుకున్నారు. ఈ ఆరు రాజ్యాలలో ఏ ఒకదానిపై దండయాత్ర జరిగినా ఆరు రాజ్యాలమీద జరిగినట్లే భావించాలన్నది ఆ ఒప్పందంలోని ప్రధానాంశం. ఫ్రాన్సుఒప్పందంపై సంతకమైతే చేసిందిగాని, జర్మనీ అంటే తమకున్న భయాందోళనల కారణంచేత, అతి తరుచుగా మనస్సు మార్చుకొని మాటతప్పడం ప్రారంభించింది. బొగ్గు, ఇనుము పుష్కలంగా లభ్యమయే సార్ మండలం భవిష్యత్తును జర్మనీతో ముందు తేల్చుకోవాలని ఫ్రాన్సు పట్టుపట్టింది. సార్ మండలం తమదే నని ఫ్రాన్సు, కాదు తమదని జర్మనీ కీచులాడుకోవడం మొదలుపెట్టినవి. సార్ సంగతి తేలిస్తేనేగాని యూరప్ రక్షణ వ్యవస్థను తాము ధృవపరిచేదిలేదని అప్పటి ఫ్రెంచి విదేశాంగ మంత్రి జార్జిబిడాల్ఫ్ ఫ్రెంచి ఎగువ సభలో ఖండితంగా ప్రకటించివేశాడు. ఫ్రాన్సు జర్మనీలు తమ స్పర్థలుమాని సామరస్యంతో భాగస్వాముల వలె మెలగాలని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ఎంత లాలనచేసినా, అమెరికన్ సహాయం బంద్ అవుతుందని అమెరికా విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్ ఎంత తీవ్రమైన హెచ్చరిక చేసినా చివరకు మొన్న ఆగస్టు నెలలో యూరప్‌రక్షణవ్యవస్థపై ఫ్రాన్సు అనుకున్నంత పనీ చేసింది. ఆ వ్యవస్థ ఒప్పందాన్ని ధృవపరచడానికి ఫ్రెంచి పార్లమెంటు దిగువసభ నిరాకరించింది. యూరప్ రక్షణ వ్యవస్థ మృతప్రాయం కావడంతో ఫ్రెంచి ప్రధాని మెండెస్‌పని అస్తవ్యస్తంగా మారింది. యూరప్ రక్షణకు బ్రిటిన్ అమెరికా, కెనడాలు వేసిన పథకం తారుమారైపోయింది. ఉత్తర అట్లాంటిక్ రక్షణ శ్రేణిలో పెద్ద గండి కొట్టినట్లయింది. పశ్చిమ జర్మనీ సప్లయిచేసే 12 సైనికదళాలు లేకపోతే, కమ్యూనిజంపై ధ్వజమెత్తడానికి సాగిస్తున్న వ్యూహరచనలో పశ్చిమ అగ్రరాజ్యాల ఆట కట్టినట్లే.

ఈ ప్రమాదాన్ని గమనించే ఫ్రాన్సును లొంగదీయడానికీ, యూరప్ రక్షణవ్యవస్థ స్థానే ప్రత్యామ్నాయ వ్యవస్థను అన్వేషించడానికి మొన్న అక్టోబరునెల ప్రారంభంలో బ్రిటిష్ విదేశాంగమంత్రి

ఆంథోనీ ఈడెన్ తొమ్మిదిరాజ్యాల సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. ఆంథోనీఈడెనే ఆ సభకు అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించాడు. పశ్చిమ జర్మనీని సైనికంగా పునరుద్ధరించడానికీ, దానిపై మూడు అగ్రరాజ్యాల ఆక్రమణాధికారాలను రద్దుచేయడానికీ ఈ సభలో ఒప్పందం కుదిరింది. పశ్చిమ యూరప్ సమాఖ్యలోనూ, తద్వారా ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థలోనూ పశ్చిమ జర్మనీకీ, దానితోపాటు ఇటలీకీ కూడా సభ్యత్వం లభ్యమైంది. యూరపియన్ స్వతంత్రరాజ్య శ్రేణిలో పశ్చిమజర్మనీకి తిరిగి పదేళ్లకు సెలవుగా ఈనాటికి సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య ప్రతిపత్తి ఏర్పడుతున్నదన్నమాట. చివరవరకూ పేచేలు పెడుతూనేవచ్చిన ఫ్రాన్సుకూడా లొంగివచ్చి ఈ ఒప్పందాలకు సమ్మతించింది. ప్రధాని మెండెస్ ఫ్రాన్సుపై తమ విశ్వాసాన్ని ప్రకటించడంద్వారా ఫ్రెంచి పార్లమెంటుకూడా వీటిని ధృవపరిచింది. యూరప్ రక్షణవిషయంలో లోగడ జరిగిన బ్రస్సెల్స ఒప్పందం అమలులోవుండే 50 ఏళ్లపర్యంతం (మితిమీరిన ఇతర అవసరాలేవీ రాకపోతే) యూరప్ ఖండంలో నాల్గు సైనికదళాలను, కొంత విమానబలాన్ని వుంచడానికి బ్రిటన్ హామీ ఇచ్చింది. ఈ బ్రస్సెల్స ఒప్పందం 1998 వరకూ అమలులో వుంటుంది. బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన ఈ హామీ ఫ్రాన్సుతోసహా మిగతాఅన్ని యూరపియన్ రాజ్యాలకు విశేషసంతృప్తినీ, ధైర్యాన్నీ కలిగించింది.

ఈవిధంగా సైనికంగా పునర్జన్మ ఎత్తుతున్న జర్మనీ తూర్పు పశ్చిమజర్మనీలుగా విభక్తమయ్యేవుంటుందో లేక ఏకమవుతుందో చూడాలి. జర్మనీ ఏకీకరణవిషయంలో రష్యాతో అవసరమైన సంప్రదింపులు జరపడానికీ పశ్చిమ బెర్లిన్ పైమాత్రం పశ్చిమ అగ్రరాజ్యాలే ఆధ్వర్యం వహించాలనే షరతుకు కూడా లండన్, పారిస్ సమావేశాలలో ఒప్పందం కుదిరింది. సమితిలో భారతప్రతినిధి శ్రీ వి. కె. కృష్ణమీనన్ సూచనప్రకారం తూర్పు పశ్చిమ జర్మనుల మధ్య ముఖాముఖి చర్చలు జరిగితే, అచిరకాలంలోనే జర్మనీ ఏకీకరణసైతం సాధ్యపడవచ్చు.

# * పులిసిద్దప్ప భార్య *

శ్రీ కె. ఎ. ఎన్. రావు

★ ★ అఖిల భారత పోటీలో తృతీయ బహుమతి నందిన కథ; శ్రీ కె. ఎ. ఎన్. రావుగారు ఈ కథను కన్నడభాషలో రచించి పోటీలో పాల్గొన్నారు. కన్నడభాష పోటీలో ఈ కథకు ప్రథమ బహుమతి (రు. 175 లు) వచ్చింది. అఖిల భారతపోటీలో లభించిన బహుమతి రు. 750 లు.

రావుగారి వయస్సు 42 సం॥ లు; కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో, ఎంజినీరింగ్ శాఖలో రీడరుగా పనిచేస్తున్నారు. వీరు కన్నడ సాహిత్యంలో 12 సంవత్సరాలుగా నిర్విరామంగా కృషిచేస్తున్నారు. ఇంతవరకు మూడు నవలలు, మూడు నాటకాలూ, ఆరు ఏకాంకికలు, 70 కథలూ, 8 హాస్య రచనలు, అనేక ఖండకావ్యాలూ, ఒక ప్రబంధం రచించారు: అనేక పోటీలలో పాల్గొని బహుమతులు పొందారు. క్రిందటితూరి జరిగిన ప్రపంచ కథానికల పోటీలోకూడా కన్నడభాషలో 'గంగు' అనే వీరి కథకు ప్రథమ బహుమతి వచ్చింది. కాని నిర్ణీతసమయానికి ముందుగానే ఆ కథ ప్రచురింపబడటంచేత జాతీయ పోటీకి అంగీకరింపబడలేదు. ★ ★

గజదొంగ పులిసిద్దప్ప హోస్‌దుర్గ్ తాలూకాలోనేగాక చిత్రదుర్గ్ జిల్లాజిల్లా పేరుమోగాడు. ఒకసారి హోస్‌దుర్గ్ కొండల మధ్యనుంచి పోతుండగా ఒక పెద్దపులి అతనికి తారసిల్లింది. సిద్దప్ప అమాంతం దానిమీద విరుచుకుపడి దాన్ని గొంతుపిసికి చంపేశాడు. అప్పటినుంచీ అతన్ని పులిసిద్దప్ప అనటం మామూలైంది. ఆ ప్రాంతంలో ప్రతి ప్రాణికీ అతని పేరువింటే సింహస్వప్నం. గుసగుసలాడుకోవలసిందే తప్ప ఎవ్వరూ అతన్నిగురించి మాట్లాడుకోరు. మనం చిన్నపిల్లల్ని భయపెట్టాలంటే అదుగో బూచాడొస్తున్నాడు పడుకోమంటాం. అక్కడి తల్లులు అదుగో పులిసిద్దప్ప వచ్చేస్తున్నాడని భయపెడతారు. వాడు చెయ్యని దుండగాలు లేవు; గ్రామాలకు గ్రామాలు తగలబెట్టాడు; ఎందరో స్త్రీలను మానభంగం చేశాడు; ఎన్ని దోపిడీలు చేశాడో, ఎన్ని హత్యలు చేశాడో లెక్కేలేదు. అతని కంటబడ్డ తరవాత బ్రతికి బయటబడ్డవా డొక్కడూ లేదు. రహస్యంగానైనా సరే వాణ్ని గురించి పల్లెత్తుమాట యెవడేనా నోరుజారాడంటే వాడు చచ్చాడన్నమాటే. ఇంత చేస్తున్నా వాణ్ణి పట్టుకున్నవా డెవడూ లేడు. వాడంటే అలాంటి వాడనుకుందామా? లేక పోలీసుల్ని కట్టుకున్నాడేమో ననుకుందామా?

ఉన్నట్టుండి ఒక ప్రభుత్వోద్యోగిని హత్య చేశాడు. అధికారులంతా కూర్చుని ఆలోచించారు. సబ్‌ఇన్‌స్పెక్టర్ భీమారావును హోస్‌దుర్గ్‌కు పంపించారు. భీమారావు చాలా చురుకైనవాడు, నిప్పులాంటి మనిషి. ఇంతేగాదు: సిద్దప్పని పట్టితెచ్చిన వారికిగాని పట్టుకోటానికి తగిన ఆచూకీ యిచ్చిన

వారికి గాని ఇరవై వేల రూపాయల బహుమతి నిస్తామని ప్రభుత్వంవారు ప్రకటించారు.

సిద్దప్పను పట్టుకోవటానికి రెండు సంవత్సరాల పాటు, భీమారావు నానా తిప్పలూ పడ్డాడు. లాభం లేకపోయింది. డబ్బుమీది ఆశతో, సిద్దప్పను పట్టియిచ్చే ప్రయత్నంలో యిద్దరు అభాగ్యులు ఇప్పటికే హతమారిపోయారు. ఇక ఆ బహుమతికోసం ప్రయత్నించినవాడు మరొకడెవడూ లేడు. భీమారావుకు కూడా క్రమేపీ నరాలు సళ్లిచ్చిపోతున్నయ్; ఆత్మవిశ్వాసం సన్నగిలిపోతోంది. ఏ ప్రయత్నాని కుపక్రమించినా దగాపడి అష్టకష్టాల్లో చిక్కుకోవడం మినహా లవలేశమైనా ప్రయోజనం కనుపించటంలేదు. ప్రజలకు అంతకుముందే హడలు, అతని కేపాటి సహాయంచేసినా కొంప మునిగిపోతుందనే ఉద్దేశం; పిలిచినా పలకరు. సానుభూతి లేకపోగా పరాభవ పరంపరలతో అపహాస్యపాత్రుడౌతున్నాడు. వీటన్నిటినీ తలదన్ని అతన్ని బదిలీ చేసి వేస్తారని కూడా పుకారు బయలుదేరింది.

ఈవార్త ఆదిలో అతనికి కొంత నిరుత్సాహాన్ని కలిగించినా, అతనిలోని పౌరుషాన్ని రెచ్చగొట్టి కార్యదీక్షను యినుమడింపజేసింది. ట్రాన్సుఫర్ ఆర్డర్ వచ్చేలోగా ఎలాగైనాసరే సిద్దణ్ణి పట్టితీరాలని కంకణం కట్టుకున్నాడు. ప్రాణానికి తెగించైనా పోరాడాలనుకున్నాడు.

ఇలాటి దాడులు లోగడ ఎన్నో చేశాడు. సిద్దప్ప యేదో ఒక యింట్లోకో పొలంలోకో మరో సంకేత స్థలంలోకో వస్తున్నాడని అనుమానించటం, తీరా పరివారంతో పోయి ఆ ప్రదేశాన్ని ముట్టడించితే, వాడు ఏ కాపలామనిషిగానో, ఏ మామూలు సన్నరకం దొంగగానో తేలడం—ఇదీ తంతు.

ఇలా ఉండగా ఒకనాటి ఉదయం, ఉన్నట్టుండి అతనికి ఒక కబురొచ్చింది.

ఆ క్రితంరాత్రి సిద్దడు, రామగిరిపట్నం పొలిమేరలో వున్న ఒక సారా దుకాణంలోకి వచ్చినట్టు తెలిసింది. సిద్దడులోపలికివచ్చేసరికి దుకాణదారుభార్య ఒకర్తె వుంది; సిద్దణ్ణి గుర్తుబట్టి హడిలి మూర్ఛపోయింది. సిద్దడు బుడ్డిమీద బుడ్డి ఇష్టం వచ్చినట్టు తాగేస్తున్నాడు. ఇంతలో దుకాణదారు ఎక్కణ్ణుంచో లోపలికొచ్చాడు. సిద్దడు ఆ వచ్చినవాణ్ణి అమాంతం నోట్లో గుడ్డలు కుక్కి కాళ్ళూ చేతులూ కట్టిపడేశాడు. ఒక సారా సీసా ఎత్తి మూర్ఛపడున్న దాని ముఖాన గుమ్మరించాడు. దానికి కాస్త తెలివొచ్చి



రచయిత

కన్ను విప్పింది.—గల్లాపెట్టె చంకనెట్టుకుని సిద్దడు గడపదాటుతున్నాడు. పోతూ పోతూ వెనక్కు తిరిగి 'ఇదిగో! నేను వచ్చెళ్లినట్టు ఎక్కడన్నా నోరు మెదిపావో చచ్చావన్నమాటే! ఈలుంటే రేపే మళ్ళీ వత్తాను' అని దబాయించి మరీ పోయాడు.

నిజంగా ఇదంతా బయటికి పొక్కేదే గాదు. కర్మంజాలక ఒకత నెవరో లోపలికి వచ్చి దుకాణదారు కట్టిపడేసివుండటం చూసి గల్లంతు చేశాడు. ఆ వూరి హెడ్ కానిస్టేబులు హనుమంతు కొంచెం ధైర్యంచేసి, తనకు నమ్మకమున్న కానిస్టేబుల్ కు ఒకడికి బిచ్చగాడివేషం వేసి భీమారావుదగ్గిరికి పంపాడు. భీమారావు తన దళాన్ని తీసుకుని మధ్యాహ్నానికల్లా ఆప్రాంతానికి వెళ్లాడు. పొద్దుగూకేదాకా కొండల్లో దాక్కున్నాడు. చీకటిబడ్డాక సారాదుకాణం దగ్గిరికి చేరి చాటునుండి తెల్లవార్లూ కాపలా గాశాడు. భళ్లున తెల్లారిపోయింది. సిద్దడు మాత్రం ఎక్కడా పత్తా లేడు. ఇల్లాంటి 'డుంకీ'లు భీమారావు లోగడ ఎన్నోసార్లు తిన్నాడు. కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి తిరిగివచ్చాడు.

ఆ మర్నాడు మధ్యాహ్నం మరో చిత్రం జరిగింది. ఒక బండివాడు భీమారావు దగ్గిరికొచ్చాడు. అప్పుడే యేదో భూతాన్ని చూసివచ్చినవాడిలావుంది

వాడి వాలకం. కాళ్ళింకా గజగజా వణుకుతూనే వున్నయ్. రెండురోజుల క్రితం వాడు వేరుశెనక్కాయబండి తోలుకొని దావనగిరికి వెళ్ళి రాత్రి వేళ యింటికి తిరిగొస్తున్నాడు. మధ్య దోవలో సిద్దడు బండిని అటకాయించి ఆపివేశాడు. బండిలో ఎక్కి కూర్చుని, మళ్ళీ వెనక్కు తిప్పి దావనగిరికి తోలమన్నాడు. ఆఘమేఘాలమీద పోవాలన్నాడు. ఎద్దులు రొమ్ములు గరిసెలు పడేటట్టు తెల్లవార్లూ పరుగెత్తుతూనే వున్నయ్. బండి తోలుతున్నంతసేపూ సిద్దడి బాకు బండివాడి వెన్నుమీదే వుంది. తూరుపు తెలతెలవారుతూన్నదనగా బండి తూలహంసి ప్రాంతాన్ని చేరుకుంది. సిద్దడు బండి ఆపమన్నాడు. బండివాడి బొడ్లోవున్న డబ్బూ దస్కం యావత్తూ దబాయించి లాక్కున్నాడు; పక్కనున్న చేలోకి అదృశ్యమైపోయాడు.

మళ్ళా పక్షంరోజులు భీమారావు సిద్దడికోసం నలుముఖాలా గాలించి నిరాశ చేసుకుని యింటికి తిరిగొచ్చాడు. ఇంటి కొచ్చేసరికి ట్రాన్సుఫర్ ఆర్డర్ వచ్చి సిద్ధంగా వుంది. నెలాఖరుకు చార్జీ ఒప్పగించివెయ్యాలి. ఇక తనకున్న గడువల్లా రెండు వారాలు. 'అవును ఇక గత్యంతరం లేదు'—భీమారావుకు రెండు రోజులు కంటిమీద కునుకుబట్టలేదు. మూడోనాడు మళ్ళీ ఒక కొత్తవార్త! సిద్దడు తన ముఠాను వెంటేసుకొచ్చి హోస్‌దుర్గ్ రైలుస్టేషను ప్రాంతంలో బళ్లను అటకాయించాడు. తుపాకులు పేల్చి జనాన్ని హడలగొట్టాడు. బళ్ళల్లో వున్నవాళ్ళందర్నీ చావాచితకామోది, నల్లపూసలు మిగలకుండా దోచుకుపోయాడు. అప్పటికే హతాశుడై ధైర్యసాహసాలు కోల్పోయి వున్న భీమారావు, ఆ విషయం విచారించటానికి తన క్రింది ఉద్యోగిని పంపి చార్జీ ఒప్పగింత చేయటానికి కాయితాలు సిద్ధం చేసుకుంటున్నాడు.

## 2

కల్లోడ్ దేవాలయ తిరునాళ్ల సంత ప్రారంభమై అప్పటికి రెండురోజులైంది. కల్లోడ్ క్షేత్రం, వేదవతి వొడ్డున హోస్‌దుర్గ్‌కు అనతిదూరంలో వుంది. తిరునాళ్ళలో అక్కడ బ్రహ్మాండమైన సంత జరుగుతుంది. తాగుడూ, జూదం అనంతంగా సాగిపోతూ వుంటుంది. కొట్లాట లేవీ జరక్కుండా చూడటానికీ, లైసెన్సులేని జూదశాలలు నడిపేవాళ్లను అరెస్టు చేయటానికీ పోలీసులు అక్కడికి వెళ్లే మామూలు. భీమరావు తన సిబ్బందితో అక్కడికి వెళ్ళాడు.

భీమారావు ఆ సంతలో నలుమూలలా కలియతిరుగుతున్నాడు. మొదటిరోజు మామూలుగానే గడచిపోయింది. రెండోనాడు తన డేరాలోకూర్చుని తన పరాజయాన్ని తలుచుకుని మగనగా ఆలోచిస్తున్నాడు. హఠాత్తుగా తలయెత్తి చూచేసరికి సుపరిచితమైన ముఖం ఒకటి కంటబడ్డది.

భీమారావు డేరాకు యెదురుగుండా ఒక బట్టల దుకాణం వుంది. ఆ దుకాణందగ్గిర గుడ్డలు బేరం చేస్తూ చిన్ని కనుపించింది. చిన్ని పులిసిద్దప్ప భార్య. భీమారావు అదివరకు దాన్ని చాలాసార్లు చూచాడుగాని, ఇంత పరీక్షగా దాన్ని యెప్పుడూ అజబట్టలేదు. చిన్ని చూపరి — అందగత్తె అనే చెప్పాలి. ఇరవైసంవత్సరాలవయస్సులో మంచి హుమ్మస్సులో వుంది; పొంకంగా బలమైనమనిషి. చామనచాయగాని స్ఫురద్రూపి. నిగనిగలాడుతూ చారడేసికళ్ళు; లేడిలా చకచకా యిటూ అటూ చూస్తూ వుంటుంది. నల్లటి జుట్టు నున్నగా దువ్వి ముచ్చటముడి వేసుకుంది. చవుకరకం ఆభరణాలేవో వొంటినిండా వున్నయ్. సిద్దప్పకు అదంటే ఎందుకంత ప్రాణమో భీమారావుకు అర్థమైంది. అవకాశం దొరికినప్పుడల్లా సిద్దప్ప భార్యదగ్గరికి వచ్చిపోతూ వుంటాడు. ఇక చిన్ని సంగతి చెప్పనే అక్కర్లేదు వాడంటే పంచప్రాణాలూ విడిచేస్తుంది. వాళ్ళిద్దరిదీ ఆదిలో బళ్లాల సముద్రమే. సిద్దప్ప పులిని గొంతుపిసికి చంపాడని విన్ననాటినుంచీ దానికి వాడంటే మోజుపుట్టింది. డబ్బున్న కుటుంబాల యువకులే చాలామంది చిన్నిని పెళ్ళిచేసుకుంటామని వచ్చారు. చిన్ని ససేమిరా వొప్పుకోలేదు. సిద్దప్పని తప్ప మరొకణ్ణి చేసుకోనని భీష్మించుకు కూర్చుంది. అప్పటికే సిద్దప్ప ఒకటిరెండు చిన్నచిన్న నేరాలు చేసినట్టు పుకారు వుంది. కాని చిన్ని దీన్ని లెక్కచెయ్యలేదు. తల్లిదండ్రులు బలవంతాన మరొకడికిచ్చి పెళ్ళిచెయ్యటానికి ప్రయత్నించారు. చిన్ని అమాంతం సిద్దప్పతో లేచిపోయింది. అప్పటినుంచీ వాళ్ళిద్దరూ కాత్కేరీలో వుంటూవచ్చారు. తరువాత తరువాత, సిద్దడిమీద పోలీసునిఘా మోపైనతరువాత, ఒంటరి బ్రతుకే బ్రతకాలిసి వచ్చింది. కాని సిద్దడు ఎప్పటికప్పుడు దాని యోగక్షేమాలు కనుక్కుంటూ, దానికి కావలసిన యేర్పాట్లన్నీ చేస్తూనేవుంటాడు. దాన్ని గురించి మాట్లాడినప్పుడల్లా సిద్దడు 'నా రాణి'

అంటూ వుంటాడు. దానికి ఏ విషయం లోనూ ఏ కొరతా లేదు—నగలూ నాణాలూ, గుడ్డా గుడుసు ఏది కావలసివస్తే అది తెచ్చి పారేస్తూ వుంటాడు. వాడిది నిలకడలేని మనసు గనుక యిక్కడా అక్కడా పైతిరుగుళ్లు తిరిగినా, చిన్నిమాత్రం వాడికి హృదయాధిదేవత. చిన్ని వాడికి ఎప్పటికప్పుడు అమాకీలిస్తూ సాయపడుతూ వుంటుందనికూడా అంటారు. వాణ్ణిగురించి ఎక్కడా గొప్పలు చెప్పుకోవటం కూడా మానేసింది.

ఎక్కడున్నా ఒక దోపిడీ జరిగిందంటే, అనంతరం ఒకటి రెండు రోజుల్లో ఏ ప్రమాదమూ లేదని తోస్తే సిద్దడు దానింటికి వస్తాడని భీమారావుకు తెలుసు.

భీమారావు మళ్ళా తలెత్తి చిన్నివంక చూచాడు. అది బేరం పూర్తిచేసుకుని బయలుదేరి పోతోంది. భీమారావు మఫ్తీలో వున్న ఒక కనిస్టేబుల్‌ను పిలిచాడు "అదుగో సిద్దప్ప పెళ్ళాం, చిన్నమ్మ. నేను దాంతో ఒకమాట మాట్లాడాలను కుంటున్నానని చెప్పి తీసుకురా. దేవాలయం వెనక వున్న చింతచెట్టుక్రింద వుంటాను" అని చెప్పి పంపించాడు.

చిన్నమ్మ, మొత్తానికి కొంత జంకుతూనే అక్కడికి వచ్చింది.

భీమారావు చింతచెట్టు మొదట్లో వేరుమీద కూర్చున్నాడు. చిన్నమ్మనుకూడా తన కెదురుగా అలా గడ్డిమీద కూర్చోమన్నాడు. 'చిన్నమ్మా! నేను లోగడ నిన్ను చాలాసార్లు చూశానుగాని ఎప్పుడూ ఎక్కువగా మాట్లాడలేదు. ఇప్పుడు ఎలాగూ నేను ట్రాన్సుఫరై వెళ్ళిపోతున్నాను గనక కొంచెం నీతో మాట్లాడాలనుకున్నాను' అన్నాడు.

'ఏంటి దొరా?'—

ఎలా ఉపక్రమించాలో భీమారావుకు పాలు పోలేదు. దాని ముఖంలోకి చూడటం మానేసి, తల వంచుకుని, ఆ సంతనిగురించీ దాన్నిగురించీ యీ పిచ్చి మాటా ఆ పిచ్చిమాటా కొంచెంసేపు మాట్లాడాడు. ఒకక్షణానికి విషయం మార్చి దాని గత చరిత్రను గురించిన భోగట్టా అడిగి చెప్పించాడు. క్రమంగా ప్రసంగం దాని వర్తమాన జీవితందాకా వచ్చింది. 'చిన్నమ్మా! ఇటు చూడు!' అని అందుకు న్నాడు, 'నే నొకమాట చెబుతాను, నన్ను అపార్థం చేసుకోబోకు. నువ్వు వాడి భార్యవు—నీకు తెలియం దేమీ లేదు—ఈ పది పన్నెండేళ్ళలోనూ వాడు ఎంతమందిని హింసలు పెట్టాడో నీకు తెలుసు—ఇది ధర్మమేనా—నువ్వు చెప్పు?'

'అయ్యన్నీ నాకెం తెలుసు దొరా?'

'నీకు తెలీదనబోకు—ఇందులో నీకు తెలియం దేముంది?–సిద్దప్ప ఏమేమి ఘోరకృత్యాలు చేశాడో యీప్రాంతంలో కళ్లు తెరవని పసిపిల్లలకు కూడా తెలుసు. అలా నాకేమీ తెలియ దనబోకు చిట్టితల్లీ! ఇందులో నీకు తెలియం దేమిటి?—మొన్నను ఆ గ్రామం గ్రామం అలా తగుల బెట్టిపారేశాడే—నీకు తెలియదా?' భీమారావు అతిజాగ్రత్తగా సిద్దప్ప కిరాత కృత్యాల నన్నిటినీ ఒకటొకటే ఏకరువు పెడుతు న్నాడు. వింటున్నది గాని ఎక్కడా చలనం లేదు—సబ్బులా కూర్చుని వింటున్నది.

'ఇంతే కాదు ఇంకా అనేకం చేశాడు. ఎలాంటి ఘోర కృత్యాలు! అవన్నీ వింటే నీ గుండెలు తరు క్కుపోతాయి. పసికందులను బాకులతో పొడి చాడు—హత్యచేశాడు. ఎందరో ఆడవాళ్లని మాన భంగం చేశాడు—బీదా సాదా అనే విచక్షణ కూడా లేకుండా ఉన్నవాళ్లనీ లేనివాళ్లనీ అందర్నీ దోచాడు. ఎంతమంది హోరున ఏడిచారు—ఆ ఉసురంతా తగల కుండా వుంటుందా—ఈ దురాగతమంతా దేనికి? ఈ ఘోరకృత్యాలన్నీ దేనికి. ఈ..."

చిన్నమ్మ మౌనంగా కూర్చుని వింటోంది. ఇదంతా నాకేమీ తెలుసునని ఈ పర్యాయం మళ్ళీ అనలేదు.

'నువ్వే ఆలోచించు—అల్లాంటివాణ్ణి సరిదిద్ది మార్గాన పెట్టడం తప్పా? పిల్లా జల్లను ఈ హింసా కాండలోనుంచి బయట పడెయ్యకూడదా?'

'అవునుదొరా! అందుకోసం చెయ్యాలిసిం దంతా మీరూ సేసేరు—లోగ డుండెల్లిన దొరలూ శానాశానా సేసేరు' అంది.

ఈ మాటలు భీమారావు గుండెల్లో బాకుల్లా పొడుచుకున్నయ్. అది తన్ను హేళన చేస్తోందా? ఏదీ నిర్ణయంగా తెలుసుకోలేకపోయాడు. కాని ఆమాటల్ని లెక్క చేయలేదు.

'నువ్వన్నట్టు మేముకొంత ప్రయత్నం చేశాం—మేమంటే ప్రభుత్వం కొంత ప్రయత్నం చేసింది. కాని నేను నీయెదట మర్మం విడిచి చెప్పేస్తున్నాను విను—మేము ఏమీ చెయ్యలేకపోయాం — నేను

ఓడిపోయానని ఒప్పేసుకుంటున్నాను. కాని ప్రతి పనీ ప్రభుత్వమే చెయ్యాలంటే సాధ్యం కాదు. ప్రజల సాయం లేకపోతే ప్రభుత్వం దమ్మిడీకి కొరగాదు ఆ ప్రజల్లో నువ్వుకూడా ఒకదానివి — నువ్వు కూడా...'

'నా మొహం, నేం జేసేదేవిటి సామీ ఆడదాన్ని?—ఆడు నామాటింటాడా?'

'ఎందుకు వినడు! — నువ్వు వాడిభార్యవి నువ్వు చెపితే వినకేం జేస్తాడు.'

'ఎందుకొచ్చిన మాటలే దొరా?—ఏ మొగాడు ఏ ఆడదానిమాటింటావుండాడు?'—

అది నిజమే మాట్లాడుతోందో, తన్ను వేళాకోళమే ఆడుతోందో, లేక బుకాయించుతున్నదో భీమారావుకు అంతుచిక్క లేదు. మళ్లా నెమ్మదిగా ఆరంభించాడు. 'అలా అనబోకు తల్లీ! ఒకసారి మంచేదో చెడేదో నీకు తెలిసినతరువాత, నువ్వు చెయ్యగల ప్రయత్నమంతా చేసి న్యాయం జరిగేలా చూడాలి'—

'దొరా!—నాకు తెలీక అడుగుతావుండా గానుండీ—మడిసిని మడిసి పీక్కుతిని బతికే ఈ లోకంలో నాయం అన్నాయం నెప్పే నాదుడెవుడు బాబూ!'

'అబ్బబ్బే! అలా...అలా ఆలోచించకూడదు తల్లీ! అపకారమనేది యెవరికి జరిగినా అది నేరమే, అలాంటివాటిని అరికట్టడానికే, ఈ సంఘమర్యాదలూ, ఈ న్యాయస్థానాలూ, ఈ ప్రభుత్వాలూ, యివన్నీ వున్నయ్.'

'అసువంటి మాటలు నాకెందుకు చెబుతారు లెగుండి—అయన్నీ బలంలేనోళ్ళు బలంగలోళ్ళని, వల్లో యేసుకు నెందుకు పన్నిన పన్నాగాలు'—

దానిమాటలువింటుంటే భీమారావుకు కచ్చికక్రా పుట్టుకొస్తోంది. కాని తమాయించుకు మాట్లాడు తున్నాడు:

'నువ్వు పొరపాటు పడుతున్నావ్ చిన్నమ్మా! మనవంతా మనుషులం; అందరూ చల్లగా బతకాలి సిందే. అవతలవాడికికూడా బతకాలనే ఆశా బాగుపడాలనే ఆశా వుంటుందిగదా మన కున్నట్టుగానే.'

'అవునుగానీ – ఒక్కమాటడుగుతాను సెప్పండి —బతకటానికి దమ్మిడ్లేని యెదవలు—బతక్కపోతే యేవీ? అంటా'—

'ఆసి నీ యిల్లు బంగారంగానూ!—ఇల్లాంటి మాటలు నీ కెవరు నేర్పారు! నువ్వనుకుంటున్న మాదిరిగానే జరిగితే ఈ భూమిమీద మానవజాతి అనేది మిగులుతుందా? ఇది మానవసంఘమా అడవి మృగాల అరణ్యమా?'—

'అడివి గాక అద్దాన్నం! ఇదేవిటుండీ! బీదా బిక్కీని పీక్కు తిని సబ్బున్న గొప్పోళ్ళబొజ్జలు బోరాల్లా పెరుగుతుండయ్. ఆళ్లకి డబ్బు బలం వుంటే నా మగాడికి కండబలం వుంది. ఆడుమాత్రం అట్టా ఎందుకు పీక్కుతినగూడదూ అంట? ఏంటో ఆడది, మానం గీనం అంటా పెద్ద పెద్ద మాటలు సెబతావుండారే, మీ పట్నాలనిండా ఆ గుడిసేటి కూడేల మాటేంది బాబూ! ఆళ్ల యిళ్లకిపోయే వోళ్లెవుళ్ళు? ఆళ్లని పోషించుతావుండే వోళ్లంతా యెవుళ్లూ—మీ మర్యాదస్తులేగెందా — మీ గొప్పోళ్లేగెందా? — అట్టాగే నా మగాడూ చేత్తావుండాడు, అదేపని. ఆళ్లు ఆళ్ల యీలు పెకారం చేత్తావుంటే, ఈడు యీ డీలు పెకారం జేత్తావుండాడు—ఆళ్ళది డబ్బు మదమైతే, యీడిది ఒళ్లుమదం—అంతే తేడా? ఎనక రాజులూ, రాసోళ్లూ వుండేవోళ్ళు: ఆళ్ళని సూసి అడిలి సత్తా జనం వొంగొంగి సలావులు జేసేవోళ్లు—ఇప్పుడు డబ్బునోళ్లకీ అదికారులకీ జేత్తుండమాదిరిగానే. ఆళ్ళకిమల్లేనే నా మగాడూ యీరుడు—ఆళ్లకి మల్లేనే యీడూ ఇద్దాలు జేత్తాడు — మా రాజులా బతుకుతాడు—ఆ రోజుల్లో ఈడుగనా వుంటే, ఈడుకోడా ఓ కోట గట్టి ఏలువుండే వోడు

'ఉమ్!'—భీమారావు వచ్చిన అక్కసునంతా మింగుకున్నాడు. 'నువ్వు చెప్పిందంతా నిజమే—కాదనటంలేదు—వస్తుంది, ఆ రోజూ వస్తుంది—ఆ దుర్మార్గుల్ని కూడా—ఆ గొప్పవాళ్లని కూడా—అణచివేసే రోజు—ప్రజానీకానికి బలం చిక్కినప్పుడు ఆరోజు వస్తుంది.'

'సరే బాగానేవుండది. సిద్దప్పా అంతేగెందా!—ఇంకేం మీకు బలం, దైర్యం వుంటే ఆణ్ణి అణిచెయ్యొచ్చు—. ఆడేం వొద్దంటం లేదే.'

'అదుగో ఆ ధోరణే వద్దన్నాను. జనాన్ని పీక్కుతినే పెద్దపెద్దవాళ్లున్నారనుకో-అందుకని చిన్న చిన్నవాళ్లుకూడా చెలరేగుతారా? ఆ గొప్పవాళ్లని అణచటానికి యిప్పటికింకా న్యాయశాసనా లేమీ లేకపోయినా, సిద్దప్పలాంటి సన్నరకాన్ని అణచివేయటానికి వున్నయ్—అదీ తేడా. అయినా ఒకటి

ఒప్పుకుంటున్నాను. నేను యీ ప్రయత్నంలో సంపూర్ణంగా ఓడిపోయాను. అందుకే నీకు కబురు పెటాను.

'ఎందుకూ—నే సెంగుకూ—మీరు సెపుతా వుండదేవిటో నాకు తెలీడం లేదు'—

'మరేమీ భయపడకు—నిన్ను నే నేమీ చెయ్యమని బలవంతం సెయ్యబోవటం లేదు. నువ్వు జాగ్రత్తగా నీ యంతటికి నువ్వు యిదంతా ఆలోచించి, సిదప, నువ్వు యిందాక చెప్పిన దుర్మార్గులలాంటి వాడేనని తోస్తే—వాడు పిల్లా జల్లని అలా హింస పెట్టడం సహించరాదని తోస్తే—నీ యంతటికి నీకు కనికరం కలిగి ఇలాంటి ఘోరకృత్యాలనన్నిటినీ ఎలాగైనా ఆపాలని జాలికలిగితే—మరి—ఇంకా—నీ యంతటికి నీకు సాయపడాలనే ఉద్దేశం కలిగితే...'

'తవుఁరు...తవుఁరు అనే దేవిఁటి—నన్నాడితో చెప్పమంటారా?'—

'చెప్పినా వినడని మొదటే చెప్పావుగా'

'అవుఁను మరి...అవుతే ఇహ మీరు నన్నుజేయమంటావుండదేవిఁటి'—కంటగించుకుంటున్నట్టు అప్పుడే దానిగొంతు కంచు గీసినట్టు మోగింది.

'ఏవిఁ చేస్తే బాగుంటుందో నువ్వే ఆలోచించు—మాకు సంబంధించినంతవరకూ—జైలనేది అక్కడ ఒకటుంది.'

'అంటే, నేను ఆణ్ణి మీకు పట్టియ్యాలంటారు—మీరు చెప్పేదేందో యిప్పుడు తెలుత్తావుండది. అది మాత్రం నావల్లగాదు. మీరు మంచీ చెడూ తెలిచిన మారాజులు గనక యేది బడితే అది మాట్టాడొచ్చుగానీండి— కావాలని కట్టుకున్న ఆడది మొగాణ్ణి అట్టా ఎట్టా చేసుద్ది—మీరు ఏ మొగం బెట్టుకు నన్నీ మాట అడుగుతావుండారు సావీఁ!'

'ఇక నే నేమీ చెప్పదలచలేదు—ఇక నువ్వే ఆలోచించు. వాడి చేతుల్లో అలడి తల్లడిపడిపోతున్న నిర్భాగ్యులపట్ల నీకేమైనా జాలి కలిగితే, ఏది యుక్తమని తోస్తే అలా చెయ్యి. నేను చెప్పదలచిందింతే. పైన దైవమున్నాడు.'

'అదిమాత్రం నావల్ల గాదు సావీఁ! నమ్మినోణ్ణి అట్టా గొంతు కొయ్యలేను'—చిన్నమ్మ లేచి నిల్చుంది. భీమారావు కూడా లేచాడు. చిన్నమ్మ మళ్ళీ సంతవేపు మళ్ళింది. భీమారావు కాళ్ళీడ్చుకుంటూ తన డేరాదగ్గిరికి చేరుకున్నాడు.

చిన్నమ్మ 'కాదు' అని చెప్పటమైతే చెప్పింది గాని, దాని మనస్సులో కొంత ఆవేదన బయలుదేరింది. గుడిచుట్టూ తిరిగి ముఖద్వారందగ్గిరికి వచ్చింది. ఇరుపార్శ్వాలా బిచ్చగాళ్లున్నారు. వాళ్ళలో కష్టబోయిన కబోధి కెంచి కనుపించింది. దాని వొంటిమీద వుండీ లేనట్టుగా చినిగి వాలికలైన ఒక పాతగుడ్డముక్క మాత్రమే వుంది. దుమ్ము కొట్టుకున్న చింపిరిజుట్టు; చేతిలో పగిలిపోయిన ఒక కుండబుర్ర—ఇదీ కెంచి అవతారం. దాని ప్రక్కనే దిసమొలతో అయిదేళ్ల దాని కొడుకు. సిద్దప్ప దాని మొగుణ్ణి హత్య చేసి, దాని యింటికి నిప్పుపెట్టాడు. ఆ కారణంగా దాని కాస్థితి పట్టింది. చిన్నమ్మ ఆ వరసనే చూస్తోంది. తిమ్మయ్య కంటబడ్డాడు. వాడి పక్క టెముకలు బయటికి పొడుచుకొచ్చాయి. ముఖంలో అనంతమైన వేదన—దీనంగా, మొండాలైపోయిన మోచేతులు రెండూ ముందుకు చాచాడు. తిమ్మయ్య పోలీసువాళ్ళకి ఆచూకీ యిచ్చాడనే, కోపంతో సిద్దప్ప వాణ్ణి అవిధంగా శిక్షించాడు. చిన్నమ్మ వాళ్ళని, ఆ ప్రదేశంలోనే, చాలాసార్లు చూసింది. వాళ్ళ చరిత్రంతా కూడా దానికి తెలుసు. కాని ఎప్పుడూ వాళ్లఅజేవుం డేదిగాదు. ఇప్పుడు వాళ్లముఖాల్లోకి జాలిగా చూస్తోంది. చీరెకొంగుసున్న ముడి విప్పి, యిద్దరికీ చెరో అర రూపాయీ యిచ్చింది. తిమ్మడు చిన్నమ్మకళ్లలో తెరిపార జూచాడు. కెంచికొడుకు 'అమ్మోయ్—అద్దరూపాయేవ్!' అని ఉత్కంఠతో అరిచాడు...'హాఁ!' అంటూ ఆనంద పరవశములైన చేతులతో ఆ నాణాన్ని తడవిచూసుకుంది: 'నీ కడుపు చల్లగా వెయ్యేళ్ళు వర్ధిల్లమ్మా!' అని దీవించింది. ఆశ్చర్యచకితులైన ఆ బిచ్చగాళ్లందరి కళ్లూ ఒక్కసారి చిన్నిమీదికిమసిరినై. వాళ్లని తప్పించుకుని చిన్నమ్మ గబగబా గుళ్లోకి వెళ్లిపోయింది.

గుడిపూజారి దేవుడికిహారతిస్తున్నాడు. ఇప్పుడు గుళ్ళో వున్నది కంచు విగ్రహం. పూర్వం వెండి విగ్రహం వుండేది. ఒకసారి చిన్ని తనకు వెండిమురుగులు కావాలని సిద్దడితో చెప్పింది. ఆయింట్లోనే సిద్దడు గుళ్లోనుంచి ఆ వెండి విగ్రహాన్ని యెత్తుకొచ్చేశాడు. మూడోనాటికల్లా చిన్ని ముంజేతులమీద వెండిమురుగులు మెరిసినై. అనంతరం చిన్ని చాలాసార్లు గుళ్లోకి వచ్చింది. ఈ వేళ దాని దృష్టి ఆ విగ్రహం ప్రసరించిది. తన చేతులనున్న గాజులవంక చూసుకుంది. పూజ పూర్తిఅయేదాకా సైనా ఆగకుండా వున్నపళంగా బయటికి వచ్చేసింది.

మైదానంమీదికి వచ్చేసరికి గంగ కనుపించింది. గంగ యిప్పుడు హోస్‌దుర్గ్‌లో పడుపువృత్తితో బ్రతుకుతోంది. గంగ మొదట్లో చాలా పరువుగల కుటుంబానికి చెందిన మనిషే. సిద్దడు దాన్ని ఎతుకొచ్చాడు. మళ్ళీ దాన్ని వాళ్ళవాళ్లు చేరనీక వేశారు. పొట్టబోసుకోవటానికి మరో మార్గం లేక ఒళ్ళమ్ముకు బ్రతుకుతోంది. మామూలుగా అది కనుపించినప్పుడల్లా చిన్ని దాన్ని పలకరించి ఆ మాటా యీమాటా మాట్లాడేది. ఈ వేళ అది కనుపించగానే ముఖం తిప్పేసుకుని పట్నం వెళ్లిపోవడానికి బయలుదేరింది సంతెలోనుంచి యింతలకు వస్తుండగా నంజుండయ్యసెట్టి కనుపించాడు—బీడీ లమ్ముతున్నాడు. సిద్దడు అతనిపాలబడక పూర్వం, నంజుండయ్య నూలు వ్యాపారం చేస్తూ మహారాజులా బ్రతుకుతూవుండేవాడు.

'ఏం కర్మ! యిన్నాళ్ళ అంతా యీముదనోష పోళ్లే యెదురౌతుండా రేం?' అని విసుక్కుంటూ తొందర తొందరగా నడిచిపోతోంది. ఏటివొడ్డుకు చేరేసరికి, ఒక వ్యక్తి చిన్నమ్మను కలుసుకున్నాడు. 'నీకోసమే బయలుదేరాను. నయం, నువ్వే యీ కనుపించినా. రేపు నీకేడ కొత్తానని చెప్పమన్నాడు. ఆ ఇనస్పెక్టరు నాయాలకు బదిలీ అయింది. రేపో యెల్లుండో పోతావుండాడు—పీడా యిరగచొద్ది.'

తన ఆలోచనలలో తను మునిగి తేలుతున్న చిన్నమ్మ తలెత్తి చూచింది. చిక్కడు! చిక్కడు సిద్దడికి నమ్మినబంటు సిద్దప్ప వస్తాడన్న మాట; తను మౌనంగా వెళ్లిపోవాలి. వెడుతూ వెడుతూ ఒక్కసారి తల పైకెత్తి ఆ సంతెవంకో, సంతెలో వున్న డేరా వంకో చూసింది. మళ్లా తల వంచేసుకుని చకచకా బయలుదేరింది.

ఇంటికి తిరిగివచ్చింది. ఒక కొత్తచీర బయటికి తీసింది; కాని కట్టుకోలేదు. చేతులనున్న గాజుల వంక చూసుకుంది. వాటిని మెలిదిప్పేసింది. మెళ్లో వున్న గొలుసులు లాగి అవతల పారేసింది. గది కిటికీ దగ్గిరికి పోయి ఆందోళనగా బయటికి చూస్తోంది. అలా ఎంతోసేపు నిల్చునిపోయింది. చీకటిబడిపోయింది. దీపం వెలిగించింది. కూడు ఉడకేసుకుందామని పొయ్యి దగ్గిరికిపోయింది; పొయ్యి రాజెయ్య బుద్ధి కాలేదు. పొద్దున మిగిలిన చద్దిమెతుకులే రెండు ముద్దలు నోట్లో వేసుకుని నీళ్లు తాగింది. దీపం ఆరిపేసి, మంచాన చేరబడ్డది. నిద్రబట్టక అర్ధరాత్రిదాకా ఇటూ అటూ మెసులుతూనే వుంది.

అక్కడ హోస్‌దుర్గ్‌లో భీమారావు సామానూ జట్రా సర్దేసుకుంటున్నాడు. అతని మంతా ఛిన్నాభిన్న మైపోయింది.

ఆమర్నాటి సాయంత్రం, భీమారావు సన్నాహాలన్నీ ముగించుకుని ప్రయాణానికి సిద్ధంగావుండగా నౌకరు లోపలికి వచ్చి 'మిమ్మల్ని రమ్మన్నారట—చిన్నమ్మ మీకోసం వచ్చింది' అన్నాడు. భీమారావుకు గుండె ఆగిపోయినంత పనైంది. కాని అదేమీ బయటికి కనుపించకుండా తన్ను తాను కూడదీసుకుని గబగబా బయటి వరండాలోకి వచ్చాడు. చిన్నమ్మని చూసేటప్పటికి భీమారావుకు ఎంతో ఆశ్చర్యమేసింది. నిజంగా నిన్న చూసిన ఆ ముఖమేనా అనుకున్నాడు. ఆ ముఖంమీద హతాశారేఖలు అయోమయంగా తాండవించుతున్నయ్.

నౌకరును అవతలకు పంపించి 'ఏం? చిట్టితల్లీ! ఇలా వచ్చావ్?' అని అడిగాడు, భీమారావు, మంద్రస్థాయిలో. చిన్నమ్మ మాటాడలేదు. బొటనవేలు నేలరాస్తూ నేలవంక చూస్తోంది. ఆపైని ఏమి మాట్లాడాలో ఏం చెయ్యాలో భీమారావుకు తోచలేదు. మామూలుధోరణిలో. 'ఈ వేళ రాత్రి ఇక్కడ పట్నంలో వున్న మీ అన్నయ్యగారింటికాడ వుండి పోదామని వచ్చావు గావల్ను' అన్నాడు. చిన్ని చేతిలో వున్న ప్యాకెట్ చూపించింది—ఏవో సామానులు కొనటానికి వచ్చాననే సూచనగా.

సమాధానం యేమీ రాకపోవటంతో, భీమారావు చిన్న పొడిదగ్గు దగ్గి 'నీకు నావల్ల యేదైనా సాయం కావాలా?' అన్నాడు. అడిగాడే గాని అది వట్టి అర్థంలేని వాక్యమని భీమారావుకు తెలుసు. చిన్నమ్మ లేదన్నట్టు తల పంకించింది.

'మరి?—' భీమారావు కంగారుగా అడిగాడు.

'రేపు... రాత్రి... ఆడొత్తావుండాడు....' ఖోభిల్లిపోతున్న చిన్నమ్మగుండెల్లోనించి ఆ రెండు మాటలూ ఎంతో బాధగా బయటికి పెగుల్చుకు వచ్చినై.

' !—ఏమీటీ—రేపా?—రాత్రి!'— అంటూ విభ్రాంతుడైనాడు. ఇలాటిది జరగాలని చిరకాలంగా ఆశించుతున్నా యిప్పుడు తన చెవులను తాను నమ్మలేకపోయాడు. చిన్నమ్మ వెళ్ళిపోవడానికి వెనక్కు తిరిగి కదిలేదాకా అతనికి స్పృహ రాలేదు. 'చిట్టితల్లీ! నువ్వు ఎంతో మహాతల్లివి!

ఎంతో మహత్కార్యం చేశావు—ఎంతో దుర్ఘటమైన త్యాగం—భగవంతుడు నిన్ను రక్షించుతాడు.' భీమారావు మాట్లాడుతూనే వున్నాడు కాని చిన్ని వెనక్కి తిరిగైనా చూడలేదు. చిన్నిని సాగనంపుతూ: 'నీవైతే—నీకు సమ్మతమై—ఏదైనా ఒక గుర్తు—చీకటికదూ—ఆఁ కిటికీలో లాంతరుంచితే చాలు—మేవుఁచేరువలోనే వుంటాం, ఆదగ్గిరలోనే ఎక్కడో—తలుపు కూడా కొంచెం—అవునవును తుపాకి సంగతొకటి—ఎలాగైనా నువ్వు అన్నివిధాలా సాయపడాలి — నమస్కారం — మహాతల్లివి — ఎంతో మహత్కార్యఁ నీ ఉపకారం జన్మజన్మాలా మరిచిపోను.'

చిన్నమ్మ ఆ రాత్రి పట్నంలో అన్నగారింట్లోనే వుండిపోయింది. హృదయం ఎంతో ఆందోళన పడుతోంది. అవతలవాళ్లు గుచ్చిగుచ్చి అడిగితే గాని యే సమాధానమూ చెప్పటంలేదు. ఆ హృదయం సాక్షాత్తూ ఒక అగ్నిపర్వతంలా వుంది.

## 4

మర్నాటి ఉదయమే లేచి చిన్నమ్మ కొలక్కరీకి వెళిపోయింది. ఇంటికి వెళ్ళగానే, యిల్లంతా పరిశుభ్రంగా ఊడ్చి నీళ్ళు చల్లి రంగురంగులుగా రంగవల్లులు తీర్చింది. పొయ్యిదగ్గిర ఎంతోసేపు కూర్చుని నానారకాల భోజనపదార్థాలూ తయారుచేసింది. కాని భోజనం చెయ్యలేదు. కొంచెంసేపు విశ్రాంతిగా పడుకుని లేచింది. పరిశుభ్రంగా స్నానంచేసి, సంతలో కొనుక్కొచ్చిన మబ్బురంగు శిల్కుచీర కట్టుకుని ఎర్ర రంగుచీనీలు కుట్టిన జాకెట్ తొడుక్కుంది. కురులు నున్నగా దువ్వి ముడి వేసుకుంది. ముఖాన కొట్టవచ్చినట్టు ఇంత వెడల్పున కుంకుమబొట్టు పెట్టుకుంది. ఉన్న నగలన్నీ అద్దంముందు కూర్చుని ఒళ్లంతా అలంకరించుకుంది. ఈ కైసేత పూర్తి అయేసరికి అప్పుడే కనుచీకటిపడ్డది.

అత్యంత శోభాయమానంగా అలంకరించుంది, కాని ఆముఖాన నిలువునా వాతబెట్టినట్టు విషాదరేఖ.

బాగా చీకటి పడగానే లాంతరు వెలిగించింది. ఎప్పుడూ లేనంత శ్రద్ధగా పక్క పరిచి, మెత్తగా వుందో లేదో తడవిచూచింది. బుగ్గను వేలు వేసుకుని నిరీక్షిస్తూ కూర్చుంది

ఒక చిన్న గులకరాయి కిటికీలోనుంచి పక్కమీద పడ్డది. ఆదరాబాదరా లేచి వెళ్లి తలుపుతీసింది. తుపాకి చేతబుచ్చుకుని, ఆజానుబాహుడు పులిసిద్దడు, గుమ్మం తలకు తాకకుండా ముందుకు వంగి లోపల ప్రవేశించాడు. చిన్ని తలుపు వేసి లోపల గడియ బిగించింది.

'ఓహోహో! ఏవిఁ ఘుమాయింపు—యిల్లు యిల్లంతా గుబాళిస్తావుందే!—ఎంత సోగ్గా అలంకారం జేశావ్!' సిద్దప్ప చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. లోపలికి లాంతరు వెలుగులో దాని ముఖంవంక చూసి పట్టరాని ఆనందంతో ఉప్పొంగిపోతూ 'వహ్వా! రంబలాగుండావ్! యెయ్యి కళ్లు సాలవ్ సొగసు సూసేందుకు.' అన్నాడు. చిన్ని ముఖంలో ఒక వెన్నెలరేఖ మొలకెత్తింది. కాని ఆ వెలుగురేఖ మరుగున అనంతమైన వేదన.

'ఇయ్యాళనించీ రోజూ వత్తావుంటాలే—రేపటితో ఆ బీమారావు పీడాయిరగడై పోతావుండాడు; బదిలీ అయిందంట. ఆ యెదవ నన్ను పట్టుకోవాలని పెద్దమొగాపల్లే ఈడకొచ్చిండు. హో! హో! హో!—ఊఁ సరే—ఆకలేత్తా వుండది!' సిద్దప్ప తుపాకీ పడక గదిలో మూలబెట్టి, బయటికి పోయి చేతులూ కాళ్ళూ కడుక్కొచ్చాడు. భోజనంముందు కూర్చున్నంతసేపూ వాడిముఖం ఆనందంతో మిడిసిపడిపోతోంది: 'వహ్వా ఏవిఁ మజాగా వండావ్! రాసోళ్లయిందులాగుంది. ఇయ్యాల నా పుట్టినరోజు పండగనుకుండావాయేంది—యిందు సేత్తావుండావ్—అది సరే నువ్వు భోజనానికి కూకోలేదేంది?' చిన్నమ్మ మౌనంగా కూర్చోటం చూసి ఈమాట అడిగాడు. 'మద్దానం యేళదప్పి తిన్నాలే — తిన బుద్దెయ్యడంలేదు' అంది. భోజనం చేసినంతసేపూ వాడు అలా నవ్వుతూ ఈ మాటా ఆ మాటా మాటాడించుతూనేవున్నాడు. కాని చిన్నమ్మ మాత్రం ఎక్కడికక్కడ ముక్తసరిగా సమాధానాలు చెబుతోంది. 'ఏందట్టా మూగనోమట్టి ముంగిలా కూకుండావ్—ఒంటో బాగాలేదా యేంది' అని నిగ్గదీశాడు. కుసెంత తల నొచ్చుతావుండదిలే' అని సమాధానం చెప్పింది. 'నే నొచ్చాగా ఇక పోద్దిలే' అని నవ్వుతూ భోజనంముందునుంచి లేచి చెయ్యి కడుక్కునేందుకు బయటికి వెళ్లాడు. చిన్నమ్మకూడా లేచింది. ప్రాణంలేని యంత్రంలా నడుస్తూ నెమ్మదిగా గదిలోకి వెళ్లింది. మూలనున్న తుపాకిలోనుంచి తోటాలు తీసేసి మళ్లా యథాస్థానంలో పెట్టేసింది.

సిద్దప్ప మాంచిహుషారుగా వున్నాడు—వకాకు నములుతూ పక్కమీద కూర్చున్నాడు. తళతళలాడుతున్న వాడి కళ్లల్లో అంతులేని కోరికలు. ఆ సర్దాలో చిన్నమ్మ పాలు పంచుకోలేకపోతోంది. దాని

హృదయం ఒక క్షణం సిద్దడివేపూ మరుక్షణం మరోవైపూ కొట్టుకులాడుతోంది. 'ఓహో! రాణిగారికి కోపం వొచ్చినట్టుందాడి—డబ్బు తెచ్చేను గానని—యీగో తీసుకో' అంటూ రెండు పచ్చ నోట్లు తీసి అందించాడు. 'మరి—ఇహ నవ్వు—ఏదీ సిరునవ్వు—ఒక్కటి.' మిలమిలా మెరుపు మెరిసినట్టు ఒక చిరునవ్వు దానిముఖాన మెరిసిపోయింది. మళ్ళీ క్షణంలో విషాదమేఘాల్లో అదృశ్యమైపోయింది. కానిఆ మేపాలను సిద్దప్ప గుర్తించలేకపోయాడు. ఆ నోట్లు హోన్ దుర్గ్ దోపిడిబాపతని చిన్నమ్మకి తెలుసు. ఆ పాపిష్టి డబ్బు తనచేత్తో ఎలా పట్టుకుందో దానికే తెలీదు. 'సరే! ఇక పడుందాం' అని పక్కమీద ఒరిగి ఇటూ అటూ దొర్లాడు.

వాడికి మాగన్నుగా నిద్రబట్టింది. చిన్నమ్మ వాడిపక్కనే పడుకుని దిగులుగా యింటి పైకప్పు వంక చూస్తోంది. ఒక క్షణానికి లేచి కూర్చుంది. రెండు కళ్ళూ ఇంతింతలుగా చేసుకుని తదేకదృష్టిగా వాడివంక చూస్తోంది. చెయ్యి చాచి వాడిమీద వెయ్యబోయింది—మళ్ళా దిగులుగా వెనక్కుతీసుకుంది. లేచి నిల్చుంది. కాళ్ళల్లో సత్తువ చచ్చి గుజ్జుపీలికలై పోయినట్లనిపించింది. హృదయం లోలోపల ముక్కచెక్కలైపోతోంది. నెమ్మదిగా ముందుకు వంగి గజగజా ఒణికిపోతున్న చేతులతో లాంతరు అందుకుంది-- కిటికీలో పెట్టింది. లాంతరు కిటికీకి కొట్టుకుని చిన్న శబ్దమైంది. సిద్దడు కళ్లు తెరిచి 'ఏటదీ!' అన్నాడు. చిన్నమ్మకు నరనరాలూ కంపించిపోయినై. నెమ్మదిగా సంబాళించుకుని 'లాంతరు తగ్గించాలే' అని సమాధానం చెప్పివచ్చి వాడిపక్కనే కుప్పగా కూలింది.

సాయంత్రం నుంచీ భీమారావు ఇంత వరిగడ్డిమీద గప్పుకుని చేరువలో వున్న ఒక కందకంలో, కంట్లో వత్తివేసుకొని కనిపెట్టుకు కూర్చున్నాడు. కూర్చుని కూర్చుని అతనికి ప్రాణం విసికిపోయింది. క్షణక్షణం రేడియండయల్ వున్న తన చేతిగడియారం వంక చూసుకుని నీళ్లు గారుతున్నాడు. 'చివరికి యిదంతా వట్టి మోసమేనా యేమిటి?' అనుకుంటున్నాడు. ఆ చీకట్లో సిద్దడువచ్చిన అలజడేమీ కనుపించలేదు. అర్ధరాత్రి దాటింది. 'సాంచూ! ఇక లాభంలేదు; పోయి తలుపు పగలగొట్టి ఇంట్లో జొరబడదాం పదండి!'.—ఈ మాటలు ఇంకా సాంతం అతని నోట్లోనుంచి బయటికి రానేలేదు—ఇంతలోనే కిటికీలో దీపం. భీమారావుకు ఎక్కడలేని బలమూ వచ్చేసింది. తన పరివారాన్నంతా వెంటబెట్టుకుని ఒక్క ఉదుటున ముందుకు ఉరికాడు.

సిద్దప్పకు ఇంకా బాగా నిద్రపట్టలేదు. గయ్యిమని కుక్కలు మొరిగేసరికి చివాల్న పక్కలో లేచికూర్చున్నాడు. చిన్నమ్మకూడా కంగారుగా లేచింది.

'ఇంటుండావా ఆమోత!' అంటూనే చివాల్న పక్కలోనుంచి క్రిందికి దూకి మూలనున్న తుపాకి అందిపుచ్చుకున్నాడు. ఇంతలోనే 'ఢల్లు' న తలుపు తెరుచుకుంది.: 'ఓరి యెదవా నువ్వా!' అంటూ గర్జించి తుపాకిఎత్తి తలుపువేపు గురిచూసి మీట నొక్కాడు. క్లిక్ మని ఊరుకుంది అంతే.

'ఆసి లుచ్చాముండా!' అని భీభత్సంగా గర్జించి-తుపాకి రెండుచేతులాఎత్తి, చిన్నినెత్తిన ఒక దెబ్బ పెట్టాడు. చిన్ని నోటివెంట మాటలేకుండా కింద బడిపోయింది. సిద్దడు తుపాకితో సాదనంచేస్తూ వాళ్లని ఎదుర్కున్నాడు. ఎటు మొసలటానికీ వీలులేని చిన్నగది. సిబ్బందీ అందరూ లోపలికి రావటానికి వీలులేకపోయింది ఒకరిద్దరికి దెబ్బలు తగిలాయి. ఒక తను దెబ్బతిని కిందపడ్డాడు. ముందు పీటీని పోరాడుతున్నాడు భీమారావు—అతనికికూడా దెబ్బతగిలింది. భీమారావు ఇక ఉపేక్షించి లాభం లేదనుకున్నాడు. రివాల్వరుతీసి, సిద్దప్పతొడమీద గురిచూసి రెండుసార్లు పేల్చాడు. ఆ దెబ్బలు తినికూడా సిద్దడు అతనిమీద దూకి కలబడ్డాడు. కాని, నిల్చోలేక కుదబడిపోయాడు. నలుగురుమనుషులు అమాంతం వాడిమీదపడి కాళ్లకి చేతులకీ బేడీలు తగిలించారు. అనంతరం నెత్తురుకారకుండా వాడితొడకు కట్టుగట్టారు.

భీమారావు చిన్నమ్మ పడున్నవేపు పరుగెత్తాడు. బ్రతికేవుంది. నెత్తిమీద బలంగా దెబ్బ తగలటంచేత స్పృహతప్పి పడిపోయింది. భీమారావు ఒకతన్ని పిలిచి చిన్నమ్మ తలమీది గాయం కడగటానికి నీళ్లు తెమన్నాడు. సిద్దప్ప దాన్ని నానా బూతులూ తిడుతున్నాడు. భీమారావు వాణ్ణి బయటికి తీసుకుపొమ్మన్నాడు. చిన్నమ్మ నెమ్మదిగా కళ్లు తెరిచింది. ఒక్క క్షణంసేపు భీమారావు కళ్లలోకి వెర్రి చూపుచూచింది. మళ్ళీమరుక్షణంలో రెండు అర చేతుల్లోనూ కళ్లు రెండూ మూసేసుకుని, గుబులు గుబులుగా ఏడిచేస్తోంది. రెండు కళ్లవెంటా సంతత ధారలుగా కన్నీరు కారిపోతోంది.

'చిట్టితల్లీ నీవుచేసిన త్యాగానికి తగిన ప్రత్యుపకారం ఎన్నటికీ చెయ్యలేము. కాని నిన్నుమాత్రం మరిచిపోము. నువ్వు మరేమీ భయపడక్కర్లేదు.

ఎన్నటి కూడా..." ఎలా అభయమివ్వాలో భీమారావుకు తోచలేదు. కాని చిన్నమ్మ యీనాటి లేవీ వినిపించుకోవటం లేదు. ఇలాంటి వట్టివాగ్దానాలేవో చేస్తూ, రేపువచ్చి కలుసుకుంటానని చెప్పి, బయటికి వచ్చాడు.

ఈలోగా, కుక్కలు మొరగటం, రివాల్వరు కాల్పులు వినిపించటం కారణంగా ఇంటిచుట్టూ జనం మూగారు. సిద్దడిముఠా వాళ్లకి ఈవార్త తెలిసేలోగా భీమారావు ఇక్కడనుంచి హాస్‌దుర్గ్‌కు జేరిపోవాలి. గబగబా నాలుగుబళ్లు మాట్లాడుకుని బయలుదేరాడు. ఒకబండిలో సిద్దణ్ణి ఎక్కించుకుని తను కూర్చున్నాడు. మిగతా మూడుబళ్ళల్లోనూ సిబ్బందీ కూర్చున్నారు.

సిద్దణ్ణి లాకప్‌లో వుంచారు. సిద్దణ్ణి పట్టుకున్న కథనంతా వివరించుతూ భీమారావు పెద్ద రిపోర్టు తయారుచేస్తున్నాడు. ఇందులో చిన్నమ్మ చేసిన సహాయాన్నీ, అదిపడ్డ మానసికమైనబాధనూ సుదీర్ఘంగా అభివర్ణించి ప్రభుత్వంవారు ప్రకటించిన బహుమతిని దానికి యివ్వవలసిందిగా సిఫార్సు చేశాడు. ఖైదీని మరొక ఉద్యోగికి వప్పగించేసి తాను ఇంటికి వెళ్ళాడు. అతను సంకల్పించిన కార్యం సఫలమైంది. హాయిగా పడుకుని నిద్రపోయాడు.

అతను నిద్రలేచేసరికి ఎనిమిది గంటలైంది. అతన్ని లేపిన నౌకరు: 'ఎవరో ఆడమనిషి చెర్లోబడి చచ్చిపోయిందిటండీ — దాని పేరు చిన్నమ్మట' అన్నాడు.

'ఏమిటి? చిన్నమ్మ! ఏ చిన్నమ్మ? సిద్దడి భార్య కాదుగదా? —' భీమారావు కంగారుగా అడిగాడు.

'అవునండీ అదే!' —

భీమారావు చెరువు దగ్గిరికి పరుగెత్తేసరికి అక్కడో పెద్ద గుంపు మూగివున్నారు. గుంపుకు మధ్యగా చిన్నమ్మ పడున్నది — కళేబరం! ఒక డాక్టరు పరీక్షచేసి నీటిలో మునిగిచనిపోయిందని అన్నాడు. భీమారావుకు తరవాత తెలిసింది: తాను వచ్చేసిన వెంటనే చిన్నమ్మ యిరుగుపొరుగు వాళ్లందర్నీ ఇళ్లకి పంపేసి, యింట్లోకి వెళ్ళి గొళ్లెం బెట్టుకు పడుకుందని. ఊళ్లోవాళ్ళందర్నీ నిద్రపోనిచ్చి నెమ్మదిగా లేచొచ్చి ఈ అఘాయిత్యం చేసి వుంటుందని ఊహించుకున్నాడు.

# అనంతవర్మ చోడగంగదేవుని

# అదపాక తామ్రశాసనము

శ్రీ మండ నరసింహము

ఈ శాసనము అదపాక గ్రామమున ఒక రైతు, గ్రామ సమీపమందలి మెట్టభూమిని దున్నుచుండగ లభించినది. ఇది రాజముద్రికతో సంధింపబడిన కడియముతో గ్రుచ్చబడి యైదు రేకులు గలిగియున్నది. రేకులన్నిటిపైనను, లిపి కలదు. ముద్రికపై ఉబ్బెత్తుగా పోతపోయబడిన నందియు చామరము, నాగలి, సూర్యచంద్రవిగ్రహములు గలవు. ఇవి సాధారణముగ తర్వాతి గంగవంశపు రాజశాసనము లన్నింటియందు గూడ చిన్నవిగనో పెద్దవిగనో కన్పట్టుచున్నవి. మొదటి రేకు తొలినైపునను చివరి రేకు చివరినైపునను లిపి లేదు. రేకులు దళసరిగా చేయబడి లిపి లోతుగా చెక్కబడుటచేత, బహుకాలము శాసనపురేకులు భూగర్భముననున్నను, లిపి యేమాత్రమును చెడక సుస్పష్టముగా నున్నది.

ఒకకుండ కంఠభాగముననున్న రంధ్రములగుండ నుంచబడిన ఒక యినుపకడ్డీకి వ్రేలాడదీయబడి దిగువ కుండలో ఊకపోసి అందులో నీ శాసనపురేకులుంచి పెనిగూడ వేరొకకుండ బోర్లించి రెండుకుండలును పైని జెప్పబడిన యినపకడ్డీవలన సంధింపబడినవి. పైకుండ పగులగొట్టినగాని శాసనములు బయటకు తీయ వీలుపడుటలేదు. కుండలు భద్రముగ పదిలపరచపడి యున్నవి. ఆ గ్రామమందలి ప్రాథమికపాఠశాలలోని ప్రధానోపాధ్యాయుడీ శాసనమును నాకు దయతో నొసంగి ప్రచురింపుమని నన్ను గోరిరి.

శాసనమంతయు పురాతన నాగరలిపిలో లిఖింపబడినది. లేఖక దోషములరుదు. 'న' అను వర్ణము రెండువిధముల — నాగర, తెలుగులిపుల — వ్రాయబడినది. 'ప' 'య' అను అక్షరముల కంతగా భేదము గానరాదు. ఏత్వ ఇత్వములు సందర్భమువలననే దెలిసికొనవలెనుగాని లిపిలో భేదమువలన తెలిసికొన వీలులేదు. 'వ', 'బ' అక్షరములకు భేదములేదు. గ్రంథమంతయు సంస్కృతభాషలో రచింపబడినది. ఇది పద్యగద్యాత్మకముగా నున్నది. అనంతవర్మ చోడగంగుని తాతయగు మూడవ వజ్రహస్తుని శాసనమందలి గద్యపద్యములేగాక, తరువాతవచ్చిన రాజగు రాజరాజునుగూర్చిన వివరములు మరి రెండు మూడు శ్లోకములలో చెప్పబడినది. ఈ శ్లోకరచన నిర్దుష్టమై సరళమై కావ్యశైలి నలంకారములతో గూడి హృద్యమై యున్నది. కళింగరాజ్యమందు చక్కని సంస్కృత కవిత్వము ఆకాలమున చెప్పగలుగు కవులు గలరని రుజువగుచున్నది.

ఈ శాసనపురేకులు అదపాక అను గ్రామమున దొరకినవి. ఈ చిన్నగ్రామము శ్రీకాకుళం జిల్లాలోని చీపురుపల్లి తాలూకాలోనిది. ఇది శ్రీకాకుళమునకు దరిదాపు పదిమైళ్ళ దూరమునగలదు. ప్రసిద్ధాంధ్రకవి అడిదము సూరకవి ఈ ప్రాంతమువాడే. అదపాకనుగూర్చి ఈ కవి చెప్పిన కొన్ని పద్యములు ఈ ప్రాంతమందలి జనులు చదువుచుందురు.

“అదపాకా? అత్తవారు, ఔనే! పిల్లా?” “అదపాక మావిడాకులు పోదుపుగ...” ఇట్టి పద్యములు పామరరంజకత్వమును పొందుచున్నవి. దీనివలన అదపాక పండితుల కావాసమని తెలియుచున్నది.

ఈ రాజశాసనము సూర్యగ్రహణ కాలమున చేయబడిన భూదానాదికములను వివరించుచున్నది. అనంతవర్మ చోడగంగదేవుడు “మాతా పిత్రోరాత్మనశ్చ పుణ్య యశోభివృద్ధి” కొరకు బ్రాహ్మణులకు దానముచేసినట్లు చెప్పబడినది. ఇతర రాజశాసనములవలెగాక నిందులో నొక ప్రత్యేకత కనబడుచున్నది. దీనిలో సంధివిగ్రహి అనుజ్ఞ కానరాదు. శాసనము చెక్కినవాని పేరు గానరాదు. వ్యాసగీతములు లేవు. కావ్య కర్త పేరు గానరాదు. దాతయగు చోడగంగు తన పట్టాభిషేకకాలమున దానముచేసిన సూర్యగ్రహణ కాలమునుమాత్రము తెలియజేసెను. గుణమహార్ణవ మహారాజు ఈ తరువాతి గంగవంశపు రాజులకు మూలపురుషుడు. వీనినుండి ఈ శాసన కర్త

యగు చోడగంగునివరకు వంశము సమగ్రముగ నీయబడినది. ప్రతియొక్క రాజుపేరును, అతడు రాజ్యమేలిన కాలపరిమితియు వివరింపబడినది. వీరిలో కొందరు రాజుల భార్యల నామములు వారివారి వంశములు నుదీకరింపబడినవి. అందు కొందరి పట్టాభిషేక కాలముగూడ తిథి వార నక్షత్రలగ్నముల సహితముగ వివరింపబడినది. శాసనమున చెప్పబడిన విధమున వారి వంశవృక్షము ఈ క్రింద పొందుపరుపబడినది.

'భారతి'యందును మరియొకటి ఆంధ్రేతిహాస పత్రికయందు దాంగ్లమునను ప్రకటితము లైనవి. అంతకు పూర్వము చేదివంశమునకు చెందిన ఖారవేల, లేక ఖారవేల అనువాడు కళింగ మేలుచుండెను. ఈ ఖారవేలుడు విష్ణుపురాణము అగ్నిపురాణము శ్రీమద్భాగవత పురాణములలో చెప్పబడెను. ఈతని శిలాశాసనము ప్రాకృతభాషను భువనేశ్వరమునకు సమీపమందలి ఖండగిరియందు 'హత్తిగుంఫ' యను

గుణమహార్ణవ మహారాజు

మూలపురుషుడు

వజ్రహస్తదేవ - 44 సం॥ రాజ్యమేలెను

గుండమరాజు - 3 సం  కామార్ణవదేవ - 25 సం॥  వినయాదిత్య - 3 సం॥

(అనియంకభీము అనంతవర్మ) వజ్రహస్తదేవ - 35 సం॥

కామార్ణవ - $\frac{1}{2}$ సం॥  గుండమరాజు - 3 సం॥  మధుకామార్ణవదేవ - 19 సం॥

వైదుంబాన్వయ వినయమహాదేవి

వజ్రహస్తదేవ - 33 సం॥

రాజరాజు - 8 సం॥

చోళరాజేంద్రుని కూతురు - రాజ్యసుందరి

అనంతవర్మ చోడగంగదేవ—శాసనకర్త - శాలివాహనశకము 999 లో పట్టాభిషేకమందెను.

ఇది 999 + 78 = 1077 క్రీస్తు శకమునకు సమానము.

శాసన దానకాలము శాలివాహనశకము 1018 అనగా క్రీస్తుశకము 1096 అగును. గంగవంశమునకు పూర్వము కళింగదేశ మేలినవారు 'గాంగ' వంశమని చెప్పుకొనుచుండిరి. వీరి మూలపురుష డెవరో తెలియబడదు కాని, ఈ వంశపురాజులు తమ దానాదికముల చెప్పుటలో శాలివాహన శకమును చెప్పక 'ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము'లని చెప్పుచుండిరి. బహుశా వీరు సముద్రగుప్తుని దక్షిణ దిగ్విజయ యాత్రారంభమునుండి తమ రాజ్య సంవత్సరములను లెక్కించుకొనుచుండిరేమో. ఈ గాంగవంశమునకు పూర్వము వాసిష్ఠీవంశపు రాజులు పాలించుచుండిరి. వీరి శాసనములు రెండుమాత్రమే యింతవరకు లభ్యమయ్యెను. ఆరెండు నావలన నొకటి

చోట నొక పెద్దరాతిపై చెక్కించబడియున్నది. ఈతడు జైనమతస్థుడు. ఈతడు క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దమున నున్నట్లును మగధరాజ్యమును జయించినట్లును ఈ శాసనమున గలదు.

శాసన దానకర్తయగు అనంతవర్మ చోడగంగదేవుడు చిన్న వయసుననే పట్టాభిషిక్తుడై దరిదాపు 70 సం॥ రాజ్యమేలినట్లు శాసనములు జెప్పుచున్నవి. ఈతడే ఉత్కళదేశమును గూడ జయించి మహానదీ తీరమందలి కటకమును రాజధానిగా చేసికొని పాలించెను.

ఈ చోడగంగదేవుని కాలమున కళింగము మహోచ్ఛ్రితి నందినది. మహానదిమొదలు గోదావరివరకు

వీనిరాజ్యము వ్యాపించి యుండెను. ఈతడే కళింగ నగరమని పేరొందిన ముఖలింగమునుండి తన రాజధానిని కటకమునకు మార్చివేసెను. వీనిసంతతి కటకమునుండి బహుకాలము పాలించిరి. ఈ వంశపువాడే యగు ప్రతాపరుద్ర గజపతిదేవ మహారాజు విజయనగరసంస్థానాధీపు డగు శ్రీ కృష్ణరాయలచే నోడింపబడి తరువాత వానితో సంధిచేసికొని కటకమున పాలించుచుండెను. ఈ రాజ్యము, తరువాత మహమ్మదీయులపాలనమును ఆ తర్వాత మహారాష్ట్రుల పాలనమును పొంది తుదకు ఇంగ్లీషువారికి 1760 ప్రాంతమున వశమయ్యెను. గంగవంశముకూడ నాటితో నంతరించెను. వారి సంతతివారు తరువాత జమీందారులైరి.

అనంతవర్మ చోడగంగునిగూర్చి యొక వినోదకరమగు గాథ కలదు. అందలి సత్యాసత్యములగూర్చి నిర్ణయించుటకు తగిన యాధారములు విశేషముగ లేవు. కాని వేములవాడ భీమకవికృతములని చెప్పబడు రెండుపద్యములు బహుకాలమునుండియు నాంధ్రదేశమున వ్యాప్తిగలిగి యున్నవి. ఈ రెండుపద్యములలో భీమకవి పేరుండుటచేతను, ఈ భీమకవి శంభువరప్రసాదుడును శాపానుగ్రహశక్తుడునగుటచేతను కేవలము తిరస్కరించుటకవకాశము లేదు.

వేములవాడ భీమకవిది గోదావరీమండలము. బ్రాహ్మణుడు. శంభువరప్రసాదలబ్ధకవి. శాపానుగ్రహసమర్థుడు. ఒకసారితడు కళింగరాజ్యమునకు వచ్చి రాజగు అనంతవర్మ చోడగంగదేవుని దర్శనార్థము ద్వారపాలకునిచే వార్త బంపెను. రాజప్పుడు మిక్కిలి తొందరపనులలో నుండుటవలన "సందడి దీరిన రమ్ము పొమ్ము" అని ప్రత్యుత్తరమంపెను. దర్శనమీయక రమ్ము పొమ్మనుటకు, గినిసి భీమకవి:

"వేములవాడ భీమకవి
వేగమెచూచి కళింగగంగు తా
సామముమాని కోపమున
సందడిదీరిన రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోసమిక
ముప్పదిరెండుదినంబు లావలన్
జామునకర్థమందతని
సంపదశత్రుల పాలుగావుతన్"

అని శపించెను. ఈ శాపఫలమో యన ఉత్కల దేశాధీపు డగు నొక 'రాయలు' గొప్ప సైన్యముతో కళింగముపై దండెత్తివచ్చి చోడగంగునోడించి కళింగ మాక్రమించెను. యుద్ధమందు రాజును తన భార్యాపుత్రాదులు చెల్లాచెదరైపోయిరి. విధిలేక, నిలువ నీడలేక రాజు దేశమునుండి వెడలిపోయి మాధుకర వృత్తిని జీవయాత్ర గడుపుచుండెను. ఈ సంచారములో నొకప్పుడీరాజు వేములవాడ అగ్రహారమును జేరుకొని ఆనాటిరాత్రి బ్రాహ్మణవీధిని మాధుకరము పెట్టుమని యరచుచు నొక బ్రాహ్మణగృహస్థుని యింటిముంగిట కాలుజారుటచేత నచ్చటనున్న యొక గోతిలో పడెను.

"ఎంత బ్రతుకు బ్రతికితిని. నేటి యీ చీకటిలో కాలు దివ్వటియు లేకపోయె నే? గోతిలో పడితిని. ఎప్పటి కెయ్యది ప్రాప్తమగునో చెప్పలేముకదా?" అని అప్రయత్నముగ వాని నోటినుండి ఈ మాటలు వెడలినవి. ఆ సమయముననే ఆ యింటి యజమానుడు భోజనమునకు వెడలుటకుముందు పాదప్రక్షాళనార్థము బైటకువచ్చుట తటస్థించెను. వెంటనే ఒకడు గోతిలో కాలుజారి పడుటయు, వాని నోటినుండి వెడలిన మాటలు, కనుటయు, వినుటయు తటస్థించెను. ఆపదలో నున్నవానికి చేయూత నిచ్చి గోతినుండి వెలుపలికి దీసి యరుగుపై గూర్చుండబెట్టి వాని వృత్తాంతమంతయు చెప్పుమని యా బ్రాహ్మణుడు కోరెను. తాను పూర్వము కళింగ సామ్రాజ్యమేలు చక్రవర్తిననియు ఒకానొక సమయమున వేములవాడ భీమకవికి అపకృతి చేయుటవలన వాని శాపమునంది తానొక జోగినైతిననియు విశదపరచెను. అంతట నా బ్రాహ్మణుడు కి ఆ రాత్రి నాతిథ్యమిచ్చి సేదదీర్చి పంపుటకు నిశ్చయించుకొనెను. జోగియైన యా రాజును, భోజనమునకు సిద్ధపరచి, నాటికి లభించిన యాహారాదికముల నొక పాత్ర సిద్ధపరచి భుజింపుమని వానిగోరెను. రాజు సంశయించి వానికి నాతిథ్యమిచ్చువాడు బ్రహ్మక్షత్రియకులుడైనగాని యన్యకులజుల యింట భుజింప నొల్లకుండెను. అప్పుడా గృహస్థుడు తా బ్రాహ్మణుడనియు తనపేరు వేములవాడ భీమకవి యనియు వినరింపగనే రాజపరిమితానంద విస్మయ భయభ్రాంతుడై భోజనపాత్రముందు కూర్చుని భుజింపక మిన్నకుండెను. ఎంత వేడినను తా భుజింపకుండుట కనిపెట్టి వాని కోర్కె యెట్టిదో వేడుమనియు దాని దానీడేర్చెదననియు చెప్పెను. తన్ననుగ్రహించి తన దోసమును సైరించి, తిరిగి తన రాజ్యము తనకు వచ్చునట్లాశీర్వదింపుమని యాతడు బ్రాహ్మణుని పాదముల బట్టి విడువకుండెను. భీమకవికి జాలిపుట్టి:

"వేయి గజంబులుండ బది
వేల తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ సగ
రంబున బట్టముగట్టుకో వడిన్
రాయ కళింగ గంగ! కవి
రాజ భయంకరమూర్తి జూడగా
బోయిన మోసమాసమున
బున్నమ పోయిన షష్ఠి నాటికిన్."

అని దీవించెను. రాజులుగూడ సంతోషించి భుజించి మరునాడుదయమున దన ప్రయాణము సాగించుచుండెను.

నూతన కళింగరాజత్యానందమున వినోదములతో రాజ్యపాలనము సాగించుచుండెను. నూతన పట్టాభిషేక మహోత్సవ కార్యకలాపములలో కూచిపూడి భాగవతుల కలాపమొకటి యేర్పాటు చేయబడెను. అందుకొరకై కూచిపూడినుండి భాగవతుల మేళమొకటి కళింగరాజ్యమునకు వచ్చుచుండెను. దారిలో మద్దెలలు మొదలగు సామగ్రిని మోయుటకు నియమితుడైన కావటి కూలివాడొకడు మరణించుట తటస్థించెను. మార్గమధ్యమున, కావడిమోయు కూలివానికై భాగవతులు ప్రయత్నించుచుండగా మాధుకర మెత్తుచున్న వాడు వీరికి గోచరించెను. ఈతడు భాగవతుల కావడి మోయుటకును వారు వీనికి అన్నము పెట్టుటకు నిర్ణయముజరిగెను. ఈవిధముగ భాగవతుల మేళముతో నీరాజు కావటివాడుగ వారితో వచ్చి కళింగరాజధానిని జేరెను. నూతనరాజులుగూడ కూచిపూడి భాగవతులకు తగినబస లేర్పాటుగావించి "కళింగరాజుపై తమ విజయగాథ"ను భాగవతముగ ప్రదర్శింపవలయు నని యాజ్ఞాపించిరి. ప్రదర్శనమునకు కొలదికాలము గడువీయబడెను. ఈ గడువుకాలములో భాగవతులు నూతనకలాపమును రచించి వేషధారులచే వల్లింపజేసి ప్రదర్శనమునకు దాము సిద్ధముగ నుంటిమనియు తగినదిన యేర్పాట్లు చేయించవలయుననియు రాజును ప్రార్థించిరి. రాజుగూడ నొకదినము నేర్పాటు గావించి ప్రదర్శనమునకు వలయు వసుసామగ్రిని గూడ వేషధారులకు సమకూర్చెను. అందు ప్రధాన వేషధారుడు చోడగంగపాత్ర నభినయింపవలయును. అట్టి రాజపాత్రను ధరించుటకు రాజోచిత వస్త్రములు, కిరీటము, కత్తి, గుర్రము మొదలగు వస్తువులు కావలయును. భాగవతులు ఆలోచించి వారితో వచ్చిన కావటివాడే కళింగగంగపాత్రకు తగినవాడని నిర్ణయించి వాడు వినికిడిచేయవలసిన పద్యములు, పాటలు, మాటలు మొదలగునవి జాగ్రత్తగా వల్లించునట్లు జేసిరి. ప్రదర్శనదినమున రాజపాత్రకు కావలసిన గుర్రమును వస్త్రజాలమును నూతనరాజులే సమకూర్చిరి.

భాగవతము అతివినోదముగ ప్రదర్శింపబడుచుండెను నూతనరాజు, మంత్రి పురోహితసేనానులు సభయందుచితాసనముల నాసీనులై భాగవతకలాపము నత్యానందముతో వీక్షించుచుండిరి సభ్యులందరును ప్రధానపాత్రధారియగు కళింగ గంగుకొరకు నిరీక్షించుచుండిరి. అంత తెర యెత్తబడెను. దీపముల కాంతిలో కళింగగంగు గుర్రపుస్వారిచేయుచు కనుపట్టెను. ప్రజలందరును వాని నిజముగ కళింగ గంగే యని భావించుచుండిరి. రాజబృందముగూడ భాగవతుల వేషవైఖరిని మిక్కిలి కొనియాడిరి. ఇట్లుండ కళింగగంగుపాత్రధారి కత్తితో సాముచేయుచు గుర్రముపైనుండి యుద్ధధ్యానము సేయుచు, తనపాత్రమును ప్రదర్శించుచుండెను. అకస్మాత్తుగా నీపాత్రధారి నూతనరాజును సమీపించి కత్తితో వాని శిరమును ఖండించి తనవారగు పూర్వపు మంత్రివర్గమును బలుకరించి తానే నిజముగ చోడగంగదేవుడనని చెప్పికొని, సింహాసన మధిష్ఠించెను. ఇట్లు ఆటపాటల చేతనే రాజ్యమంతయు, తిరిగి వశమయ్యెను. రాజు చనిపోయినవెంటనే రాజానుచరులు పలాయనమైరి. కొలదికాలములో అనంతవర్మ చోడగంగదేవుడు తగిన ప్రయత్నములుజేసి శత్రురాజుల మూలస్థానమగు సజ్జనగరమును (జాజిపూరు) ముట్టడించి శత్రువుల బూర్తిగనోడించి ఉత్కలరాజ్యమెల్ల జయించెను. కళింగరాజ్యములో నీ యుత్కలరాజ్య మొక ప్రధాన భాగమయ్యెను. పరిపాలనము బాగుగసాగుటకై అనంతవర్మ తన రాజధానిని కటకమునకు మార్చివేసెను. నాటినుండియు కళింగమునకు కటకమే రాజధానిగ నుండెను. పై కథ నమ్మకపోవుటకు కారణమంతగా కానబడదు. కాని చారిత్రాధారములు గానరావు. అనంతవర్మ ఉత్కలమును జయించుటయు కటకమును నూతన రాజధానిగ మార్చుటయు నిశ్చయములు. ఈ జయము క్రీస్తుశకము 1132 న జరిగెను.

అనంతవర్మ చోడగంగదేవుడు 70 సం॥ పరిపాలనము చేసెను. ఈతడు 20 సం॥ ల ప్రాయమున రాజ్యాధిపత్యమును బడసి 90 సం॥ లవరకు జీవించియుండెనని యూహింపవచ్చును. వీనిని ప్రజలు

చోడగంగని పిలుచుచుండిరి. పట్టాభిషేక కాలమున అనంతవర్మ అను పేరుకూడ చేర్చుకొనెను. చోడ నామము తన తల్లివలన వచ్చినది. ఆమె పేరు రాజ్యసుందరి. ఈమె రాజేన్ద్రచోళుని కూతురు. 'రాజేంద్ర చోడుడు ప్రసిద్ధినందిన చోడదేశపు రాజరాజు కొడుకు. రాజ్యసుందరికి మరియొక సోదరిగలదు. ఆమెయే అమ్మంగదేవి. ఈమె చాలుక్య వంశప్రసిద్ధుడగు రాజరాజనరేంద్రుని భార్య. రాజరాజనరేంద్రుని తల్లియు చోళ రాజరాజుకూతురు. వాని తండ్రి విమలాదిత్యుడు. అందుచేత చాలుక్య రాజరాజనరేంద్రుడును కళింగ రాజరాజును తోటి అల్లుండ్రు. ఆ కాలమున చోళులతో సంబంధము ఘనకార్యముగ నెన్నబడుచుండెను. అందువలననే రాజ్యసుందరి కొడుకు చోడగంగని పిలువబడజొచ్చెను. గంగను పదము తన వంశముగు గంగవంశమును తెలుపుచున్నది ఇక అనంతవర్మ యను పేరు ఈ వంశమువారందరును బిరుదునామముగ తలంచుచుండిరి. వాసిష్ఠకులజులు తొలుదొల్త నీకళింగము నేలిరని యింతకు ముందే చెప్పబడినది. వారిలో ప్రధానుడు అనంతవర్మ. దేవపురము రాజధానిగా నేలెను. వానినుండియు కళింగమేలిన రాజులు అంటు ముఖ్యముగా తరువాతి గంగవంశపు రాజులు అనంతవర్మ నామమును బిరుదుగా వహించుచుండిరి.

కళింగరాజ్యము ఉత్తర, మధ్య, దక్షిణకళింగములుగ విభాగింపబడి త్రికలింగమున నొప్పుచుండెను. ఒక్కొక్క భాగ మనేక మండలములుగ విభజింపబడి ఒక్కొక్క మండలము మండలాధీశుల యాజమాన్యమున నుండెను. ప్రతిమండలమును అనేక విషయములుగ భాగింపబడెను. వరాహవర్తని, సంవాకోలు వర్తని, కొంగోడు మొదలగునవి విషయములు. విషయాధీశుల పాలనముననుండెను. కొన్ని గ్రామములు కలసి యొక విషయముగుచున్నది. పరిపాలనమునకు గ్రామము ప్రాతిపదిక. ప్రతిగ్రామమునకు ఖచితమైన సరిహద్దులున్నవి. ఈ సరిహద్దులు 'స్థాపిత శిల'లవలన నిరూపింపబడుచుండెను. భూములకు కట్టుబడి, నీటితీరువ మొదలగు పన్నులు విధింపబడుచుండెను.

ఈ శాసనము కళింగనగరమునుండి యొసగబడినది. ఈ కళింగనగరము నేటి ముఖలింగమని నిర్ధారణగ నిరూపింపబడినది. ఈ ముఖలింగము వంశధారానదీతీరమున రమ్యమైన ప్రదేశమున నిర్మింపబడినది. ఇచ్చట అనేక దేవాలయములు కళింగాధీశులచే నిర్మింపబడినవి కలవు. ఇది రాజధాని నగరముగ నుండక పూర్వము 'గాంగ' 'గంగ' వంశపు రాజులకు దంతాపురము, సింహపురము రాజధానులుగ నుండెను. ఈ రాజులు పరమమాహేశ్వరు లనియు, పరమ భట్టారకు లనియు, మహారాజాధిరాజు లనియు, త్రికళింగాధిపతు లనియు చెప్పుకొనుటచేత, వీరి మతము శైవమనియు వీరు చక్రవర్తిపదవి ననుభవించుచుండిరనియు, త్రికళింగముల నేలుచుండిరనియు విశదమగుచున్నది.

అనంతవర్మ చోడగంగదేవుడు సమస్తామాత్యులను, ప్రముఖ జానపదులను, 'సంవా' విషయమందలి నందిగ్రామమున సమావేశపరచి ఆ సభ్యులకు నిట్లు విశదము చేసెను:—"గుమ్మడి"గ్రామము, "మూందిలిప్ర"గ్రామము అను వానిని గ్రాసముకొరకు సమస్తమైన పన్నులను తొలగించి సూర్యగ్రహణ కాలమున నాయొక్కయు నా తలిదండ్రులయొక్కయు పుణ్యయశోభివృద్ధికొరకు శ్రీవత్సగోత్ర మావిన బంధోపాధ్యాయుని పుత్రులు (1) ఆదిత్యాఖ్య (2) ప్రయపాఖ్య (3) దుర్గశర్మ (4) నారాయణ విష్ణుశర్మ (5) గాంద్ర అను వారికిని, శాండిల్యగోత్ర (6) మావిపాఖ్యునకును ఇవ్వబడినవి. ఈ యారుగురు బ్రాహ్మణులును అధీత వేదశాస్త్రపారంగతులు, సద్ధర్మ నిరతేభ్యులు ఈ దానము శాకాబ్దములు గిరి, శశి, వియత్, చంద్ర, సంజ్ఞలచే తెలుపబడిన కాలమున (గిరి=8, శశి=1, వియత్=0, చంద్ర=1 అనగా అంకానాంతా మతోగతిః అను సూత్రముచేత 1018 అగుచున్నది) ఉదకపూర్వకముగా నాచేత దానము చేయబడినవి"

దానకాలము సూర్యగ్రహణ మగుటచేత శాలివాహనశకము 1018 సంవత్సరమున అనగా 1018 + 78 = 1093 క్రీ. శ. ఒసగబడినది.

ప్రతిగ్రహీతలు ఆంధ్రులుగా కనబడరు. వారు మావిన బంధోపాధ్యాయుని కొడుకులు. 'బంధోపాధ్యాయ' అను పేరు వంగదేశీయుడని స్ఫురించుచున్నది. (వంగదేశీయు లీ యాంధ్రదేశమున కెందుకు వచ్చిరి? ఎటుల రాజసన్మానమందిరి? ఎంతకాలము నుండి వారీ ప్రాంతమున నివసించుచుండిరి? అను ప్రశ్నలకు సమాధానము చెప్పుట కష్టము. బహుశా ప్రతిగ్రహీతలు ఉత్కళులయిన గావచ్చునేమో. మొదటి యైదుగురకు తండ్రి మావిన బంధోపాధ్యాయుడు. 'బంధోపాధ్యాయ' అను పదము ఇంటి పేరు గావచ్చును లేదా బిరుదునామము కావచ్చును. పేరు మాత్రము 'మావిన'. రెండవ పేరు 'మావిప'. ఈ రెండు నామములు తెలుగువారి పేరులేమో అని పదరూపమువలనను, పలుకుబడివలనను, ధ్వనివలనను సందేహము పొడముచున్నది. ఏదియు స్పష్టముగా

జెప్ప వీలుపడదు.) 'సంవా' విషయము మాత్రము ప్రస్తుత నరసన్నపేట తాలూకా యగుచున్నది. ఇది శ్రీకాకుళమునకు 12 మైళ్ళ దూరమున నున్నది.

శాసనపురేకులు చీపురుపల్లి తాలూకాలోని అవ పాకగ్రామమున లభించినవి. దానమీయబడిన గ్రామములు నరసన్నపేట తాలూకాలోనివి. ప్రతిగ్రహీతలుగాని వారివంశీకులుగాని నరసన్నపేట తాలూకా విడిచి చీపురుపల్లి తాలూకాచేరి యచ్చట కొంత కాలము నివసించి ఏకారణముననో ఆంధ్రదేశమును విడిచి వెడలునపు డీ శాసనముల కుండలలో భద్రము చేసి భూస్థాపితము చేసియుందురు. లేనియెడల భూస్థాపితము చేయనవసర ముండదు.

శాసనగ్రంథమంతయు 40 పంక్తులలో నిమిడి యున్నది. ఈ గ్రంథ మయిదు పెడలపై లిఖింపబడినది కాని ఒక్క పంక్తికిమాత్రము స్థలము చాలకపోవుట చేత మరియొక రేకున శేషించిన పంక్తి చెక్కబడినది. ఈ పంక్తితో నాలుగురేకులైనవి. అయిదవరేకున లిపి ఏమియు లేదు కాని 'ససీమ' అను మూడక్షరములు మాత్రము చెక్కబడినవి.

క్రీ|| శ|| నాల్గవశతాబ్దమునుండి గుణమహార్ణవ మహారాజువరకు నేలిన రాజవంశము 'గాంగవంశ' మనియు తరువాతిరాజులు 'గంగ' వంశమనియు వాడుచుండిరి. 'గాంగ', 'గంగ' శబ్దములలో భేద మంతగా కానరాదు. ఉభయవంశములకు మహేంద్రగిరిపై ప్రతిష్ఠింపబడిన గోకర్ణస్వామియే ప్రధాన దైవతము. ఉభయవంశములవారును ఈ దైవతమువలననే "సమాసాదితైక శంఖ, భేరీ, పంచమహాశబ్ద, ధవళచ్ఛత్ర, హేమచామర, వరవృషభలాంఛన సముజ్వల సమస్త సామ్రాజ్యమహిమను" పొందినట్లు చెప్పుకొనుచుండిరి. కాబట్టి ఈ రెండువంశము లొక్కటే యని పొడగట్టుచున్నది.

ఈవంశములు వేర్వేరని చెప్పుటకుకూడ నాధారములు లేకపోలేదు. మొదటివంశమువారు వంశావళిని చెప్పుటలో తండ్రిపేరుగాని ఒకొక్కప్పుడు తండ్రి తాతలగాని చెప్పుచుండిరేగాని మూలపురుషునినుండి వర్ణన కనబడదు. వారు గద్యనేగాని తరువాతివారివలె శ్లోకములచే వంశావళిని వర్ణించుటలేదు. దానకాలమును వివరించుటలో పూర్వపువారు "ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరములనే వాడుచుండిరిగాని శాలివాహనశకము వాడరైరి. తరువాతివంశమువారికి మూలపురుషుడు గుణవర్మ యని చెప్పుకొనుచుండ, తొలి వంశమువారికి మూలపురుషు డెవడో తెలియదు. కళింగరాజ్యమున గాంగవంశస్థాపకు డెవడో వారు చెప్పుకొనకపోయినను, కాలగణనమునుమాత్రము ఆ రాజ్యస్థాపనకాలమునుండి చేయుచుండిరి. దీనినే కళింగప్రవర్ధమానలేక గాంగేయప్రవర్ధమాన విజయ రాజ్యసంవత్సరము లనుచుండిరి. ఈ గాంగవంశము బహుశా నాల్గవశతాబ్దాంతమున స్థాపితమై యుండవచ్చును.

అనంతవర్మ చోడగంగదేవుడు కళింగనగరమున నేలినరాజులలో ఆఖరువాడును ఉత్కలమందలి కటకమున నేలినరాజులలో మొదటివాడునై యున్నాడు. వీనివంశమువారు క్రమక్రమముగ నుత్కలులై నేటి ఉత్కలమందలి రాజులకు మూలపురుషులగుచున్నారు. గంగవంశపుపరిపాలనము 1761 లో అంతమందినది.

అనంతవర్మ చోడగంగుని శాసనము లనేకములు బయలువెడలినవి. అందులో శిలాశాసనములు హెచ్చుగా నున్నవి. వీని పూర్వులిచ్చిన తామ్రశాసనములలో అనియంకభీముడను మారుపేరుగల వజ్రహస్తునకు కామార్ణవ గుండమరాజులు కొడుకులనియు వారలు క్రమముగా అర్ధసంవత్సరము, మూడు సంవత్సరములు రాజ్యమేలిరనియు, ఆ తరువాత కామార్ణవ వినయమహాదేవులకు జనించిన వజ్రహస్తుడు రాజ్యమునకు వచ్చెననియు చెప్పబడినది. కాని అనంతవర్మ చోడగంగదేవుని శాసనములలో కామార్ణవ గుండమరాజుల తర్వాత వజ్రహస్తుని సాపత్న్యపుత్రుడగు మధుకామార్ణవుడు 19 సంవత్సరములు రాజ్యమేలినట్లు చెప్పబడినది. అందుకు సంబంధించిన శాసనభాగ మిట్లున్నది:—.

..."తతస్తదగ్రసూనుః కామార్ణవదేవోర్ధ్వసమామ్ । తతస్తదనుజో గుణ్డమహీపతి స్త్రీణివర్షాణి। తదను తస్య ద్వైమాతురో మధుకామార్ణవ ఏకోనవింశతి వర్షాణి తతః కామార్ణవాద్వైదుంబాన్వయ సముద్భవాయాః వినయమహాదేవ్యాం జాతః శ్రీవజ్రహస్తదేవో...సత్రయస్త్రింశత మబ్దకా నవని మపాలయత్"

ఇట్టి విరోధపాఠముల చారిత్ర పారంగతులు విమర్శించి సత్యమును నిరూపింపవలసి యున్నది.

అనంతవర్మ చోడగంగదేవున కనేకమంది భార్యలున్నట్లు శాసనములు చెప్పుచున్నవి. ముఖలింగ దేవాలయమందలి శాసనములలోను, దాక్షారామ దేవాలయ కుడ్యములపై వ్రాతలలోను, వీని భార్యల నామములు గానబడుచున్నవి. ఈ భార్యలు తమ భర్తతో రాజ్యమందు సంచరించుచుండు సమయమున ప్రసిద్ధదేవాలయముల జూచుటయు దేవునికి

సమర్పించిన ధనకనక వస్తువుల క్రమము శిలాశాసనములు అచ్చటచ్చట వ్రాయించుటయు జరుగుచుండెను. ఇంతవరకు సమహరిన వారి నామములీ క్రింద జూపబడినవి.

అనంతవర్మ చోడగంగదేవుని భార్యలు:—

1. కస్తూరికామోదిని—పట్టమహిషి.
2. ఇందిరాదేవి
3. చంద్రలేఖ
4. జయంగొండారు
5. వెన్నవదేవి
6. పల్లవమహాదేవి
7. యరకమ్మదేవి
8. లావణ
9. రాజలదేవి
10. పద్మలదేవి
11. శ్రియాదేవి
12. కల్యాణదేవి
13. దెన్నమహాదేవి
14. మాదమదేవి
15. చోడమహాదేవి.

ఇంక మరెందరుండిరో తెలియరాకున్నది

అనంతవర్మ చోడగంగదేవునకు ప్రధానమంత్రి పిన్నయభట్టు. అన్యదేశ వ్యవహారముల జూచు మంత్రి (*Minister for foreign affairs*) సంధివిగ్రహి పేరు సామ్ములరేచన. సేనాపతు లనేకులు గలరు. అల్లన, ఎఱదోర మొదలగువారు. సర్వసేనాని బణపతి. ఈతడు బ్రాహ్మణుడు. వీని భార్య పద్మావతి. ఈతడే ఉత్కల దేశమును జయించుటలో రాజునకు మిగుల తోడ్పడెను. వేములవాడ భీమకవి శాపమున నీ రాజు కలింగదేశమున ఉత్కలాధీశునిచే గోల్పోవుటయు ఆ కవి యనుగ్రహమువలన తన స్వంత రాజ్యమును తిరిగి స్వాధీనపరచుకొనుటయే గాక, కలింగమునకు మూడు రెట్లధికముగా రాబడిగల ఉత్కలదేశమును జయించుటయు జరుగుటచేత చోడగంగు తన రాజధానిని మహానదీతీరమందలి కటకము రాజధానిగా జేసికొని తన పుత్రుల నొందరి నీ కళింగ మేలుటకై రాజప్రతినిధులుగ బంపెను.

అనంతవర్మ చోడగంగదేవుడు రాజనీతి నిపుణుడే గాక వినోదప్రియుడు గూడ నైయున్నాడు. ఈతని రాజధాని వంశధారా నదీతీరమందలి ముఖలింగమను మూరు పేరుగల కలింగనగరము. ఈ నది రాజధాని నుండి 25 మైళ్లు తూర్పుగా పవహించి సముద్రములో కళింగపట్టణ మనుచోట కలియుచున్నది. సముద్రమునకు మూడు మైళ్ళ దూరమున వంశధారా నదీతీరమున 'వనిత మండెల' మను గ్రామము నేటికిని కలదు. రాజీ గ్రామ సమీపమున గొప్ప భవనముల నిర్మించెను. అందు తన రాణులకును, వారి చెలికత్తియలకును, రాజభవనముల గట్టించెను. నాట్యశాలల గూడ నిర్మించెను. నదికి ఆనకట్ట కట్టించి యా జలమును వనిత మండెల గ్రామములోనికి దెప్పించి జలక్రీడలకు కృత్రిమ తటాకముల నిర్మించెను. వీనియందు రాజుతో గలసి రాణులును వారి చెలికత్తియలును జలక్రీడల సలుపుచుండిరి. నాట్యశాలలలో నాట్యము లాడుచుండిరి. ఈతడు సంగీతప్రియు డగుటచేత వనిత మండలము ఎల్ల పొద్దులు వాద్యగానాది కుతూహలములతో నెగడుచుండెను. నేడా నాట్యశాలలు, జలక్రీడా తటాకములు, రాణివాస భవనములు, గీత వాయిద్య శాలలు నశించి భూగర్భమున దాగియున్నవి. ఈ గ్రామమున కెదురుగ నది కావలియొడ్డున సాలిహుండమను గ్రామమును, దానికి చేరువను పురాతన బౌద్ధ సంఘారామములు, స్తూపములు, విహారములు గల పర్వత మున్నది. ఇప్పు డీ పర్వతమును పురాతత్వ శాఖవారు వేలకొలది ధనము వినియోగించి త్రవ్వించుచున్నారు. దీనితోబాటు వనితమండెల గ్రామమున గూడ త్రవ్వించిన ఆ కాలపునాటి అనంతవర్మ చోడగంగదేవుని రాజ్యవైభవము వెల్లడి కాగలదు. సాలిహుండమున వెలువరించిన అమూల్యవస్తు సామగ్రితో బాటు వనితమండెలమున గూడ మరెట్టి వింతలు బయల్పడునో చూడవలయును.

# మూలము—రేకులనుండి యథాప్రకారము

## 1 వ రేకు      ప పెడ

పంక్తులు.

1. ఓం॥ స్వస్తిశ్రీమతా మఖిల భువన వినుత నయవినయ దయా (దాన)1 దాక్షిణ్య
2. సత్య శౌచ శౌర్య్య ధైర్య్యాది గుణరత్న పవిత్రకాణాం మాత్రేయగో
3. త్రాణాం విమల విచారాచార పుణ్యసలిల ప్రక్షాలిత కలికాలక
4. ల్మషమషీణాం మహామహేన్ద్రాచల శిఖరప్రతిష్ఠితస్య
5. సచరాచర (గు)2రోః సకలభువన నిర్మ్మాణైక సూత్రధారస్య
6. శశాఙ్క చూడామణే ర్భగవతో గోకర్ణస్వామినః ప్రసా
7. దా త్సమాసాదితైక శఙ్ఖభేరీ పఞ్చమహాశబ్ద ధవళచ్ఛత్ర
8. హేమచామర వరవృషభలాఞ్ఛనసముజ్వల సమస్త సామ్రాజ్య

## 2 వ రేకు—1 వ పెడ

1. మహిమ్నా మనేక సమరసఙ్ఘట్టసముపలబ్ధ విజయలక్ష్మీ సమాలి
2. ఙ్గితోత్తుఙ్గ భుజదణ్డ మణ్డితానాం త్రికలిఙ్గమహీభుజాం గఙ్గా
3. నా మన్వయ మలఙ్కరిష్ణో ర్విష్ణోరివ విక్రమాక్రాన్తధరామణ్డలస్య
4. గుణమహార్ణవ మహారాజస్య పుత్రః॥ శ్రీవజ్రహస్తదేవ శ్చ
5. తుశ్చత్వారింశత మబ్దకాన్ క్షితిమరక్షీత్ తత్త
6. నయో గుణ్డమరాజో వర్షత్రయ మపాలయత్॥ తదను తదనుజః
7. కామార్ణవదేవః పఞ్చత్రింశద్వర్షాణి। తస్యానుజో వినయా

## 2 వ రేకు—2 వ పెడ

1. దిత్యః సమాస్త్రిస్రః॥ తతః కామార్ణవ తనయో వజ్రహస్తః యో మదగలి
2. తగణ్డాన్ గజాన్ సహస్ర మర్థిభ్యః సమదాత్ సపఞ్చత్రింశత మ
3. బ్దకాన్॥ తత స్తదగ్రసూనుః కామార్ణవదేవో ర్ధసమామ్॥ తత స్తదనుజో
4. గుణ్డమహీపతి స్త్రీణివర్షాణి॥ తదను తస్య ద్వైమాతురో మధుకామార్ణవ ఏ
5. కోనవింశతి వర్షాణి। తతః కామార్ణవా ద్వైదుమ్మ్యాన్వయ సము
6. ద్భవాయాః వినయమహాదేవ్యాం జాతః శ్రీవజ్రహస్తదేవో యో దివ
7. ః పతన్త మతిభీషణ మశనిం శస్త్రైర్భిజఘాన స త్రయత్రిం శ
8. తమవకా నవనీ మపాలయత్॥ తతస్తుతస్యాత్మభ వోరిమర్ద్ద

## 3 వ రేకు—1 వ పెడ

1. నస్సరాజరాజ క్షితిపః క్షితిం సమాః ఆరక్ష దష్టౌ వరుణాలయాం
2. బరాన్నిధి ప్రావారలనాన్ని ధేయాన సన్నిధిః॥ తతో రాజేన్ద్ర చోళస్య

3. తనయా రాజసున్దరీ. రాజ్ఞ స్తస్యా గ్రమహిషీ సతీ సుతా మనూయ
4. తా॥ శాకాబ్దేనన్ద రన్ధ్రిగ్రహ గణగణితే కుమ్భసంస్థే దినే
5. శే శుక్లే పక్షే త్రితీయాయుజి రవిజదినే రేవతీ భేన్వయు
6. గ్మలగ్నేగ్జాన్వవాయాంబుజవనదినత్రి ద్వేశ్వవిశ్వెంభరాయా
7. శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధిరధిప శ్చోడగఙ్గాభి షిక్త

## 3 వ రేకు - 2 వ పెడ

1. ॥ కలిఙ్గనగరా త్పరమమాహేశ్వర పరమభట్టారక మహారాజాధిరాజత్రిక
2. లిఙ్గాధిపతిః శ్రీమదన న్తవర్మ్మచోడగఙ్గదేవః కుశలీ సమస్తామాత్యప్రము
3. ఖజనపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి విదితమస్తు భవతాః సంవా విషయే న
4. న్ద్రిగామో గుమ్మడినామగ్రామా మూణ్డి లిప్రాం కౌఞ్చె గామా గానికుతు
5. చతుస్సీమావచ్ఛిన్న సజలస్థలస్సర్వ్వపీడావివర్జిత న్సామ్యోపరా
6. గో ష్మనాృతాపిత్రోరాత్మనశ్చ పుణ్యయశోభివృద్ధయే శ్రీవత్స
7. గోత్రస్య మావిన భ 3 న్నోపాధ్యాయస్య పుత్రేభ్యః ఆదిత్యాఖ్యా ప్రయపాఖ్య
8. దుర్గ్గశర్మ నారాయణ.విష్ణుశర్మ భ్రాతృభ్యః శాన్డిల్య గోత్రాయమాచ
9. పాఖ్యాయచ అధీత వేదశా స్త్రేభ్యః సద్ధర్మ్మనిరతేభ్యః శాకా

## 4 వ రేకు - 1 వ పెడ

1. బ్దేషు గిరి శశివియచ్చన్ద్రిగణి తే షూదకపూర్వ్వకం సంప్రదత్తో స్మాభిరితి॥

*N. B.* ఈ రేకుపై ఒక్క పంక్తియే కలదు.

5 వ రేకు - 1 వ పెడను "సపీమా" అను మూడక్షరములు మాత్రమే కలవు.

---

(1) 'దాన' పదమును మొదట చెక్కుట మరచి తరువాత రెండు పంక్తులకు నడుమ చెక్కెను.

(2) 'గ' చెక్కుట మరచెను.

(3) భంజోపాధ్యాయ— కావచ్చును.

# * హాస్యరసము *

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రాణు లందరిలోను మానవు డొక్కడే నవ్వగలిగి యున్నాడు. హాస్యరసము మానవునియందే కన్పించుచున్నది. పశువులు, పక్షులు సుఖము ననుభవించగలవు గాని హాస్యము ననుభవించలేవు. సుఖానుభూతిని హాస్యానుభూతికంటె విలక్షణమైన దానినిగా చెప్పవలెను. అధ్యవసాయాత్మకమగు బుద్ధి కలిగియుండుటచేతనే గాక, హాస్యమును కలిగి యుండుటవలనగూడ మానవు డితర ప్రాణులకంటె విలక్షణుడగుచున్నాడు. హాస్యము నీవిధమగు బుద్ధితో నభిన్నమైనట్లు గ్రహింప వీలులేదా?

పశు పక్షులలో భౌతిక వాంఛలు, ఇంద్రియ భోగము ప్రధానమని చెప్పుచున్నాము. ఆత్మరక్షణ, స్వవంశవృద్ధియను ప్రవృత్తులు ప్రాణులందరియందు కన్పించుచున్నను భౌతికసుఖములను క్రమక్రమముగా వదలి సంస్కృతుడగుటయే మానవుని పరమావధియని చెప్పుచున్నాము. ఇంద్రియ నిగ్రహము, పశ్చాత్తాపమునందుట అనునవి మానవునియందే కన్పించుచున్నవి. కాగా హాస్యభావన, అధ్యవసాయాత్మకమగు బుద్ధి, ఇంద్రియ నిగ్రహము, పశ్చాత్తాపమున నభివ్యక్తమగు వ్యక్తిత్వము అనునవి అభిన్నార్థకములు కాగలవా? ఇవి అభిన్నార్థకములు కానిచో వీటి కెట్టి అన్యోన్య సంబంధము కలదు?

శృంగారమునుండి హాస్యము జనించునని, శృంగారానుకృతియే హాస్యమని, భరతుడు పల్కిన మాటలు "ఫ్రాయిడ్" (*Freud*) వాదమును స్మరింప జేయగలవు. జన్యజనకములకు తాదాత్మ్యము కొంతవరకైననుండును గనుక శృంగారహాస్యములలో నీవాదము ప్రకారము అన్యోన్యతాదాత్మ్య ముండి తీరవలెను. శృంగారమున వ్యక్తముగా అనురాగ మనుభూతమగుచున్నది. హాస్యమున నీవిధమగు రాగిత్వము కన్పడదు. హాస్యమున రతిభావ మణచబడి యుండును. సుప్తముగా గల రతిభావ మిచట స్వస్వరూపమునుకోల్పోయి రూపాంతరమున కన్పించునని తాత్పర్యము. కాని ఈ రూపాంతరము రతియొక్క రూపమే అను జ్ఞానమున్నచో హాస్యప్రతీతి ఉండజాలదు. ఏవంవిధమగు జ్ఞానము లేకపోవుటచే మానసిక సుఖప్రాప్తికి కావలసినవిషయమునకై మానవుడు యత్నించుచున్నాడు. చీకటిలో వస్తువును వెదకుచున్నట్లుండునదే యత్నము. కావుననే స్వార్థమును పరిత్యజించినట్లు కన్పడుచున్నను ఆత్మకామనకు వశుడగుచున్నాడు. కావున శృంగార హాస్యము లన్యోన్యాశ్రితములని చెప్పవలెను.

పరచేష్టానుకరణమువలన హాస ముద్భవించుచున్నదని భరతుడే అనినాడు. ఇట్టిచో శృంగారానుకృతివలననే గాక అన్యరసములననుకరించుటవలనగూడ హాసము రావలెను. ఇతరులదోషములను గమనించి హేళనచేయుట, అనుకరించుట అను అర్థములే హాస్యమునకిచట చెప్పబడుచున్నవి. వివిధాభినయములు ఈ హేళన కుపకరించుచున్నవి. అభినయములద్వారా అనుకార్యమగువిషయమున వైప[illegible]ము కలదని వ్యక్తమగుచున్నది. వైపరీత్యము, అసందర్భప్రవృత్తి, అకార్యకరణము, [illegible]ము అనునవి హాస్యమునకు గల విభావములని చెప్పబడుచున్నది. దేశము, కాలము, ప్రకృతి, వయస్సు, అవస్థ అనువానికి అనుచితమగు వికారము లేక వైపరీత్య ముండవలెనని భరతుడనినాడు. ఇట్టి వైపరీత్యము కన్పించుటకు తగిన శక్తి ప్రతి రసమున గలదు. ఈ వైపరీత్యమును రానీయకుండా చూడవలెననిన ప్రతి రసములోను ఏమరియుండరాదు. అంతర్లీనముగాగల హాస్యమెచటనైనను అభివ్యక్తము కాగలదు. కావుననే సర్వ రసములు హాస్యమున నంతర్భూతము లగుచున్నవని అభినవగుప్తుడనగలిగినాడు. ప్రతిరసమున హాస్యము కలదని భావము.

ఇట్టి హాస్యము అనుకరణాత్మకము కాజాలదు. పిల్లలు ఇతరులను చక్కగా అనుకరించగలరు. కోకిల రవమును శ్రావ్యముగా అనుకరించగలరు. ఈ అనుకరణ హాస్యాస్పదమగుట లేదు. మాటిమాటికి కోకిల రవమును అనుకరించినచో మనకు విసుగు పుట్టగలదు. ఇట్లే, ఇతరులనుగూడ తడవ తడవకు అనుకరించిన, ఇదే స్వాభావికముగు నేమో అను భయముతో మాన్పించుచున్నాము. మొట్టమొదట మనోరంజకముగానున్న అనుకరణ పోనుపోను జుగుప్సావహమగుచున్నది. అనుకరణలో అకార్యకరణము, అనౌచిత్యము గలవని స్పష్టము. అనౌచిత్యముకంటె రసభంగహేతు వింకొకటి లేదని ఆనందవర్ధనాదు లనినారు. ఏవం విధమగు అనౌచిత్యము హాస్యరసమున గలదని చెప్పినచో హాస్యమును రసముగా పరిగణింప వీలులేదు. విభావాద్యౌచిత్యమే రసవత్తా ప్రయోజకమని లోచనకారు డనినాడు. ఔచిత్యమనగా రసవిషయకమగు ఔచిత్యమని, రసము లేనిచో ఔచిత్యప్రసక్తియే లేదని గూడ పలికినాడు. హాస్యమును రసముగా సంగీకరింపక తప్పకపోవుటచే వికృత పరవేషాలంకారాదులు, పరచేష్టానుకరణము మొదలగువాని వలన జన్మించి అనౌచిత్యము హాస్యమున నుండజాలదు. అనౌచిత్యానుకరణములవలన వికటమగు నవ్వు మాత్రమే రాగలదుగాని హాస్యరసము కాదు. ఇట్టి వికటత్వమును భానుమతి తన స్వప్నమును తెలుపు సందర్భమున వేణీసంహారములో గాననగును. కావున "అనౌచిత్య ప్రవృత్తి కృతమేవహి హాస్యవిభావత్వం" అని చెప్పుచు హాస్యమునకు రసత్వమును ప్రతిపాదించుట అసంగతము, అసమంజసము కూడ. ప్రతి రసముయొక్క ఆభాసలోను హాస్యముకలదని కూడ చెప్పుచు, సమస్తరసములు హాస్యమున నంతర్భూతము లగుచున్నవని అభినవగుప్తు డనుచున్నాడు. హాస్యమును రసము, వెటకారపు నవ్వు అను రెండర్థములు హాస్యశబ్దమునకు గలవని, ఈ అర్థములను వేరువేరుగా నుంచవలెనని స్పష్టమగుచున్నది.

సర్వరసములు హాస్యమున నంతర్భూతము లగుచున్నవనగా ప్రతిరసములోను తదుజ్జీవన కారణముగా, తదంతర్యామిగా అనువృత్తమగు ప్రత్యయమే హాస్యమని భావము. రసజగత్తులోని ప్రధానార్థ మీ హాస్యముననే కన్పించవలెను. సకలజాతి సులభము, అత్యంత పరిచితము, హృద్యతమము నగునది శృంగారమని పల్కుచు, హాస్యమును తదనుగామి యని అభినవగుప్తు డనినాడు. కాగా హాస్యము కూడ సకలజాతి సులభము, అత్యంత పరిచితము, హృద్యతమము నని చెప్పవలెను.

ఒక విషయమునుగూర్చి ఆశ పెట్టుకొని నిరీక్షించుచుండగా నిరాశ కలుగగా వచ్చునది నవ్వు అని "కాంట్" (*Kant*) పలికినాడు. కావున నిజమగు హాస్యము మనలను నవ్వింపజాలదు. విషయములను స్వస్వరూప స్వభావములతో వ్యక్తపరచు హాస్యము మన బుద్ధిని వ్యవసాయాత్మకము చేయుచున్నది. హాస్యమున జ్ఞానస్వరూపము అవగతమగుచున్నది. ఒక విషయమును సందర్భరహితముగా, ఇతర విషయములతో సంబంధము లేనట్లుగా, హాస్యానుభూతిలో గమనించుచున్నాము. ఈ విషయము వస్తుతంత్రముకాగా మన నిజస్వభావస్వరూపములు మనకే తెలియుచున్నవి. ఇట్లుత్పన్నమగు ఆత్మపరీక్షయే క్రమముగా ఆత్మోపహాసమగుచు వినయవిధేయతలను తీసికొని రాగలుగుచున్నది. కావుననే తత్త్వముకన్న హాస్యావహమైనది వేరొకటి లేదనినారు. వ్యావహారికజగమున వస్తువు లన్యోన్యసంబద్ధములై కన్పించుటచే, సంబంధరహితముగా వస్తువును గ్రహించుట హాస్యహేతువగుచున్నది. అసత్యముకన్న సత్యమే మనకపరిచితమైనదిగదా!

౨

"రాబెలే" (*Rabelais*) చిత్రించిన హాస్యమునంతము వ్యక్తిత్వము గలదు. జీవితమున గల జుగుప్సావిషయములన్నింటికి ఓర్చి ఎట్లు బ్రతుకవలెనో ఇక్కడ గలదు. జీవితముపై ద్వేషము నుంచుకొనరాదని మన కుపదేశమును చేయుచున్నాడు. దోషభూయిష్ఠమగు జగమును స్వీకరించి, అందు నిద్రించు శక్తులను మేల్కొల్పుచు, ప్రతిజీవియందు హాస్యశక్తియుండుటచేతనే ప్రాణము ధరింపబడుచున్నదని తెలుపుచున్నాడు. ప్రజలతో నసంగుడవై తిరిగి, నీమననిదిధ్యాసనలకు పొమ్మని చెప్పుచున్నాడు. అనగా నిజమైనహాస్యగాడు ఇతరులనుచూచి నవ్వలేదు, ఇతరులను హేళనచేయలేదు; జీవితము దుఃఖభూయిష్ఠమని అనుభవించువాడగుటచే మృచ్ఛకటికమందలి విదూషకునివలె సంచరించును. కాని ఇట్టి హాస్యగానికి జగన్నిష్ఠమగు నిజము కొంత అవగతమగుటచే పూర్తిగా విషాదమున నిమగ్నుడగుట లేదు. నిజమైనహాస్యపురుషుడు నిష్కామకర్మ సలుపుచున్నయోగివలె నుండును. జగమున నతడున్నను, అతనికి జగముతో సంబంధము లేదు.

"డికెన్స్" (*Dickens*) గ్రంథములలో హాస్యము మానవత్వనిష్ఠమై కన్పించుచున్నది. మానవజీవితమును స్మితవదనుడై పరిశీలించుటచే మన వ్యావహారికవృత్తు లతిముఖ్యములైనవి కావని చెప్పగలుగుచున్నాడు. జీవితమున మన మతిప్రధానములనియెంచు ప్రతిదానిని చీల్చిచెండాడి, సద్బుద్ధి గలవారే మనలను రక్షించగల రని చెప్పుచున్నాడు. సద్బుద్ధి సర్వదా విషాద సంవలితమై కన్పించును.

అధికారమును, వ్యవహార యోగ్యమగు జ్ఞానమును నిరాకరించి పసిపిల్లలను, యోగులను ముందుకు తెచ్చిన "డాస్టొవ్స్కి" (*Dostoievsky*) ఆత్మలో గల శుభాశుభ శక్తుల నావిష్కరింపగలిగినాడు. ఇతని పాత్రలు భగవంతుని అంగీకరించినను, భగవంతుని జగమునుమాత్ర మంగీకరించజాలవు. మానవునిలో దేవ దానవశక్తుల సంఘర్షణ కలదని, తద్ద్వారా మానవున కాత్మశాంతి ఈజగమున కలుగజాలదని భయావహ మగు హాస్యమును ప్రపంచించినాడు. జీవితము విషాద సముద్భవమని ఈ హాస్యమునగల ముఖ్యసూత్రము

"సెర్వాన్టిస్" (*Cervantes*) సృష్టించిననాయకుడు మతములను, ప్రభుత్వములను ప్రతిఘటింపగలిగినవాడు. ఈ నాయకు డవ్యక్తుడుగా కన్పడినను ఇతనికున్న తెలివితేట లింకొకరికి లేవని చెప్పక తప్పదు. శృంగార వీర కరుణరసములనుండి బయలు దేరిన దీతని హాస్యము. వ్యక్తిత్వము లేనిదే ప్రవృత్తి ఉండజాలదని చెప్పు ఈ నాయకునకు దీర్ఘ విద్యాభ్యాసముతోను, అల్ప నిద్రతోను మెదడు పోయిన దట! ఒక నాయికను తాను ప్రేమించియున్నను ఆ నాయికను అప్సరసగా భావించక మానవస్త్రీగానే పరిగణింపగలిగినాడు. తన ప్రేయసి అత్యంత సౌందర్యవతియని తాను మిక్కిలి దౌర్భాగ్యుడనని చెప్పికొనగలిగినాడు. తద్ద్వారా ఈ వీరునిలో గల వీరత్వము స్వతఃసిద్ధము కాదని, నాయకులను వారు జగమున లేరని, ప్రతిమానవుడు నాయకుడే అని అభివ్యక్త మగుచున్నది. ఆత్మావలోకనము, ఆత్మ పరీక్ష కలిగినవానికే ఈ ప్రతీతి రాగలదు. మానవత్వముగల మానవుడు మానవుల ప్రవృత్తులను నిరసింపక వాటిలో దివ్యాంశను గ్రహింపజాలియుండును.

మృచ్ఛకటికములోని రాజశ్యాలుడగు శకారునకు తను చేయుచున్నది తనకే తెలియదు. సుఖకాముడగు శకారుడు వసంతసేనను వెంటాడినాడు గాని వసంతసేనకు రదనికకుగల భేదమును గ్రహింపజాలక పోయినాడు. తను ప్రేమించానని చెప్పు వసంతసేనను చంపినానని భావించి, ఆ నేరము నితరులపై వేసినాడు. విషాదమయమైన ఇతని జీవితము హాస్యముచే నుజ్జీవితమగుచున్నది. భవిష్యత్తు గాని పరిసరములు గాని ఇతని బుద్ధిగ్రాహ్యములు కాలేకపోయినవి. లౌకికప్రవృత్తుల నవగాహన చేసికొనజాలక ఆత్మ కామములోనికి దిగి విషాదమయ జీవితమును గడుప వలసినవాడైనాడు.

మనగానే విదూషకులను గుర్తుకు తెచ్చుకొనుట పరిపాటియైనది. విదూషకులు వెటకారపు నవ్వును తీసికొనిరాగలరే కాని హాస్యమును పోషింపజాలరు. "భాసో హాసః" అను సూక్తిలో హాస్యస్వరూపము కొంచె మవగతము కాగలదు. జగత్తుయొక్క నిజస్వరూపమును గుర్తించి, అందభివ్యక్తమగు సుఖదుఃఖములను గమనించి, నిష్కామ భావనతో వ్యవహరించువాడు హాస్యపురుషుడు. కావుననే శాంతమునకు హాస స్థాయిభావమును కొందరర్పింపగలిగినారు. విషయము లన్యోన్య సంబంధరహితములని, అనృతములని, సత్యానృతముల సంఘర్షణ జీవితమున గలదని హాస్యముద్వారా మన కవగతమగుచున్నది.

స్వబుద్ధిని వినియోగించి జగమును పరిశీలించువారికి జగ మొక హాస్యరూపకముగను, సంవేదనాత్మకముగా విశ్వము నవగతము చేసికొనువారికి విశ్వము విషాదమయముగను భాసించునని యొక విమర్శకుడనినాడు. నిష్కామభావనతో హాస్యరూపకమందలి పాత్రలను, ద్రవీభూతమగు చిత్తముతో విషాద రూపకములోని పాత్రలను కవి చిత్రించునని భావము. "ఈ సన్నివేశ మింత హాస్యమయము గానిచో దుర్భర విషాదపూరితము కాగలదు" అని కొన్ని సన్నివేశములను వివరింపగలుగుచున్నాము. ఉత్తమహాస్యము కేవలము బుద్ధిగ్రాహ్యము. వివేచనాత్మకదృష్టితో లోకములోని దోషములను గుర్తింపజాలిన హాస్యము నిర్దయతో పరిశీలించునేగాని, ద్వేషబుద్ధితో విమర్శించదు. ద్వేషమనునది హాస్యమున ప్రవేశించగానే హాస్యత్వము నశించగలదు. కావున హాస్యము స్వార్థరహితమై, హృదయంగమమగు ప్రవర్తనతోనుండి, స్మితరూపమున కన్పడుచున్నదని "మెరెడిత్" (*Meredith*) చెప్పుచున్నాడు. మనోవికాసము, హృదయవికాసము, హర్షవిషాదములు సమన్వితములై హాస్యమున కన్పడుచున్నవని "హొరెస్ వాల్పోల్" (*Hcrace Walpole*) "మెరెడిత్" (*Meredith*) మొదలగువారి వాదము.

హాస్యమున సుఖమభివ్యక్తమగుచున్నదని పలువురనినారు. ఈ సుఖమునే ఆత్మస్థ పరస్థభేదమున, స్మితాది షడ్భేదములయందు గాననగును. వ్యక్తిభేదము ననుసరించి ఈ షడ్భేదములు వచ్చుచున్నవి. ఒకానొక సన్నివేశమున నే వ్యక్తి ఏతీరున ప్రవర్తించునో, అట్టి ప్రవృత్తి నాశ్రయించి చెప్పబడిన వీ ఆరువిధముల హాసములు. మానవస్వభావమును, ప్రవృత్తిని ఆధారముగా చేసికొని చెప్పబడిన ఈ హాస విచారణ జీవితమున కతిసన్నిహితము, పైన వివరించబడిన వాదముకంటె నతి విలక్షణము నైనది. కాని స్త్రీలవిషయమున, నీచపాత్రల విషయమున నీ హాస్యము బాగుగా కన్పడుచున్నదని భరతు డనినాడు. ఇతరున కాశాభంగము కాని, అపజయము కాని కలుగగా మన మనుభవించు ఆకస్మికమగు ఆధిక్యభావమే హాస్యకారణమని హాబ్స్ (*Hobbes*) అనినాడు. కాని మన మొక విషయమునుగూర్చి నవ్వినచో ఆ విషయము మనకు సుఖము నొసగుచున్నదా? ఒక విషయమును హేళన చేయుచో నావిషయము సుఖకరమా? మనలను నవ్వింపగల సన్నివేశములు సుఖకరములు గాని, సుఖవంతములు గాని కావు. కాని వాటిని మనము ద్వేషించుట లేదు. ఇచ్చటనే హాస్యమునకు రసత్వము సిద్ధించు నవకాశము కలదు.

హాస్యము నొక విజ్ఞానవాదము ననుసరించి వ్యాఖ్యానించిన "షోపెనావెర్ (*Schopenhauer*), "మెరెడిత్" (*Meredith*) ప్రభృతులు వైపరీత్యమును, భావసంఘర్షణను, హాస్యమున ప్రధానముగా గ్రహించినారు. విపరీతములు, అసంబద్ధములు నగు భావములకు గల తాత్కాలిక సమ్మేళనము ద్వారా మానసికమగు హాసము వచ్చుచున్నదని వీరి వాదము. ఇట్టి హాసమున సంచారి భావోద్దీపన ముండలేదు. సంచారిభావము లప్రస్తుతములైన హాస్యప్రతీతి రసప్రతీతి కాజాలదు. కాని చిత్తద్రవీకరణరూపము, హృదయసంవాదానుస్యూతమునగు సంచారి భావమిచట ఉద్దీపితమగుచున్నదని "మెరెడిత్" చెప్పుచున్నాడు.

ఒక విషయమునకు గాని, వ్యక్తికి గాని కలుగు అధఃపతనమును గమనించుటచే హాస్యప్రతీతి కల్గుచున్నదని "హాబ్స్", "బెయ్న్" (*Bain*), చెప్పుచున్నారు. ఆశాబుద్ధితో నిరీక్షించుచుండగా కలుగు ఆకస్మికమగు ఆశాభంగమే హాస్యమని "కాంట్" (*Kant*), "లిప్స్" (*Lipps*), "సల్లీ" (*Sully*) పలికినారు. అత్యంత వైలక్షణ్యముగల భావముల సమ్మేళనము, ఆత్మాధిక్యము హాస్యమున గలవని "బాష్" (*Basch*) వాదము. "హాబ్స్" వాదము నం.కరించుచు, హాస్యవిషయ మసంబద్ధము, అసమంజసము అని చెప్పుచు, ఆత్మాధిక్య ప్రతీతి ఇచట గలదని "గ్రూస్"(*Groos*) వచించినాడు. ఆశాబీజము మొలకెత్తినతర్వాత కలుగు నిరాశయే హాస్యమని "కాంట్" వాదమును బలపరచువాడు "కోన్" (*Cohn*) "హాబ్స్" "బెయ్న్", "గ్రూస్" ల వాదములను "ఫోల్కెల్ట్" (*Volkelt.*) దృఢపరచుచున్నాడు. ఇట్టి వైపరీత్యము హాస్యమున కన్పించుటచే, హాస్యమునకు రసత్వములేదని "లిప్స్" చెప్పియున్నాడు. వీటినిబట్టి కేవలము జ్ఞానాకారముగా హాస్యమును నిర్వచించు వాదములన్నియు చిక్కులలో పడుచున్నవని, ఈ చిక్కులనుండి తప్పించుకొనుటకై హాస్యమును రసము గాదనవలసివచ్చుచున్నదనియు స్పష్టము.

నరములయందు, కండరములయందు, గ్రంథులయందు అధికముగా ప్రసవించు శక్తియే హాస్యముగా అభివ్యక్తమగుచున్నదని "స్పెన్సర్" (*Spencer*) పలికినాడు. మానవజీవితమున నిట్లు స్వాభావికమగు హాస్యము దేహమున కుపకరించునది. బాగుగా నవ్వితే శరీరమునకు స్వస్థత ఏర్పడగలదు. కాని ఈ స్వాస్థ్యము మానసికముగూడ యని మనము విస్మరింపరాదు. మనఃప్రవృత్తియగు హాస్యప్రతీతిని భౌతికముగా, శారీరకముగా వ్యాఖ్యానించుట అనుచితము.

సాంఘిక జీవనమందలి ప్రయోజనములను నిర్వర్తించుటకు హాస్య ముపయోగించునదని "బెర్గ్సన్" (*Bergson*) వాదము. మానవత్వములేని ప్రవృత్తులను, అసహ్య సన్నివేశములను చూచి నవ్వుచున్నాము. ప్రతివ్యక్తిని తత్పరిసరముల కనుగుణముగా ప్రవర్తింపజేయుట కుపకరించునది హాస్యము. ఎవడైన మితిమీరి వర్తించుచున్న అతనిని దిద్దుట హాస్యరూపకమున గల ప్రయోజనము. సాంఘికాచారములు, వ్యవహారములు, అలవాట్లు మొదలగు వాటికి విపరీతముగా ప్రవర్తించువానినిగురించి నవ్వుచున్నాము. హాస్యముద్వారా మానవులను ఆయా సంఘముల కనుగుణముగా దిద్దగలుగుచున్నాము. హాస్యము నభివ్యక్తముచేయు పాత్రతో తాదాత్మ్యము నంది, భావనావశమున మనలను మనమే సరిజేసికొనగలుగుచున్నాము. మానవుడు తన పరిసరములలో సరిగా అతుకుకొనజాలకపోయి, ఒక వస్తువువలె సంచరించునపుడే ఇట్టి హాస్యము రాగలదని

భావము. ఇట్టి హాస్యప్రతీతిలో శరీరమునకు, మనస్సునకు విశ్రాంతి కలుగును. జీవితములోగల ఒదురుదుడుకులీ ప్రతీతిలో విస్మృతములు. కాగా, సంచారి భావములు అనుద్రిక్తములు కాగా, కేవలము భావరూపమున ఆస్వాద్యమగునది హాస్యము. చేతనుడగు వ్య. జడపదార్థమువలె భాసించుటయే హాస్యమును తెచ్చుచున్నది.

ఈ వాదమున వాస్తవముగా జీవించుచు, ప్రాణముగల వ్యక్తులకు హాస్యముతో సంబంధము లేదు. అస్తిత్వ రహితములగు వ్యక్తిత్వములనే గ్రహించు ఈ వాదమున వ్యక్తులకు తావులేదు. బాహ్యజగన్నిష్ఠ శక్తుల నెదుర్కొని ప్రవృత్తులగు వ్యక్తుల శక్తి సామర్థ్యములను ఇట్లు ఋణీకరించుట తగదు. హాస్యపురుషులు సచేతనులు. వీరిలో స్వాతంత్ర్యప్రవృత్తి గలదు. ఈ ప్రవృత్తి ఎట్లు వచ్చుచున్నది? దీనివలన కలుగు ప్రయోజన మేమి? అను ప్రశ్నలను హాస్యరస విచారము సమాధానపరచవలసియున్నది. సమగ్రముగా బుద్ధిగ్రాహ్యములు కాజాలని "ఫాల్ స్టాఫ్" (*Falstaff*) మొదలగు పాత్రల నీ వాదముతో తెలిసికొనలేము.

నవ్వు అనునది ఎరుగని సుఖవంతుడగు పురుషుని గమనించినచో హాస్యస్వరూపము కొంతవరకు అవగతము కాగలదు. ఇతనికి నవ్వవలసిన అవసరము లేదు. ఇతనికి కేవలము స్మితమే కలదు. స్మితము సంతృప్తిని, విశ్రాంతిని, వాత్సల్యమును, విశ్వాసమును, సుఖమును తెలుపునదగుటచే సర్వదా సుందరముగానే కన్పించును. కాని నవ్వులో కొంత అసహ్య స్వరూపము కలదు; దీనినే వికృష్ట స్వరాధికముగా భరతుడు వివరించినాడు. వికృష్టమగు నగవుతో హాస్యపురుషుడగు శకారుని ఎగతాళిచేయజాలము. శకారాదులను మనము ద్వేషింపలేమని మరచిపోరాదు

మనము నవ్వుచున్నాము. ఈ నవ్వు ఇతరులను సక్రమమార్గములోనికి దిద్దగలుగుచున్నదనుట విపరీత వాదము. వికృతమగునగవు ఇతరులను దిద్దుచున్నదని భావించుటకు మించిన అహంకారము వేరుగాలేదు. ఎన్ని దోషములు, ఆశాభంగములు కల్గినను శకారాది హాస్య పాత్రలు మనచే స్తుత్యులగుచున్నారని మరువరాదు. వస్తువుల నసహ్యముగా అమర్చినచో మనకు నగవు సామాన్యముగా రాదు. కాని మానవు లసహ్యముగా ప్రవర్తించినచో నొకప్పుడు నవ్వుచున్నాము. అనగా నగవు అనునది మానవులకు మాత్రమే సంబంధించినదని, నగవులో మానవత్వమునకు విశిష్టతనాపాదించు ధర్మమొకటి కలదని స్పష్టము. మన మెంత నవ్వగలిగినను శకారునితో మన స్థానపరివర్తనమునకు ఒప్పుకొనజాలము. హాస్యపాత్రయం దతి తీవ్రమైన దుఃఖవేదయుండుటచేతనే ఇట్టి సంభవించును. విషాదము, హృదయసంవాదమువలన అనుభూతమగు దుఃఖము అనునవి రూపాంతరితములై హాస్యముగా కన్పించుచున్నవి. "దుఃఖింపకుండా ఉండవలెననియే మానవుని జూచి నవ్వుచున్నాను" అని "బైరన్" (*Byron*) పలికినాడు. "మానవుడే అతి తీవ్రముగా బాధపడువాడగుటచే నగవును కనుగొనినాడు. అతి విషాదము, దైన్యముగల జీవియే సంతోషముతో కన్పడుచున్నాడు" అని "నీట్షే" (*Nietzsche*) అనినాడు. ఏవంవిధమగు హాస్యమున జీవితమునుండి తప్పించుకొనిపోవలెనను యత్నము కనబడును. కాని హాస్యము మన జీవితముతో సంబంధము ండా ఉండలేదు. అగాధము, భావగర్భితమునగు జీవితవివరణ ముండుటచేతనే హాస్యము ప్రియతమ మగుచున్నదని మరువరాదు. ఈ జీవితవివరణమువలననే హాస్యమునకు రసత్వము సిద్ధించుచున్నది. ఇట్టి వివరణమును సమగ్రవ్యక్తిత్వము గలవాడే చేయగలుగును. హాస్యపాత్ర దైన్యవిషాదముల ననుభవించి, ఆత్మపరీక్ష చేసికొనినవాడని చెప్పియున్నాము.

విషాదప్రతీతివలన నిర్వేదము, నిష్కామ భావన, వ్యక్తిత్వము రాగలవు. వీటిద్వారా మానవత్వముతో నలరారు స్వభావము, ఆత్మపరీక్ష, ఆత్మోపహాసము కలుగుచున్నవి. కావుననే తమను తా ముపహసించుకొను సందర్భములయందే హాస్యపాత్రలు హాస్యత్వముతో కన్పించుచున్నారు. ఇట్టి ఆత్మోపహాసము వలననే మనమే శకారులమని భావించలేకున్నాము. ఆత్మోపహాసమున రాగిత్వశూన్యమై, అనానిష్టాత్మకమై ప్రవర్తన గలదు. కాగా ఆత్మోత్కర్ష మాటుపడును.

"హాస్యప్రతీతియే లేనిచో నా సన్నివేశమును పరిశీలించజాలియుండకపోదును" అని అనేక పర్యాయములు మనము భావింపగలుగుచున్నాము. దుఃఖభూయిష్ఠమగు సన్నివేశమునుండి సంబంధరహితులమై బయటపడి, ఆ సన్నివేశము నొక నాటకముగా భావించుట కూడ మన అనుభూతిలో కలదు. సమగ్రమైన నిష్కామభావన యోగులకే సంప్రాప్తమగును. ముందేమి జరుగనున్నదో మనకు తెలియకపోవుట

చేతను, ముందు శుభమే కలుగగలదను ఆశ ఉండుట చేతను, వర్తమానస్థితిని సహింపగలిగియున్నాము. హాస్యపురుషుడు సామాన్య మానవునివలె వర్తమాన దశను మాత్రమే పరిశీలించుచు, యోగివలె నిష్కామ బుద్ధితో ప్రవర్తించుచున్నాడు. ఈ ప్రవర్తనలో అనుభూతమగు విషయము రూపకనిష్ఠముగా గాక, వాస్తవముగా భాసించును. భావింపబడు సన్నివేశము తాత్త్వికమైనదను జ్ఞానము కలుగగానే నగవు రాదు. అనగా తత్త్వము నవగాహన చేసికొని, ఉత్సాహముతో నుండుట దుర్లభము. సుఖదుఃఖ సమ్మిశ్రితముగా జీవితము కన్పించుచుండగా, తత్త్వము సుఖదుఃఖముల కతీతమై కన్పించుటచే విచిత్రమగు మనోవృత్తి కలుగుచున్నది. జీవితములో గల భ్రమలలో తగుల్కొని, తత్త్వమును తెలిసికొని, జీవితమును నిరసింపదలచుట మన చేతగాని పనియగుటచే భ్రమలను భ్రమలని పిలువలేకున్నాము. భ్రమలను వాస్తవములని గూడ ఎంచజాలకున్నాము. మన మర్యాదను మనము కాపాడుకొనవలెనని రూపకమువలె ప్రతీయమానమగు హాస్యము నవలంబించక తప్పదు. జీవితమనబడు నాటకములో నతిజాగరూకతతో, శ్రద్ధతో, మనము నటించుచున్నట్లు కన్పడక తప్పదు.

ఏదేని ఒక చేయగూడని పనిని చేయునపుడితరుల కంటబడినపుడు మన మానమును మనము కాపాడుకొన యత్నించుట గలదు. ఈ మానరక్షణము నుదాత్తమార్గమున నవలంబించగా ఆత్మప్రహ్వీభావము, నిష్కామబుద్ధి కలుగగలవు. కావుననే హాస్యపాత్ర హాస్యపు వాక్యముల నుచ్చరింపగలిగి యుండుటయే గాక, ఇతరులకు కలుగు హాస్యప్రతీతికి కారకుడగుచున్నాడు. శృంగారమున ననురాగమెంత సహజమో, హాస్యమున విరాగిత్వ మంత సహజమగుటచే హాస్యవాక్యోచ్చారణమున, ఆత్మప్రహ్వీభావమున వైపరీత్యము కన్పించదు. శుద్ధి, బుద్ధి, ముక్తి స్వభావము గలిగి నిష్కాముడగు బ్రహ్మనుగూర్చి "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని ఉపనిషత్తు పలుకుచున్నది. అద్వితీయమగు బ్రహ్మ నానాత్వమును వాంఛించెనట! ఈ వాంఛ యెట్లు రాగలదు? బాదరాయణుడనినట్లు "లోకవత్తు లీలా కైవల్యం," జగమొక హాస్యమయమగు లీల. హాస్యము తత్త్వాభివ్యంజకము. హాస్యప్రతీతియే తత్త్వావగతి.

వివేచనాత్మకదృష్టితో తత్త్వమును నిర్లిప్తమని, అసంగమని, నిర్వికారమని తెలిసికొనగలుగుచున్నాము. ప్రతి యనుభూతిలోను అధ్యక్షత్వాంతర్యామిత్వలక్షితమగు ఆధ్యాత్మిక తత్త్వమును అవగతము చేసికొనుచున్నాము. ఈ తత్త్వమునకు విలక్షణమగు విషయము లేదని, ఇది సమవాయాది సంబంధములు లేనిదని, చెప్పుచున్నాము. లౌకిక జగమున సత్యానృత మిథునీకరణముగలదు. దీనిని తెలిసికొనజాలిన నిష్కామభావనయే హాస్యమున కన్పించుటచే హాస్యప్రతీతిలో ఉత్సాహము, స్థైర్యము అనుభూతములగుచున్నవి. స్వాతంత్ర్యము వ్యక్తిత్వము, బాహ్యజగమునుగురించి ఉదాసీనబుద్ధిని జూపగల్గుట తద్ద్వారా సంక్రమించుచున్నవి. విషయముల వాస్తవస్థితిని, నిజస్వభావమును తెలుపు హాస్యమున ఉద్దిష్టార్థప్రాప్తికై అకార్యకరణము, అసంబద్ధాన్వేషణ, వైపరీత్యప్రవృత్తి, అసమంజసత్వము, వికృతాచరణము మొదలగునవన్నియు సాధనములుగా కన్పించగలవు. ఈ సాధనములను సాధ్యములుగా గ్రహించరాదు. ఈ సాధనములు లౌకిక జగమునకూడ కన్పించుచు తత్త్వాభివ్యంజకములగుచున్నవని మరువరాదు. కావుననే అరణ్యకుడగు కణ్వుడు!

"అర్థోహి కన్యా పరకీయ ఏవ"

అని హాస్యపాత్రవలె పలుకగలిగినాడు. దుష్యంతుడు:

"వయం తత్త్వాన్వేషా న్మధుకరహతా, స్త్వం ఖలుకృతీ" అని పలికినపుడు,

"న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః" అని పెదవి విరచినపుడు హాస్యము లేదనలేము. ఆరవ అంకములోని దుష్యంతప్రవృత్తిలో హాస్యమనుస్యూతముగా కలదు. అనగా హేళనను విదూషకాదులు, రసమగు హాస్యమును ప్రధానపాత్రలు అభివ్యక్తము చేయుచున్నారని స్పష్టము. పురూరవస దుష్యంతులు, ఉత్తరరామచరితలోని రాముడు, మృచ్ఛకటికలోని శకారచారుదత్తులు ఉదాత్తమగు హాస్యరసము నంతర్లీనముగా చేసికొనిన ఆయా రసములను పోషించుచున్నారు.

## 6

నియమమునకు, దృశ్యమగు వస్తువునకుగల వైలక్షణ్యము నాశ్రయించుకొని హాస్యము వచ్చుచున్నదని కొందరు విమర్శకులనినారు. "అధర్మ విషయమును ప్రదర్శించుటవలన హాస్యరూపకమున సుఖప్రతీతి కలుగుచున్నది. ధర్మమున కనుగుణమగు నియమమున లేక సూత్రమున సమన్వితమగునట్లు నటించుచు, వాస్తవముగా సమన్వితము కాజాలని విషయము

హాస్యమున సుంకుటచే దీని నధర్మవిషయమను చున్నాము. సాంఘికాది నియమములను, ప్రాక్తనానుభూతులను భావస్థిరములగు సంవేదనములను తీసికొని రాకుండా విషయములను గమనించువానికి హాస్యమే గోచరించదు" అని "పార్కర్" (*Parker*) చెప్పుచున్నాడు. ద్రవీభూతమగు చిత్తముతో, హృదయసంవాదవశమున ధర్మవిషయకమగు నియమమును గురించికూడ నవ్వగలుగుచున్నామనియు పలుకుచున్నాడు. అనగా ఉదాత్తమగు హాస్యమున ఆర్ద్రానుభూతిలేక హృదయసంవాద మవసరమని భావము. ఏవంవిధమగు చిత్తసంవాదము లేనిచో ఎగతాళియే కనపడగలదు.

ఉదాత్తమగు హాస్యమున భావనావ్యాపారము, ఉత్సాహము కలవు. అసభ్యముగాగాని, విపరీతముగాగాని ప్రవర్తించు పాత్రలు, ఈ పాత్రలతో నన్యోన్యసంబంధముగల తదితర పాత్రలచే దిద్దబడుట, సంస్కరింపబడుట గలదు. ఇచట సాంఘికాచార నియమముల ప్రసక్తి కన్పించదు. కావుననే ద్వేషము, క్రోధము, కామము, మాత్సర్యము, స్వార్థము, మోహము, ఆత్మోత్కర్ష అనువానికి హాస్యమున నను ప్రవేశము లేదు. వివిధసంవేదనములకు, భావములకు యోగ్యమగు సమన్వయమే కన్పించుచున్నది. పైగా హాస్యమున స్త్రీలకుకూడ ప్రసక్తిలేదు. అనురాగ సంవలితులగు స్త్రీలు, అనురాగరహితమగు చిత్తసంవాదమున కొర్వలేనివారగుటచే హాస్యజగమున పురుషులే కన్పించుచున్నారు. సహనబుద్ధి, మమకారరాహిత్యము, విశ్రాంతి, సర్వసామ్యము వీరిలో గలదు. భావములు దాచిపెట్టుకొనవలెననిగాని, స్వార్థమునే పోషించవలెననిగాని వీరి ప్రవృత్తులలో కన్పడదు. ఏదో ఒక విషయమును తీసికొని నేబట్టిన కుందేటికి మూడేకాళ్లని వీరు వాదించరు. ఇతరులతో సర్దుకొనిపోవుట, ఆర్ద్రాంతఃకరణ వీరి కుండుటచే ఉత్సాహముతో ప్రవర్తింపగలుగుచున్నారు. కావుననే ఉద్విగ్నమానసులు, అనుద్విగ్నమానసులు కలసి ఒకరిప్రక్క నొకరు హాస్యజగమున నివసింపగలుగుచున్నారు. శకార చారుదత్తులకు చివరకు మైత్రి కుదిరినపుడే ఇద్దరును సుఖింపగలిగినారు. హాస్యమున గల సౌహార్దము, శృంగారమునగల పవిత్రతతో సంవలితమగునపుడే హాస్యశృంగారములు రెండును సమగ్రములగుచున్నవి. వీటిని వేరుచేయలేము.

జ్ఞానాజ్ఞానములకు తాదాత్మ్యము గల జగమునుంచి వార్తలను తీసికొనివచ్చు హాస్యపాత్రలు పిల్లలవలెను వృద్ధులవలెను వ్యవహరించుట గలదు. వ్యుత్పత్త్యభ్యాసములవలన గాక స్వాభావికముగానే వీరు గీతమున, నృత్తమున కాలహరణము చేయగల్గుచున్నారు. స్నేహము, భోజనము వీరి కాదరణీయములు. భోజనమునుగూర్చి వీరు పలుకునంతగా వీరు భుజించువారని చెప్పలేము. వీరిలో కొందరు శ్లేషయందు, అన్యాపదేశమున ఆరితేరిన భాషాశాస్త్రజ్ఞులు. భాష వీరి అధీనములోనున్నను, ఒక్కొక్కప్పుడు వీరే భాషయొక్క అధీనములోనున్నట్లు కన్పింతురు.

హాస్యపాత్రలకు విశిష్ట నామములు కన్పించవు. అనగా నిరాడంబరుడగు సామాన్య మానవుడే హాస్యపాత్ర యని ఈ సంప్రదాయమున వ్యంజన గలదు. విశదమగు మనోముకురము, సమయస్ఫూర్తి, ఇతరులను సుఖింపజేయగలుగుట, తాము సదా సుఖముతో నుండుట, వీరిలో గానవగును. వాత్సల్యపూరిత హృదయములతోనున్న వీరియందు మనస్సు, హృదయము అభిన్నములుగా ప్రవృత్తము లగుచున్నవి. అందుచే విరాగానురాగములు, వాత్సల్యోపహాసములు, భావసంవేదనములు, వివేకోద్రేకములు, అనునవి హాస్యపాత్రలయందు అన్యోన్యసంవలితములై కన్పించుచున్నవి. కొందరు పాత్ర లుపహాసితులగునపుడు తత్కారకులనుగూడ నదే కాలమున రంగమున చూపుటచే మన కుపహాసికులపైన నే ఎక్కువ ఆదరాభిమానములు కలుగుచున్నవి. భావనాసమున్మిషితమగు ఆదరాభిమానవశమున హాస్యపాత్రలయందే మనకు అభేద ప్రతిపత్తి కలదు.

హాస్యసన్నివేశమున నే కొంచెము మార్పు కలిగినను ఈ సన్నివేశము ఎగతాళితో గాని, విషాదముతో గాని నిండినది కాగలదు. అభిజ్ఞాన శాకుంతలమున ఆరవ అంకములో విదూషకుని వాక్యములద్వారా తన్మయీభవనమునుండి పడిపోయిన దుష్యంతునకు విషాదస్థితి అతి తీవ్రమై వచ్చినదని మనకు విదితమే. ఇట్టి దుష్యంతుని చూచి మనము నవ్వజాలము. పైగా ఈ దుష్యంతునిలో మన కభిన్నమైన మానవత్వము ప్రతీతమగుచున్నది.

హృదయసంవాదము నాశ్రయించుకొని వచ్చు హాస్యము నాస్వాదించునపుడు నిధిధ్యాసనాత్మక వృత్తి మనకు కలుగుచున్నది. తద్ద్వారా హాస్య విషయముతో మన మభిన్నులమను ప్రతీతి వచ్చుచున్నది. వికృతము, విపరీతము, అనుచితము మొదలగు లక్షణ

ములతో హాస్యవిషయము భాసించు ననగా, ఇది లౌకికజగవిలక్షణమని భావము. అనుచితత్వాదులు రూపాంతరమగు రసమున పర్యవసితములై అనుచితత్వాది ధర్మములను పోగొట్టుకొనుచున్నవి. ఇట్లు అసాధువుగా భాసించు హాస్యము రసజగమున సాధువుగా, హృద్యముగా పరిణమించుచున్నది. నిష్కామభావనతో వచ్చు ఈ పరిణామమున ఆర్ద్రహృదయము, నిశితభావన, తత్త్వావగతి కలవు.

పరిణామ రహితముగా భాసించు జగద్వ్యాసమును విశ్లేషించి, విమర్శించి, పరిణామరహితమైన దీ జగము కాదని, ఈజగము తాత్త్వికమైనది గాదని చెప్పజాలినహాస్యమున అకార్యకరణాది వైపరీత్యము కలదనుచున్నాము. కావున తత్త్వమే హాస్యమను "ఫుల్లర్" (Fuller) వాదము స్వీకార్యమగుచున్నది. హాస్యప్రతీతిలో సంచారిభావోద్దీపనము కన్పించకపోవుటచే నిష్కామభావనతో పురుషార్థములను గమనించగలుగుచున్నాము. కాని హాస్యవిషయములకు పురుషార్థములకు సంబంధము పూర్తిగా అభివ్యక్తమగుట లేకపోవుటచే లౌకికవ్యవహారమున హాస్యవిషయమును మన భావనావిషయముతో సమన్వయింప యత్నించుచున్నాము. ఈ రెంటికి సమన్వయమును బుద్ధిద్వారా కుదర్చలేకపోవుటచే హాస్యవిషయమును వికృతమని, విపరీతమని, అనుచితమని యనుచున్నాము. ఆత్మపరిశీలన, ఆత్మపరీక్ష అభివృద్ధియగుకొలది ఈ వైపరీత్యమును వైపరీత్యముగా గ్రహింపలేకున్నాము. హాస్యమున మన కపరిచితములగు ఉత్తమపురుషార్థములే కన్పడుచున్నవని భావము.

ఏవంవిధమగు హాస్య ముత్సాహసంవలితము. హాస్యవిషయమునుగూర్చి నవ్వక, ఆ విషయముతో నభిన్నమై నవ్వగలుగుచున్నామని విస్మరింపరాదు. దార్శనికదృక్పథ మీ హాస్యమున కన్పించుటచే హాస్య ముదాత్తము, మనోరంజకము, ఆత్మాభిప్రేతము నగుచున్నది. తత్త్వావగతిగల హాస్యమున విషాదము సంవలితమై యున్నది కావుననే అధ్యవసాయాత్మకమగుబుద్ధి, ఇంద్రియనిగ్రహము, ఆత్మాభివ్యక్తి, తత్త్వావగతి మొదలుగాగల వన్నియు హాస్యముకన్న విలక్షణములు కావని చెప్పవలెను. దేశకాలప్రకృతి వయోఽవస్థాదుల కతీతమైన హాస్యము భావనాసమున్మిషితమై తత్త్వము ననుభూతము చేయుచున్నది.

"ప్రాఞ్చో అగామ నృతయే హసాయ
ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః"

"నృత్యహాస్యములకై తూర్పునకేగి జీవితకాలమును పెంచెదముగాక" అని వైదికఋషు లనినారు.

నాటిక

# * ముకమాల *

## శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

—: విద్యానగరం—ఉద్యానవనం—సంధ్యాసమయం :—

ప్రకృతిసుందరి పాణిపల్లవాలతో పద్మరాగాలను నీరాజనమిస్తున్నట్టుగా సాంధ్యరాగాలు చివురాకు చివరల చిందులాడుతున్నాయి...

చిన్నాదేవి శశికాంత శిలావితర్దిపయి విలాససుఖాసీనయై మాలికారచన సాగిస్తున్నది.

సమీప సరోవర సంచలత్ తరంగమధుర సంగీత భంగీరవాలకు నికట తట వేణునికుంజవినిర్గతాలవుతూ శ్రుతులు గలిపే మధుమత్త గంధవహాలు ఆ సుకుమారి అలినీలాలకములకు అతిహేలాగతులు నవరిస్తున్నాయి...ఆమె అరవింద నయనాలలో అనుక్షణం ఉత్కంఠ తొంగిచూస్తూ పొంగిపోతూవుంది.

ప్రతిక్షణ పరిభ్రమణ సంభ్రమావిష్టభ్రమరగీతి, ప్రావేశకీ ధ్రువగా శ్రీకృష్ణ దేవరాయల ఆగమనం—అతని గంభీర వదనంలో అలంతి హాసం—

శ్రీకృష్ణ: చిన్నా!

చిన్నా: (ఉలిక్కిపడి చూచింది. అనూతం సిగ్గువెల్లువ ఆమెను ముంచెత్తింది. తల వంచుకుని అర కంట చూస్తూ ఆత్మానందంపొందుతూ పువ్వులు గుచ్చడాన్ని మాని పట్టె దారాన్నే గుచ్చసాగింది.)

కృష్ణ: (ఒక్కడుగు ముందుకు వేసి) చిన్నా!

చిన్నా: (లజ్జాసుకుమారంగా) ప్రభూ!

కృష్ణ: మాలికారచన మాని శూన్యాన్ని సూదితో గుచ్చుతున్నావ్!

చిన్నా: (చూచుకొని మరీ సిగ్గుపడ్డది)

కృష్ణ: సిగ్గుపడకు...(సమీపిస్తూ) చిన్నా!

చిన్నా: (తొలగి) ఈ మల్లెపూవులు ఎలా మురిసిపోతున్నయో! (అంటూ ముడి వేస్తూ ముందుకు వస్తుంది)

కృష్ణ: ప్రణయామృతం కురిసి మరీ!

చిన్నా: (హారాన్ని వేస్తున్న భంగిమంలో) ఏలినవారికి, అందుకే ఏరినపూవులతో ఈ విరిదండ —(వేయబోతుండగా)

కృష్ణ: ప్రేమహారంగా వేస్తున్నావ్ రాయల వారికి!

చిన్నా: (హారం వేసి) సాహితీసమరాంగణ సార్వభౌములకు!

కృష్ణ: చిన్నా! నీ సుకుమార సుందరకర కమల సమలంకృతమయిన ఈ సుమనోమంజరివల్ల నా వక్షస్థలం రత్నస్ఫటికంలా మారి అనంతకోటి ప్రభల్ని ప్రతిబింబింపజేస్తోంది!

చిన్నా: (నిండుగా నవ్వి) అది నా అదృష్టం.

కృష్ణ: కాదు. అదృష్టం అనేది వట్టి అపభ్రమ!

చిన్నా: ఆఁ! (ముఖం విన్నదనం వహించింది)

కృష్ణ: అదేం చిన్నా [illegible] తుగా నీ అరవిందవదనంలో మంచు తెర మసలినట్లయింది. నీ చకోర

నయనాలలో కాలజీమూతాలు కరాళనృత్యం సాగిస్తున్నట్టు తోస్తోంది!

చిన్నా: ప్రభూ!...అవేవో మెరుపుతీవలే నా కళ్లల్లో కదుల్తున్నయ్. కాని

కృష్ణ: కాని?

చిన్నా: కాంతిరేఖల నడుమ కాలతిమిరాంధకారం!

కృష్ణ: కారణం?

చిన్నా: ఏమో భయంగా—ఎందుకో హృదయాంతరాళంలో ఆందోళనగా వుంది ప్రభూ!

కృష్ణ: (భుజంతట్టి బుజ్జగింపుగా) అందుకే అబలలన్నారు ఆడువారిని!

చిన్నా: (పరిదేవనగా) పేదరాలిని ప్రభూ!

కృష్ణ: (వారణగా) చిన్నా!

చిన్నా: (పాదాలమీదికి వాలుతూ) హీన కుటుంబంలో జన్మించిన దాన్ని కూడా!

కృష్ణ: చిన్నా! (అంటూ లేవనెత్తాడు. క్షణం మౌనం. దిగవలోకనం) అలా చూడు చిన్నా!...ఆ ప్రకృతి సౌందర్యంలో అమృతం మనకి ఆస్వాద్యమానం. అదిగో! ఆ తుంగభద్ర తుంగ తరంగాలు కుప్పించుతు లిడుతున్న కురంగాలు! మనోరథాన్ని లాగే మరుత్తురంగాలు!

చిన్నా: (క్రమంగా వికాసాన్ని పొంది ఆశా దృక్కులు ప్రసరిస్తూ) నిజంగా?

కృష్ణ: ఇటు మల్లీమాలతుల వల్లీ నికుంజాలు పంపుతున్న ప్రణయసందేశాన్ని, దూతగా కమ్మని పటీరం...

చిన్నా: తెస్తూ ఈ కుటీరం చూచి కుంచించుకుపోతున్నది.

కృష్ణ: అబ్బే. అభేదాన్ని, చిన్నా! ప్రయోగ పూర్వకంగా చాటుతోంది. అందుకే, వింధ్యాచల శృంగాలు విరజిమ్ముతున్న సంధ్యారుణరంగాలకు రంగవల్లికలుతీర్చి, పల్లకీలుపట్టి, ప్రేమ వల్లకీ తంత్రులు మీటి ఈ చిన్నాదేవికి వసంతోత్సవశ్రీ వెలయిస్తోంది!

చిన్నా: (ఆశ్చర్య సంభ్రమాలతో) దేవి!

కృష్ణ: అవును. స్థిరవిద్యుల్లతా కాంతిరేఖల్లో, అచలన్నలినీదళ రత్నకంకణ నీరాజనంతో, మన ప్రేమ పవిత్రమై, పరాకాష్ఠచెంది, పురావైభవ స్ఫురణైక చిరానందంతో నిన్ను ప్ర గా చేస్తుంది.

చిన్నా: ఏమంటున్నారు ప్రభూ!

కృష్ణ: అతిత్వరలో అనుభవపూర్వక మహా వైభవ ప్రాభవ మహతీప్రతులు సవరిస్తాం, నిర్మల నిక్వణ నిస్వనాలు వివరిస్తాం, అని!

చిన్నా: అంతటి సౌభాగ్యం నాకే!

కృష్ణ: నీకా?

చిన్నా: నాకు కాదూ?

కృష్ణ: కాదు. నా హృదయారాధ్య దేవతకు!

చిన్నా: ఎవరో ఆ అదృష్టవతి?

కృష్ణ: ఎంత ముగ్ధవ్! నా హృదయారాధ్య దేవత ఒక పేదరాలు! హీనకులజ!

చిన్నా: ఆఁ! (పరమానంద పారవశ్యం)

కృష్ణ: చిన్నా! (చేయి పట్టుకుంటాడు)

చిన్నా: ప్రభూ! (ఓరకంట చూస్తూ ఒయ్యారం ఒలికిస్తుంది)

కృష్ణ: (భుజాస్ఫాలన ప్రయత్నం)

[హఠాత్తుగా ఉరుముల ఉగ్రధ్వనులు]

(ఉభయులూ తెల్లబోతారు. చిన్నాదేవి భయ కంపిత గాత్రియై దూరంగా జరుగుతుంది. ఆకాశం వంక భయంగా చూస్తుంది)

కృష్ణ: (సమీపిస్తూ) కవయిత్రిలా ఏమిటా ప్రకృతి పరిశీలన?

చిన్నా: ఎవరి అదృశ్యహస్తం ఆ మాయదారి మబ్బు పింజల్ని విరజిమ్మిందోగానీ చూస్తుండగానే అవి నల్లిశిలా చుట్టు ముట్టాయి!

కృష్ణ: అయితే—(ఆలోచనగా ఆగి మెడలో హారాన్ని తీసి మీఁజేయిమీద వేసికొని) చిన్నా!

చిన్నా: ప్రభూ! (ఒకడుగు ముందుకు వేస్తుంది)

[బయటదూరంలో సింహగర్జనలా ఒక పురుష కంఠం. అమ్మాయ్!]

చిన్నా: (భయంగా) మా నాన్న!

కృష్ణ: (నిర్భయంగా) రానీయ్. భయపడతావేం? (హారాన్ని ఆమె మెడలో వేస్తాడు)

చిన్నా: (చిరునవ్వు చిందిస్తూ క్రీగంట చూస్తుంది)

కృష్ణ: (దరహాసంతో దగ్గిరగా రాబోతాడు)

[మళ్ళా బయట సమీపంలో అమ్మాయ్!]

చిన్నా: (భయపడిపోయి) అమ్మో! – మీరు –

కృష్ణ: మరేం భయంలేదు. ఈ చెంత మల్లె పొదలమాటున—(అంటూ అడుగు కదలిస్తాడు)

చిన్నా: (అటు భయం. ఇటు ఆనందం) అపర

కృష్ణ: (ఆగి చిన్నాదేవిని చూచి నవ్వుతాడు)

చిన్నా: (మళ్లీ నవ్వుతుంది)

కృష్ణ: (వామభాగంలోకి నిష్క్రమిస్తాడు)

చిన్నా: (దక్షిణభాగం చివరంటా వెళ్లి, మళ్లీ వామభాగంవయిపు కొంతదూరం సాగి, మధ్యగా ఆగి. అటూ ఇటూ ఆశగా ఆందోళనగా చూస్తుంటుంది)

["అమ్మాయ్!" అంటూ స్వామి వస్తాడు. ఆపిలుపుకి "నాన్నా!" అంటూ చిన్నాదేవి కుడివైపు తిరిగి భయాన్ని కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నిస్తుంది.]

స్వామి: (వామభాగంలోకి తర్జని ప్రసారిస్తూ) అటు చూసేవమ్మాయ్!

చిన్నా: (భయంగా చూచి) ఏముం దక్కడ నాన్నా?

స్వామి: ప్రకృతి!

చిన్నా: (ధైర్యం కలిగి) అవును.

స్వామి: అవును కాదు. అమ్మాయ్! ప్రకృతి ఏడుస్తోంది!

చిన్నా: ఎందుకూ?

స్వామి: మనవంటి దరిద్ర హీన దీన కులస్థుల ఆశాఆకాశసౌధాలు చూచి!

చిన్నా: (వారణగా) నాన్నా!

స్వామి: ఆకాశానికీ భూమికీ, అమ్మాయ్!, సంకెళ్లు వేస్తున్నావ్!

చిన్నా: (అయోమయంగా) ఏమిటి నాన్నా!

స్వామి: (ఉద్వేగంతో) పర్వతాలకు పసిడి పళ్లాలు కడుతున్నావ్.

చిన్నా: (భయంగా) నాన్నా!

స్వామి: (ఉద్రేకంగా) అంతే కాదమ్మాయ్! మలినభూయిష్ఠమైన మణిని పుటం పెట్టక మానరు!

చిన్నా: (భయవిషాదాలతో) ఇదంతా ఏమిటి నాన్నా

స్వామి: (ఖండితంగా) జరుగుతున్న చరిత్ర!

చిన్నా: (అమాయికంగా) ఏమయింది?

స్వామి: (తీవ్రంగా) జరుగుతున్న చరిత్ర గ్రంథంలో ఎగురుతున్న పుటలపై ఎర్రని శిల్పాక్షరాలు వ్రాయడానికి ఎవరో కుతారమనే కుంచెను రక్తమనే రంగులోముంచి ఎదురుచూస్తున్నారు!

చిన్నా: మీ బాధ ఏమిటో నాకు బోధపడటం లేదు.

స్వామి: (తీవ్రంగానే) అమ్మాయ్! మనమెవరు?

చిన్నా: మనుష్యులం!

స్వామి: (వికటంగా నవ్వుతూ) అహ్హాహ్హా మనుష్యులం!—పిచ్చిపిల్లా! మనుష్యుల దృష్టిలో మనుష్యులమయిన మనం మనుష్యులం కాము. (తీవ్రంగా) అమ్మాయ్! మీ అమ్మెవరో తెలుసా?

చిన్నా: (మెల్లగా) దేవదాసి అని విన్నాను.

స్వామి: వినడం కాదు నిజమే!

చిన్నా: (అమాయికంగా) మరి—

స్వామి: అదా నీ అనుమానం? మా యిద్దరి విలోమ వివాహాన్ని నాటి సమాజం సమాధిచేసింది.

చిన్నా: కారణం?

స్వామి: పిచ్చిపిల్లా! ఆచార వ్యవహారాల అధిక బలీయమైన అధికారం!

చిన్నా: నాన్నా! ఇవాళ ఈ మాల అంతఃపురంలో ఇవ్వరా?

స్వామి: (హేళనగా) అంతఃపురంలో! విజయనగర సార్వభౌములవారి వినిర్మలాంతఃపురంలో! - హుం, గ్రుడ్డినమ్మకం వున్నంతికాలం మన అమ్మకం సాగుతుంది.

చిన్నా: గుడ్డి నమ్మకమా?

స్వామి: కాదా? వేయికళ్లతో ప్రజల్ని పాలించడానికి పట్టాభిషిక్తుడైన ప్రభువు కృష్ణదేవరాయలు; రాజాంతఃపుర పుష్పమాలావిక్రేత ఇచ్చే వాడిన పూలదండను మన్నించడం మనమీది గుడ్డి నమ్మకంవల్ల కాదా?

చిన్నా: (ఆలోచనగా) వాడిన పూలదండ!

స్వామి: అమ్మాయ్! ప్రభువులతో పరిహాసం కాలసర్పంతో చెలగాటం! ఇక ప్రణయమా? పులి గోళ్ళతో కురులు దువ్వుకోవడమే అవుతుంది.

చిన్నా: అలాగవ్వదు నాన్నా! (తన్మయముద్రలో) నేనంటే ప్రభువువారి కెంతో మనస్సు!

స్వామి: అవన్నీ అధరాలపైని అమృతధారలే! అమ్మాయ్! నేను కర్కశసమాజంతో కత్తి కలిపిన వాణ్ణి. కదనరంగంలో నాకు తాత్కాలిక విజయమే లభించింది. నీ తల్లి బలిఅయింది. నాకు వెలి అయింది!

అయినా జీవచ్ఛవంలా వున్నానంటే కారణం, నా, ఆ విజయం నీకు గృహిణీత్వం సిద్ధించగానే చరితార్థమవుతుందని! అదే నా ఆశ. నువ్వు గృహిణివి అవ్వాలి! అందుకే ఈ శేషజీవితంలో నా కంఠశోష. నా మాట విని ప్రభువుమీది ప్రణయదృష్టి మరల్చుకో!

[ఉరుముల ఉగ్రధ్వనులు]

చిన్నా : (వెర్రి కేకగా) నాన్నా!

స్వామి : ఆలస్యమయింది. అంతఃపురానికి వెళ్ళాలి. ఏదా మాలిక?

చిన్నా : (యాంత్రికంగా హారం తీసి అందిస్తుంది)

స్వామి : (వెళుతూ) నా మాట విని ప్రభువు మీది ప్రణయదృష్టి మరల్చుకో! (వెళ్ళిపోతాడు)

చిన్నా : (తెల్లబోయి చూస్తుంటుంది.)

[ఉరుముల ఉగ్రధ్వనులు]

(తెరలో స్వామికంఠం :—"నా మాట విని ప్రభువుమీది ప్రణయదృష్టి మరల్చుకో" అని)

చిన్నా : (భరించలేక) అమ్మా! (అని బావురుమంటుంది)

(గంభీరగమనంతో శ్రీకృష్ణదేవరాయల ఆగమనం)

చిన్నా!

చిన్నా : (చూచి, ఆశగా మోమెత్తి-నిస్పృహపాటమి, చివాల్న మోము వాల్చుకొంటుంది)

కృష్ణ : చిన్నా! (ఆందోళనగా సమీపిస్తాడు)

చిన్నా : (దీనంగా నీరసంగా) ప్రభూ! (కళ్లవెంబడి నీళ్లు స్రవిస్తాయి)

కృష్ణ : (చిన్నాదేవి చిబుకం పట్టి మోమునెత్తి ఆమె కపోలాలపై జారే కన్నీటికణాలు చూచి ఉద్విగ్నుడై చిన్నా! (చిబుకం వదిలేస్తాడు)

చిన్నా : (క్రమంగా ఆశగా చూచి) ప్రభూ!

కృష్ణ : (గంభీరంగా) ఎంత దురవస్థ!

చిన్నా : (బేలగా) దురవస్థా?

కృష్ణ : కాదులే! (ప్రక్క మొహం పెడతాడు)

చిన్నా : (వికలంగా) ఏమిటది ప్రభూ? (సమీపించబోతుంది)

కృష్ణ : (దూరంగా సాగి) ఏమీ లేదు.

చిన్నా : (సమీపిస్తూ) చెప్పరూ నాకు?— దాపరికమా? (అతని భుజంమీద వాలిపోతుంది)

కృష్ణ : (తప్పిస్తూ) దాపరికమెందుకు? (అంటూ తిరిగి చిన్నాదేవిభుజాలు పట్టుకొని కళ్ళల్లోకి చూస్తూ) ఇవాళ మనం, చిన్నా! చేయకూడని రెండు అపచారాలు చేశాం.

చిన్నా : అపచారాలా?

కృష్ణ : అవును. ప్రభువునైన నేను ప్రణయభీరువునై మల్లెపొదలమాటున...శ్రీకృష్ణదేవరాయల పట్టమహిషివీ, కూర్పుదేవేరివీ, కానున్న నీవు కొటుకశేకలు కరిగిపోయేలా కన్నీరు నించడం అపచారాలు కావా?

చిన్నా : (బేలగా) ప్రభూ!

కృష్ణ : విన్నాను చిన్నా! మీ నాన్నగారి మీమాంస! సమయోచితం కాదనిగాని...సరే... చిన్నా! ఇవాళే మన వివాహానికి —

చిన్నా : (ఆనందాశ్చర్యాలతో) ఆఁ! ఏమిటీ!

కృష్ణ : (చిరునవ్వుతో) ఏర్పాట్లు! (చిన్నాదేవి చిబుకంమీద చిటిక వేసి) మరింక సెలవా?

చిన్నా : (బాధతో—ఆశగా) వెళతారా?

[ఉరుముల ఉగ్రధ్వనులు – తిమ్మరుసు ప్రవేశం]

కృష్ణ : (చూడక) చిన్నా!

చిన్నా : (తన ధోరణిలో) ప్రభూ!

(పరస్పరం సన్నిధికి వస్తుంటారు)

తిమ్మ : (దగ్గుతాడు)

కృష్ణ :
చిన్నా : } (వినరు)

తిమ్మ : (గట్టిగా మళ్ళీ దగ్గుతాడు)

కృష్ణ :
చిన్నా : } (విని - చూచి - తొట్రుపాటు)

కృష్ణ : (తిమ్మరసుని చూచి) అమాత్యశ్రీ!

తిమ్మ : ప్రభూ!

కృష్ణ : అభివందనాలు!

తిమ్మ : శుభావాప్తిరస్తు.

(వెనకవాటుగా చిన్నాదేవి వెళ్లిపోతుంది)

[అధికంగా ఉరుముల ఉగ్రధ్వనులు]

తిమ్మ : పరికిస్తున్నారా ప్రభూ! ప్రపంచాన్ని కబళించనున్న ప్రళయాన్ని క్షణం ప్రణయాన్ని మరచి?—నిన్న మొన్నటివరకూ అనావృష్టి! ఇక అతివృష్టి అని దైవజ్ఞుల హెచ్చరిక! అందుకు సాక్షీభూతంగా అప్పుడే కారుమబ్బులు కాండ్రు కాండ్రుమంటున్నాయి. పాపం, ప్రజలు—

కృష్ణ: అమాత్యశ్రీ! అనుమానించడ మెందుకు? అనుక్షణమే, మన అభయహస్తాన్ని ప్రజలకు ప్రకటించండి. ఎంతటి ప్రళయం సంభవించినా ప్రజల ఆవాస ఆహార సౌఖ్యాలనిమిత్తం ఏర్పాట్లు ఆలోచించండి. అవసరమయితే సుంకాలు తగ్గించడానికి సుముఖులమే అవుదాం.

తిమ్మ: అబ్బ! ఏమి పరిపాలనాదక్షత! మాటాడితే పన్నులు తగ్గించివేద్దాం, ప్రజలకు వసతులు కల్పించేద్దాం అనేగాని ఇతరాలోచన ఏమీ అక్కర్లేదు!

కృష్ణ: అప్పాజీ!

తిమ్మ: అబ్బాయ్!

కృష్ణ: అలా ఆకాశంవంక చూడండి (చూస్తూ)

తిమ్మ: ఏం? (చూచి) అరాచకంగా మన ల్నాను ప్రభుత్వంలా వుంది.

కృష్ణ: కాదప్పాజీ! అదొక దివ్యసందేశాన్ని అందిస్తోంది నాకు.

తిమ్మ: సందేశమా?

కృష్ణ: సందేహ మేమీ లేదు. దివ్యసందేశమే! అటు చూడండి. నిర్మలావ్యక్తమధురభావ గంభీరమయిన సముద్రజలకణాల్ని మేఘమాలా రూపంలో విశాలవిశ్వానికి దివ్యాభరణంలా దిద్దితీర్చి, సూర్యరశ్మి, పునః, కృతజ్ఞతాపూర్వకంగా అవినాభావం గల ఆ సముద్రానికే భంగ్యంతరంలో సమర్పిస్తోంది! సత్కరిస్తోంది!

తిమ్మ: అది ప్రకృతిధర్మమే నాయనా!

కృష్ణ: ప్రకృతిపరంగా దివ్యత్వాన్ని ఆపాదిస్తాం.

తిమ్మ: ఆపాదించవచ్చు.

కృష్ణ: ప్రకృతికి మానవస్వభావం ప్రతిబింబం. సూర్యరశ్మికీ విశాలవిశ్వానికీ వున్న సంబంధం మానవులమధ్య సంభవమయితే—

తిమ్మ: (తేలికగా) అయితే?

కృష్ణ: కావ్యత్వాన్ని ఆపాదించాలని!

తిమ్మ: కాంక్షిస్తున్నావ్! ... అర్థమయింది నీ అన్యాపదేశం. అది అసంభవం.

కృష్ణ: (తొట్రుపడి) అసంభవమా?

తిమ్మ: విజయనగర సామ్రాజ్యాధీశ్వరులకు ఒక సామాన్యపుష్పమాలావిక్రేతపుత్రికతో పొత్తుపొసగదు.

కృష్ణ: అప్పా—

తిమ్మ: (అధికారస్వరంతో) ప్రభూ!

కృష్ణ: అంటే అమాత్యశ్రీగాకూడా అదేనా మీ అనుశాసనం?

తిమ్మ: హీనదీనకులసంపర్క సాంగత్యాలు ప్రభుమర్యాదకు భంగకరం!

కృష్ణ: మంత్రిపుంగవులు తిమ్మరుసయ్యకి పుత్రతుల్యుడైన ఈ కృష్ణదేవరాయల మనవి. మా హృదయవసంతారామవిలసితములై వికసితములైన ప్రణయ లతలు—

తిమ్మ: (నిరసనగా) ప్రణయం! (నవ్వి) వెర్రివాడా! ఆ ప్రణయతంత్రాలూ ప్రణవమంత్రాలూ సోమరిపోతులకూ సోమయాజులగార్లకూను!

కృష్ణ: పొరబడుతున్నారు అప్పాజీ!

తిమ్మ: నేను పొరబడవచ్చు. కాని చిరంజీవి శ్రీ కృష్ణదేవరాయలకు చిన్న హెచ్చరిక! శక్తిమంతములైన శాస్త్రవాక్యాలకూ, దీప్తిమంతములైన రాజమర్యాదలకూ నిబంధనపాటవం అనే ఉక్కుతొడుగు ఏనాట్నుంచో ఉండటంవల్ల పొరబాటు అనే చెదపురుగు వాటి నేమీ చెయ్యలేదు.

కృష్ణ: ఒక సంగతి. మీరన్నట్టు చిన్నాదేవి, శరీరానికి కులభ్రష్టతా! దరిద్రతా!...ఆమె మనస్సుకవి లేవు. కాక, కర్మచండాలత గర్హణీయం కాని జాతిచండాలత గర్హణీయమని శాస్త్రాదేశం కానే కాదు.

తిమ్మ: ప్రతి ప్రియుడికి మానసవిహాయస భ్రాంతివిహారమూ, అప్రముఖశాస్త్రవిషయబలవదనుసంధానమూ నాందీ ప్రస్తావనలే!

కృష్ణ: మా ప్రేమ హృదయాల కోరికల విలువ నాణెపుముద్రల్లో నాట్యమాడేది కాదు. మూగచూపులతో ముగ్ధమోహనమై, స్నిగ్ధసుందరమై, హృదయకావ్యానికి భాష్యం చెప్పగల ఏకైక వస్తువు! ఆ పుష్ప హృదయాలకే తెలుసు మా ప్రేమవిలువ! అందుచేతనే చిన్నాదేవికి పుష్పమాలతో నన్నలంకరించడమే ప్రేమపూజ! — మా ప్రేమపూజలు, అమాత్యశ్రీ! కఠినశిలానిలయాల్లో కాదు. అప్పాజీ! మృదుమధుర మానసాలయాల్లో!

తిమ్మ: ప్రౌఢంగానే ప్రారంభమయిందీ ప్రథమాంకం!

కృష్ణ: కనుకనే, పూజార్థం వినియోగించినప్పటికీ ఆ మాలా ఈ మాలా చేర్చి చిన్నాదేవి అంతఃపురానికి పంపిస్తోంది! అది నేను గమనించే స్వీకరిసున్నా

తిమ్మ: (తీవ్రంగా) ఏమిటి

కృష్ణ : చిన్నాదేవితండ్రి స్వామి ప్రతి నిత్యమూ అంతఃపురానికి పూవులు తేవడం అతని పూదోటలు అన్యాక్రాంతములయినప్పటికీ ఆచారంగా నిలిచిపోయింది. అతనికి ప్రస్తుతం ఉన్నది ఒక మల్లికావల్లి. మరొకమాలతీనికుంజం! అవి నిత్యమూ ఎన్ని మాలలని ప్రసాదించేను?

తిమ్మ : అందుకని ఉచ్ఛిష్టాన్ని ఉద్ధరిస్తున్నారా?

కృష్ణ : నన్నర్పించిన పూలదండను చిన్నాదేవి తండ్రికి అజ్ఞాతంగానే కొబోలు తలిమా సరాలతో కలిపి అందజేయిస్తోంది!

తిమ్మ : అంతటి నంగనాచి కనుకనే ఇంతటి ప్రభువును—

కృష్ణ : అప్పాజీ!

తిమ్మ : (ఉగ్రుడవుతూ) అది నీచకృత్యం కాదా? ఒక పుష్పలావిక అవిఘంగా ఒకసారి ఉపయోగించిన విరిదండను అంతఃపురానికి పంపించడం అనేది ప్రభుత్వ జాగరూకతను కించపరచడమే! అది కఠిన శిక్షార్హమైన రాజద్రోహం!

కృష్ణ : (స్మితశీలో) స్వపక్షు సమర్థనకు శబరి చరిత్ర విన

తిమ్మ : అది భ

కృష్ణ : ఇది ప్రేమ!

తిమ్మ: సహస్రథా స్తం! అంతే కాదు. అప్రశస్తం.

కృష్ణ : అయినా స్వయంసముజ్జ్వలములయిన సమున్నత హిమవన్నగ గౌరీశంకరశిఖరాలే అవి!

తిమ్మ : సరిపడని సాదృశ్యం.

కృష్ణ : ప్రత్యేకతగల ప్రేమా భక్తి అద్వైతభావాన్ని అందుకొన్నవే! ప్రేమలో భక్తి! భక్తిలో ప్రేమ! అదే పరమార్థరహస్యం! అప్పుడే నిష్కృతి!

తిమ్మ: బాగుం దీ అభినవమైన ఆమ్నాయం!

: మా ప్రేమ వివాహానికి, అప్పాజీ మీ అనుమతి అపేక్షా సుసాధ్యం!

తిమ్మ: అది కేవలం స్వప్నసందర్భం!

కృష్ణ : అప్పాజీ!

తిమ్మ : అసంభవం నా అంగీకారం!

కృష్ణ : నిశ్చితపూర్వమా?

తిమ్మ : ప్రభువులకు పరిచారికాతుల్యతో వివాహప్రసక్తి మేం వినకూడదు. అలా జరగడానికి వీల్లేదు.

కృష్ణ : వీల్లేదా?

తిమ్మ : (నిష్కర్షగా) ముమ్మాటికీ!

కృష్ణ : అయితే చిన్నాదేవి పట్టపుదేవేరి కానిదే నేను పరిపాలించడమూ నిరవకాశమే!

తిమ్మ: నిరవకాశమా ?

కృష్ణ : మరోసారి లేదని చెప్పడాని విచారిస్తున్నా.

తిమ్మ: మంత్రిగా నేను మరోసారి మనవి చేస్తున్నా.

కృష్ణ: (తీవ్రంగా) ప్రభువుగా చెప్పేది ఆంతరంగికవిషయాల్లో అమాత్యశీల అభినివేశం అతిక్రమణమే అవుతుందని.

తిమ్మ: అభిమానధనులకు అభివాదపరంపర!

(ఒక్కడుగు ముందుకు కదుపుతాడు)

కృష్ణ: (వ్యాకులప్రసారిత తర్జని ప్రకంపిస్తుంది)

తిమ్మ: (ఆగి) విజయనగరసామ్రాజ్య వీర పౌరునిగా విజ్ఞప్తి. ప్రభూ! విశాల వినీల విహాయస వీథిలో వీరవిహారం చేసే విజయనగరసామ్రాజ్య మహాపతాకను రాత్రింబగళ్లు రక్షించుకోవలసిన ప్రజలపక్షాన ప్రభుకార్యంపట్ల ఇదే అసమ్మతి ప్రకటన!

కృష్ణ: మంచిది. ప్రజావైముఖ్యాన్ని సహించని ఈ ప్రభువిక ప్రభుత్వాన్ని నిర్వహించడం తప్పక నిరవకాశమే!

తిమ్మ: కనుకనే చిన్నమ్మను రాణిని చెయ్యాలన్న భీష్మప్రతిజ్ఞ మానండి.

కృష్ణ : (నవ్వుతూ) భీష్మప్రతిజ్ఞాప్రతిమానం చేత సాఫల్య కృతార్థుడను!

తిమ్మ: విషయాంతరవిన్యాసంవల్లనా ఫలశ్రుతి?—తమకు సత్వరాచరణీయం చిన్నాదేవిని విడిచిపెట్టడమే!

కృష్ణ: చిన్నాదేవినా? విడిచిపెట్టడమా? అసంభవం.

తిమ్మ: మరి గత్యంతరం?

కృష్ణ: పవిత్రప్రణయలతాలవిత్రమయిన పదవిని పరిత్యజించడమే! మధురమనోజ్ఞమంజులమైన సుందర ప్రకృతి సృజించడమే!

తిమ్మ: నిశ్చయమా?

కృష్ణ: దృఢనిశ్చయం

తిమ్మ: సంతోషం! సెలవ్!(నిష్క్రమిస్తాడు)

కృష్ణ: (తీవ్రాలోచనలో పడి క్రమంగా వికాసాన్ని పొంది మందహాసం చేస్తుండగా—

(చిన్నాదేవి వస్తుంది)

చిన్నా: ప్రభూ!

కృష్ణ: చిన్నా! నీ ప్రేమబహుమానానికి కావ్యత్వాన్ని కల్పించి చిరస్థాయిగా చిత్రించడానికి సంకల్పించాను.

చిన్నా: ఏమిటి ప్రభూ?

కృష్ణ: అపూర్వంగా!... కావ్యత్వంలోనే దివ్యత్వం! దివ్యత్వంలోనే కావ్యత్వం!

చిన్నా: అదెట్లాగండి?

కృష్ణ: చిన్నా! నీ సుకుమార పవిత్రహృదయ పూజాద్రవ్యమైన ముక్తమాల కావ్యత్వాన్నంది ఆముక్తమాల్యద అవుతుంది.

చిన్నా: (ఆశ్చర్యంగా) ఆముక్తమాల్యద!

కృష్ణ: (ధ్రువీకరణగా) ఆఁ! ... ప్రబంధరాజం! ... అందులో ఒక భక్తురాలు తన ప్రేమహృదయాన్ని భగవంతుడికి అర్పించి తాదాత్మ్యం పొందుతుంది. ఆ మానవకన్యాభగవానుల తాదాత్మ్యమే దివ్యత్వం. నా హృదయంలోని చిన్నాదేవి నా హృదయగత మహాకావ్యంలో గోదాదేవి!

చిన్నా: (విస్మయానందాలతో) ఎంతమాట!

కృష్ణ: మేరు సదృశమేనా?

(తిమ్మరసు తిరిగి వస్తాడు)

చిన్నా: (చూడలేదు. తన ధోరణిలో తన్మయభావంతో) నేనంటే ఏలినవారికి ఎంత ప్రేమ! ఈసృష్టిలో ఏ ప్రియుడూ ఏ ప్రేయసికీ ఇవ్వని మహత్తర శాశ్వత కవితాస్థానాన్ని నాకు సమకూరుస్తున్నారా?

కృష్ణ: అనిదంపూర్వంగా అంతర్వాహినిలో!

చిన్నా: (తాదాత్మ్యంతో) ధన్యురాలిని ప్రభూ! (ఆనందంపట్టలేక పోతూ) మరా మహాకావ్యంలో మీ పాత్ర?

తిమ్మ: భగవద్భక్తులు భగవత్స్వరూపులేగా!

చిన్నా, కృష్ణ: (చూస్తారు)

తిమ్మ: శ్రీకృష్ణదేవరాయలవారే విష్ణుస్వరూపులు!

చిన్నా: (సవినయంగా నిష్క్రమించబోతుంది)

తిమ్మ: ఆగు! సౌభాగ్యవతీ!

చిన్నా: (ఆగి) మహామంత్రులకు నతశిరస్సమస్కృతులు!

తిమ్మ: సుమంగళీభవ!

కృష్ణ: క్షమించండి అప్పాజీ!

తిమ్మ: ఎందుకు?

కృష్ణ: నా చిన్నాదేవి ప్రేమను పురస్కరించుకొని మీ నిర్ణయాన్ని తిరస్కరించినందుకు—

చిన్నా: ఏమిటి ప్రభూ! అమాత్యశేఖరుల ఆదేశానికి మీ తిరస్కారమా?

తిమ్మ: (చిన్నాదేవిని) ఉచితజ్ఞురాలివి!

కృష్ణ: చిన్నా!—

తిమ్మ: (అడ్డుకొని) సౌభాగ్యవతీ! నీమీది ప్రేమ వదులుకోలేక—

చిన్నా: (విషణ్ణయై) నామీది ప్రేమ వదులుకోడమా?

(స్వామి వస్తాడు)

కృష్ణ: అప్పాజీ!

తిమ్మ: (వినికూడా అలక్ష్యంగా చిన్నాదేవితో) ప్రభుత్వమర్యాదలూ, మతసంప్రదాయాలూ మరీ కులాంతరవివాహాన్ని సమ్మతించవ్ కదూ సౌభాగ్యవతీ!

చిన్నా: నిజమేఁ!

స్వామి: అమ్మాయ్!

చిన్నా: నాన్నా!

స్వామి: ఏనాడో నేను చెప్పలేదూ?—మనుష్యుల దృష్టిలో మనుష్యులమైన మనం మనుష్యులం కామమ్మాయ్!

తిమ్మ: సౌభాగ్యవతీ! విజయనగర సామ్రాజ్య విభవశ్రీ స్మరించైనా నీవు దేవరవారిపై ప్రేమ మరలించుకోవాలి.

చిన్నా: (నిర్ఘాంతపోయి) ఆఁ!

కృష్ణ: (హెచ్చరికగా) అప్పాజీ!

తిమ్మ: (కర్కశంగా) అడుగుతున్నది నిన్ను కాదబ్బాయ్! (మృదులంగా) ఏమంటావమ్మా?

చిన్నా: నా ప్రణయమూర్తిపై ఆశ మరలించుకోవాలా మంత్రిగారూ?

తిమ్మ: యావద్విజయనగరసామ్రాజ్యశాంతిభద్రతల దృష్ట్యా—అవతల మహమ్మదీయులు విజృంభిస్తున్నారు. ఇలాంటి విషమసంధిలో సుమము పూజ

లతో కృష్ణదేవరాయలవంటి వీరుడు ప్రణయినీ ప్రసవ డోలికల్లో మైమరచివుంటే సమరసన్నాహం సాగదు. సామ్రాజ్యసుస్థిరత అసాధ్యం! జయభేరీ నినాదాలు దిక్కులు పిక్కటిల్లడానికీ, శత్రు శిబిరాలు శ్మశాన స్థావరాలు కావడానికి, ప్రభుత్వరథాన్ని అధిష్ఠించవలసిందీ ప్రభువే!

చిన్నా: అయితే నే నెందుకు—

స్వామి: విలోమవివాహవ్యవస్థని సమాజం సమాధి చేస్తుందమ్మాయ్!

చిన్నా: నాన్నారూ!

తిమ్మ: సౌభాగ్యవతీ! సంప్రదాయం మీ సంబంధాన్ని సమ్మతించదు. తద్భిన్నంగా వ్యవహరిస్తే ప్రభుత్వముద్రలకు తిలోదకాలివ్వాలి. అందుకని నీమీది ప్రేమాతిశయంతో మా కృష్ణదేవరాయలు పదవీపరిత్యాగం చేశాడు.

చిన్నా: పదవీ ప

తిమ్మ: నీవు కారణంగా!—ఇంతటి సంక్లిష్ట స్థితిలో ఎలాంటి పరిణామం సంభవిస్తుందో ఆలోచించు. విజయనగరసామ్రాజ్య విభవసంపత్తి కీ నాడే వినాశోన్ముఖం—అబ్బా!—అపశ్రుతి!

కృష్ణ: చిన్నా! ఇదంతా ఇంద్రజాలం! ఇంద్రధనుస్సులా ఈయన చిత్రవిచిత్రమైన రంగుల్ని ఏకముద్ర వేసి గులాబీ ముళ్లతో కంచెకట్టి నిన్ను వివశను చేస్తున్నాడు. ఈయన మాటలు విశ్వసించకు.

చిన్నా: నిజమేనా ప్రభూ! మీ పదవీపరిత్యాగం?

కృష్ణ: నిజమే!

చిన్నా: అదేమిటి ప్రభూ! త్యాగమంత అల్పమైనది మరొకటి లేదు.

స్వామి: అమ్మాయ్!

కృష్ణ: కాదు చిన్నా! మహత్తరమైనది!

చిన్నా: అంత మహత్తరమా ప్రభూ?

కృష్ణ: అనంతవిభవోపేతం.

చిన్నా: అయితే ప్రభూ! ఈ ప్రియురాలు మీకు మానసికంగా అర్ధాంగి కదూ? మరలాంటి మహత్తర వస్తువులో అర్ధభాగాన్ని ప్రసాదించరూ?

ఏలాంటి చిన్నా!

స్వామి: నువ్వు గృహిణివి అవ్వాలి. నా

చిన్నా: నాన్నా!—(తలదిప్పి) ప్రభూ! మీవలే నేనూ త్యాగం చేస్తున్నాను. అసంఖ్యాక ప్రజల ఆత్మస్వాతంత్ర్యసౌష్ఠవార్థం నా స్వార్థ ప్రేమను—

స్వామి: అమ్మాయ్!

కృష్ణ: మతిభ్రమణమా ఇది చిన్నాదేవీ!

తిమ్మ: కాదు. త్యాగవీరుడు కృష్ణదేవరాయలకు తగిన సతి! త్యాగవతి!

కృష్ణ: మాటాడేది మంత్రిగారేనా?

తిమ్మ: (మందగంభీరహాసంతో) కాదు ప్రభూ! మీ అప్పాజీ!

స్వామి: అమ్మాయ్! నీకు మతిపోయింది. నా తుదికోరిక సర్వనాశనం చేశావ్. అమ్మాయ్! అమ్మాయ్!

చిన్నా: నాన్నా! ఇది భారతగృహిణీపరమ ధర్మం

స్వామి: నా కర్మం!

కృష్ణ: అప్పాజీ! పెంచి, చదివించి, సింహాసనమెక్కించి, ఈనాడు కుమారుని మనశ్శాంతిపట్ల ఈ విధంగా ఇంత కర్కశత్వం ప్రకటించడం, (వ్యంగ్యంగా) నా పూర్వజన్మ సుకృతం కాబోలు!

చిన్నా: ప్రభూ!

కృష్ణ: ఏం చిన్నా! ఎంతలో ఎంత పిచ్చిదానివైపోయేవ్!

స్వామి: మంత్రిగారి మహాప్రసాదం!

తిమ్మ: (మందస్మితం)

కృష్ణ: చిన్నా!

చిన్నా: తక్షణమే మీరు విజయనగర సింహాసనం అధిష్ఠించవలసినదిగా ఈ ప్రేమత్యాగిని ఆశయం. ఈషత్పూర్వం భవదీయ చరణదాసి అంతిమ నివేదన.

తిమ్మ: ఆవేదన కూడా!

కృష్ణ: చిన్నా!—ఎంతపని చేశారు అప్పాజీ!-

స్వామి: సుడిగుండాల్లో నా సుకుమారత్వం?

కృష్ణ: ఎంత నాటకచక్యంతో. ఏమి లౌక్యంగా ఈ పద్మవ్యూహాన్ని న్నారు!—నువ్వెంత బేలవ్ చిన్నా! ఇట్టే వీరిని చూచి భయపడిపోయేవ్! నీకోసం

నిత్యనూత్న వసంతాలు మనస్సీమలో సృష్టించు కొంటున్న నాలో ఇక శరత్ నెక్కడ? శరాఘాతా

తిమ్మ: అహ్హాహ్హా!

కృష్ణ: అప్పా నా అంతరంగంలో సముద్ర మథనం సాగించారు. ఏమి సాధించారు?

స్వామి: సనాతన మతసారాన్ని!

కృష్ణ: అదిగో! ప్రచండజ్వాలికలు ప్రళయ జిహ్వకలపై నిలిపి సహస్రఫణాలు విప్పిన శేషాహి! అవిగో! హాలాహల భుగభుగలు శూన్యాకాశంలోకి విరజిమ్ముతోంది!

తిమ్మ: అబ్బాయ్! హాలాహలం పుట్టింతర్వాత అమృతకలశమే గా ఆవిర్భవిస్తుంది.

చిన్నా: అవును. ఇక ప్రజలకు లభించేది స్వచ్ఛందామృతమే గా!

తిమ్మ: మరా ప్రజల్లో నువ్వూ ఒకదానివే గా! అంచేత నీకూ లభించాలి అ అస్పష్టం.

స్వామి: మంత్రిమహాశయా! శివమెత్తిన మీకు ఇంత విషంత గినా ఇంకా దాహం తీరలేదటయ్యా! ఇంకా ఏం చేద్దామని మా అమ్మాయిని?

తిమ్మ: తొందరపడకయ్యా! ఈమె నీకు అమ్మాయిలానే, ఈ ప్రభువు నాకు అబ్బాయి.

కృష్ణ: ఇదేనా మీ పితృహృదయం?

తిమ్మ: అంత తొందరెందుకోయ్?

స్వామి: అనుభవించక!

తిమ్మ: (నిర్మలంగా) ఆఁ—అబ్బాయ్!— సౌభాగ్యవతీ!—మీ ఆత్మ సంబంధమైన అనుబంధం నాకు ఆనందాన్ని కలిగించింది. ఇక మీరు స్వేచ్ఛగా?

కృష్ణ, చిన్నా: (ఒకేసారి) స్వేచ్ఛగా?

స్వామి: ప్రేమపక్షులై ఆకాశానికెగరమని, పాపం, మహామంత్రి గారు వరమిస్తారు.

తిమ్మ: (నవ్వి) ప్రేమస్వరూపిణి—కాదు— త్యాగస్వరూపిణి ఈ చిన్నాదేవి రాణి కావడానికి ఇదే నా సంపూర్ణాశీర్వాదం!

కృష్ణ, చిన్నా: (చకితులై పరస్పరవిలోకన.)

స్వామి: (తబ్బిబ్బవుతూ) మా అమ్మాయి రాణా? మహారాణా?

కృష్ణ: (దరస్మితప్రకటన)

చిన్నా: (లజ్జాసంక్రమిత నూతనతేజఃప్రఫుల్ల వదనశ్రీ పంచుతుంది)

తిమ్మ: ఇక చిన్నాదేవి రాయలవారికి రాజ్ఞీ శిరోమణియే!

స్వామి: (తెల్లబోయి) మరి మీ శాస్త్రాలో?

తిమ్మ: అవా? వియ్యంకుడుగారూ! శాస్త్రాలు మానవనిర్మితాలై మానవపద్ధతుల్ని నిర్వహిస్తున్న మాట నిజమే! కాని, శాస్త్రవిజ్ఞానంకంటె ఆత్మవికాసమే ఉన్నతమైనదీ! ఉత్కృష్టమైనదీ! — ఆత్మవికాస పరీక్షకు త్యాగమొకటే నికషోపలం. చూడండి ప్రణయఫలం అవిసంగా పరిపక్వం కానిదే అమృత రసాన్ని చిందగలదంటారా?

స్వామి: (సంతోషంతో) సెభాష్! మంత్రి వియ్యంకుడుగారూ! నిజంగా మీరు యుక్తికి యుగంధరులే! చాకచక్యానికి చాణక్యులే!

[హఠాత్సంభూత సహస్రసౌదామనీ కాంతి రేఖల్లో చిన్నాదేవీ శ్రీకృష్ణదేవరాయల దేహదీధితులు వెల్లివిరుస్తాయి. వల్లీవనజాస్యలు వెదజల్లిన పువ్వు హృదయాలు పులకరిస్తాయి...]

# * సాతవాహనులెవరు *

శ్రీ చీమకుర్తి శేషగిరిరావు

ప్రాచీన భారతదేశమున, ఒక విశాలరాజ్యమును అతి దీర్ఘకాలము పరిపాలించిన రాజవంశములలో మౌర్యులతో సాటిగ చెప్పదగినది సాతవాహనవంశము. ఈ వంశమున జనించినవారు దాదాపు ముప్పదిమంది 428½ సంవత్సరముల కాలము పరిపాలించినట్లు మత్స్యపురాణమువలన దెలియుచున్నది. కాని ఈ సాతవాహనుల గురించిన సమగ్రము చరిత్ర నేటివరకు లిఖింపబడలేదు. వీరాంధ్రులేనా? వీరు రాజ్యమునెప్పుడు స్థాపించిరి? ఆంధ్రదేశ చరిత్రయందు వీరికిగల స్థానమెట్టిది? అను ప్రశ్నలకు పండితులు నేటికిని స్పష్టములగు సమాధానముల నీయజాలకున్నారు.

సాతవాహనుల కాలపు శాసనములును, నాణెములును కొన్ని మనకు లభించినవి. పండితులు కృషిచేసి, వానిని పరిశోధించి అందలి విషయముల వెలికి దీయగల్గిరి. కాని ఆ శాసనముల, నాణెముల సంఖ్య అత్యల్పము. ఉన్నవానియందైన వాని కాలమును సూచించు తేదీ లేవియు లేవు. పురాణములన్నో, ఒక్కొకతీరుగ సాతవాహనుల పేరుల దెలియజేయుచున్నవి. అసమగ్రము, పరస్పర విభిన్నములగు నిట్టి ప్రమాణములపై యాధారపడి, ఒక్కొక్క పండితుడొక్కొక నిర్ణయమునకు వచ్చి, సమస్యను క్లిష్టతర మొనర్చిరి.

లిఖితచరిత్ర లేవియు లభించని ప్రాచీన దేశముల చరిత్రను కూర్చుటకు ప్రాచీనభవనములు, నాణెములు, శాసనములు యెక్కువగ తోడ్పడుననుట నిర్వివాదాంశము. ఇట్టి సాధనములవలననే ఈజిప్టుదేశ ప్రాచీన చరిత్రను ఐతిహాసికపరిశోధకులు సమకూర్చగలిగిరి. కాని ఈజిప్టుదేశమున దొరికినంత విరివిగ యీ ప్రాచీన సాధనములు భారతదేశమున లభించుటలేదు. అయినను ఈజిప్టుదేశమున లేని, వేరు విధమగు సాధనసామగ్రి భారతదేశమున కలదు.

ఈజిప్టు, మధ్యప్రాచ్యదేశముల చరిత్ర, భారతదేశపు చరిత్రవలె ప్రాచీనమైనను, ఆ దేశముల నీనాడు నివసించు ప్రజలకా ప్రాచీన నాగరికతతో నెట్టి సంబంధమును లేదు. వెలుపలినుండి వచ్చిన చారిత్రకశక్తులు బలవత్తరములై, ఆ ప్రాచీననాగరికతల నిర్మూలించి, వాని స్థానమున నూత్న వ్యవస్థల నేర్పరచినవి. భారతదేశమున పరిస్థితి యిందుల కద్భుతముగ విరుద్ధము. భారతదేశమున ప్రాచీనకాలమున నుండిన వ్యవస్థయే క్రమపరిణామమునొంది యీనాటి రూపమును పొందినది. వ్యవస్థయందు మార్పులు రాలేదని యిందుల కర్థముగాదు. కలిగిన మార్పులు క్రమానుగతముగ కలిగినవి. వెలుపలినుండి వచ్చిన సంస్కృతీ ప్రవాహములవలన నీ మహావృక్షము కూలిపోలేదు. ఆ వెల్లువల ఉద్ధృతము తగ్గి కుదుటబడినతరువాత వానిచే క్షేత్రమింకను సారవంతమై యీ భారత జాతీయ వ్యవస్థావృక్షము యింకను యేపుగ పెరిగినది.

నేటి భారతదేశమున నగుపడు కులములకు, భాషలకు, ఆచారములకు బీజమా ప్రాచీన వ్యవస్థలోనే కలదు. వివిధఘట్టములలో, భారతదేశపు ఇతిహాసగతిలో, గలిగిన సంఘర్షణల, విపర్యయముల చిహ్నము లీ యాచారములలో, భాషలలో, సాంఘిక వ్యవస్థలో, నెచ్చటనో యొకచోట ముద్రితములై యుండును. ఆ చిహ్నముల గుర్తించి, చరిత్ర రచనయం దుపయోగించుకొను అవకాశము భారత ఐతిహాసిక పరిశోధకునకు గలదు. ఈజిప్టువంటి దేశములయం దీ సాధనసంపద శూన్యము.

ఈవిధముగ భారత భాషా, సమాజ, సంస్కృతీ క్రమపరిణామమును శోధించి చరిత్రరచనలో నుపయోగించుకొనుటకు, ఐతిహాసికపరిశోధకు లెవరును పూనుకొనకుండుట శోచనీయము.

సాతవాహనులెవరు? అను నీ ప్రశ్నకు పండితు లెవరును సరియగు సమాధానము నీయకున్నారు. సాతవాహను లాంధ్రులు కారనియు, వీరు బళ్ళారి ప్రాంతమున నుండిన ఒక రాజవంశమువారని సుక్తంకరు పండితుడనెను. తక్కిన పండితులలో ననేకులు వీరాంధ్రులే యని తలంచిరి. కాని వీరుగాని, సుక్తంకరుపండితుడుగాని, వీరికి సాతవాహను లను పేరేల కలిగెనో వివరింపజాలకపోయిరి.

సాతవాహనులనుగురించిన, వివిధపండితుల అభిప్రాయములచర్చించి 1941 లో శ్రీ గోపాలాచారిగారు '*Early History of Andhra Country*' అను గ్రంథమును రచించిరి. అందు వారు:

"*Satavahana is a family or a dynastic name while Andhra is a tribal name*" (ఆంధ్ర యనునది వీరి జాతి పేరు, సాతవాహన అనునది వీరి కుటుంబము లేదా రాజవంశము పేరు.)

—*Page 21* పై గ్రంథమున'

"*The meaning of Satavahana is as obscure as those of Chalukya, Pallava, and others*" (చాళుక్యులు, పల్లవులు, ఇత్యాదిపదముల యర్థములవలె నే 'సాతవాహన' అనుదానియర్థము కూడ దురవగాహముగ నున్నది.)

పే. 29 పై గ్రంథమే'

ఈ యభిప్రాయమే నేడుసయితము పండితులలో ననేకుల కంగీకృతమైనది. 1949 సంవత్సరము ఏప్రిల్ మాసపు 'జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ'లో *The date of the foundation of Andhra dynasty by Simuka* (శిముకుడు ఆంధ్రరాజ వంశమును స్థాపించిన కాలము) అను తమ వ్యాసమున ప్రొఫెసరు సుబ్బి వెంకటరావుగారు:

"*The dynasty which is known by its tribal name Andhra in the Puranas, and by its family name Satavahana in inscriptions*" (పురాణములలో ఆంధ్రయని జాతినామమునను, శాసనములందు 'సాతవాహన' అను వంశనామమునను వ్యవహరింపబడిన రాజవంశము) అని పేర్కొనిరి.

పైవారందరు యీ నిర్ణయమునకు వచ్చుటకు సాయపడిన శాసనములు రెండు కలవు. ఇందులో మొదటిది సాతవాహనవంశమున రెండవవాడగు కణ్హునికి సంబంధించినది. ఇందు 'సాతవాహనకులే కణ్హో' అని కలదు. రెండవది గౌతమీపుత్ర సాతకర్ణిని గురించిన ప్రశస్తిగల శాసనము. ఇందు 'సాతవాహన కుల యసపతిథాపన' అని కలదు.

ఈ రెండుశాసనములలోగల 'కుల' అను పదమునకు వంశమని యర్థముజెప్పకొని యీ పండితులు సంతృప్తిజెందిరి. కాని 'కుల' అను పదము యీనాడు మనము వాడురీతిగనే వాడబడినదని నా అభిప్రాయము.

క్రీస్తుశకమునకు పూర్వము దక్షిణాపథమున వర్ణవిభజన జరిగియుండలేదనుట నిజమే. కాని వృత్తినిబట్టి కులము లంతకు చాలకాలము పూర్వముననే యేర్పడియుండినవి. తరువాత వర్ణవిభజన అములులోనికి వచ్చినది. ఈనాడును మనము ఒకే వర్ణమున ననేక కులముల జూచుచున్నాము.

వృత్తిననుసరించి యేర్పడిన యిట్టి కులములలో పెక్కింటి పేరులు అమరావతీ, జగ్గయ్యపేట సాంచీస్తూపములయందలి శాసనములలో మనకు కనబడుచున్నవి. లూడర్సు సేకరించిన యీ శాసనావళిలో నెం 1138 నందు కులారిక (కుమ్మరి); నెం 1151 లో గోళిక, 1121 లో హాలకీయ (సేద్యం), నెం 1149 లో 'లేఖక' (వ్రాయసం), నెం 1133 లో కోళిక (నేతపని) అను కులముల పేరులు కనబడుచున్నవి. ఇట్టి కులములలోనే 'సార్థవాహ' అను కులమొకటి ఆనాడుండెనని లూడర్సు లిస్టులోని నెం 30 రు శాసనమువలన దెలియుచున్నది.

'సార్థవాహ' లనగా బిడారువర్తకము చేయువారు. దేశదేశాంతరములకు సామగ్రుల నెత్తించుకొని పోయి, విక్రయించి, అచ్చట దొరకు వస్తువులగొని తక్కిన దేశములలో నమ్ముచుండెడివారు. ఒక్కొక బిడారు కదలినయెడల ఒక పట్టణము కదలినటులుండెడిది. దుర్గమారణ్యములలోను, ఎడారులలోను, కొండలలోను, దారిదప్పకుండ వీనిని సార్థవాహులు నడిపించెడివారు. ఇట్టి సార్థము (బిడారు)ను గురించిన ప్రసక్తి మహాభారతమున పెక్కు సందర్భముల గలదు.

"దమయంతి సార్థవాహుం జూచి యిమ్మహాగహనంబున నిట్టి జనసంకులంబయిన సార్థంబు గానంబడియెడు నెట్టి పుణ్యంబొకో"—ఆంధ్రమహాభారతము. అరణ్యపర్వము. ద్వితీయాశ్వాసము.

ఈ సార్థవాహపదమే వికృతిజెంది 'సాతవాహ' అని యైనది. పాళీభాషయం దిట్టిపదములకు 'న' ప్రత్యయము చేరుట సర్వసాధారణము.

ఉదా:—'గాహపతినో'... (*Archaelogical Survey of Southern India. The Buddhist Stupas of Amaravati and Jaggayyapet by Burgess.* శాసనం నెం. 51 రు)

'సార్థ'మునకు వికృతియగు 'సాతో' అనుపదము తెలుగున 'సాతు' అని మారినది.

"సాతులోనిపరికి, జనముల నున్మదలీల నేలంజెటి"

—ఆంధ్రమహాభారతము. శాంతి. తృతీ. 471.

"వేహారంబు వెంట నొక్క సాతుంగూడి పర
దేశంబున కరుగుచోట"

—పైదానియం జే. 480.

కావున ఆనాటి ఆంధ్రదేశమున 'సాతువ్యాపారులు' విరివిగా నుండి, 'సాతవాహన' పలమొకటి యుండెడిదని మన మూహించవచ్చును. అంతియే కాదు.

పూర్వపు సమాజ పరిస్థితులగురించిన భోగట్టా చాలవరకు ఆనాటి సామెతలలో యిమిడియున్నది. కులమున కొకసామెతకు తక్కువలేకుండ నుండెడిదని మనము చెప్పవచ్చును. వెక్కిరింపునకై గానిండు, పొగడ్తకై కానిండు, ఇట్టి సామెత లుద్భవించి ప్రచారములోనికి వచ్చుచుండెడివి. ఆనాటి సామెత లిప్పటికి చాలవరకు నశించినవి. ఆచారములయందును, పదముల వాడుకయందును, కలిగినమార్పులచే ఉన్న సామెతలలో కొన్ని యర్థముగుటలేదు. ప్రాతకాలపు సామెతలలో నధికభాగము పూర్వకవుల ప్రయోగముల వలనమాత్రమే నేడు నిలిచియున్నవి.

ప్రాచీనాంధ్రమున, ఒకప్పుడు పేరుప్రతిష్ఠల నార్జించిన, యీ 'సాతు' వ్యాపారులనుగురించియు, నానాడు కొన్ని సామెత లుద్భవించియుండును. సాతు వ్యాపారము నశించుటచే, ఈ సామెతల స్వరూపము గూడ మారియుండును. కాని తిక్కనామాత్యుని పుణ్యమా యని ఒక సామెతమాత్రము మనకు దక్కినది.

"అనుజులకు నడ్డపడి యే
మిని, జేయఁగనీమి జూచి మెచ్చితి గాకీ
వును సాదురేఁగె నేని
న్వెను తలపొలమునఁ గాని నిలువకు సుమ్మీ"

—ఆంధ్రమహాభారతం. ఉద్యో. ద్వి. 13

ఇందలి 'సాదు', 'సాతు'నకు రూపాంతరము. 'కత' అను శబ్దము 'కద' గా మారినటులనే యీమార్పు సంభవించినది.

కాని, 'సాదు' పదమున కర్థము క్రమముగ నాంధ్రుల స్మృతిపథమునుండి తప్పిపోవుటతో యీ పద్యమునందలి సామెత కర్థము దుర్గ్రాహ్యమైనది.

ఈ సామెతకు సరియగు నర్థము నాలోచింతము. 'సాదు' అనగా 'సాతు'. ఈసాతు బహుజనాకీర్ణము, వివిధములగు శకటములును, బరువులుమోయు జంతువులును యిందు పెక్కుండుట సహజము. ఇట్టి సార్థము యొచ్చటబట్టిన నచ్చట మకాము వేయుటకు వీలుండదు. వీ రాగుటకై, ఆనాటి ప్రభువులీ వర్తకమును ప్రోత్సహించుటకై ఏర్పరచినవి కానిండు, లేదా ఇట్టి వర్తకసంఘములు యేర్పరచుకొనినవి కానిండు, కొన్ని మజిలీ లానాడుండెడివి. రైలుబండ్ల కీనాడు స్టేషను లెట్టివో, బిడారులకు ఆ మజిలీ లట్టివి. ఈ మజిలీలు తృణకాష్ఠ జలసమృద్ధి గలిగి, వ్యాపారస్థలములకు సమీపమున నుండెడివి. ఇట్టి మజిలీనే తెలుగువారు 'పొలము' అని ఆనాడు వ్యవహరించెడివారు. తలపొలము అనగా ప్రక్కభూమి, అవతలి ప్రదేశము అని అర్థము. ఇట్టి మజిలీలలో ఒకదానినుండి బయలుదేరిన 'సాతు' హుటాహుటి నడకలతో రెండవ మజిలీకి చేరువరకు నాగెడిది కాదు. అందువలన 'సాదు లేచినయెడల ప్రక్కమజిలీ చేరువరకు నాగదు' అను నర్థముగల పై సామెత ప్రచారములోనికి రాగల్గెను.

కాని 'సాదు' అరమును విస్మరించిన నిఘంటు కారుడు తిక్కనగారి పద్యమునగల పై సామెత కీ దిగువ అర్థమును వ్రాసెను.

"సాధువగు నెద్దు చెలరేఁగినచో ఊరి చివర భాగమునఁగాని యాగదు"—(సూర్యరాయాంధ్ర నిఘంటువు) 'తలపొలము' అను శీర్షిక క్రింద—ఈ యెద్దు ఊరి చివరభాగమున మాత్రమే ఎందు కాగవలెనో నిఘంటుకారుడు మనకు చెప్పలేదు!

ఈ దురవస్థ మన యీ నిఘంటుకారునికే కాదు. 16 వ శతాబ్దియందు పింగళి సూరన్నకు సైతము కల్గినది. ఆయనకీ సామెత యర్థము కాలేదు. తన కర్థము కాకపోవుట తిక్కనామాత్యుని తప్పుగనే భావించి, ఆ సామెతను సరిదిద్దే భారమును కొని తెచ్చుకొని మీదవైచుకొని, యీ విధముగా ప్రయోగించినాడు.

"సాదురేఁగినఁ దలపొలాన నిలువదను మాట నిజమయ్యె నేడటంచు"

—కళాపూర్ణోదయం. తృతీ. 37.

తిక్కనామాత్యుని సామెత 'సాదు రేఁగిన తలపొలమున నే నిలుచును' అనుదానికి వ్యతిరేకముగ 'సాదురేఁగిన తలపొలాన నిలువదు' అని సూరన్న సరిచేసెను!

ఇక నీ సూరన్నగారి సామెతకు నిఘంటుకారుడీ విధముగ నర్థ మొసంగెను.

'సాధువగు నెద్దు చెలరేగినచో ఊరి చివరభాగమునఁగూడ నిలువదు'. (సూ. రా. నిఘంటువు. 'తలపొలము' అను శీర్షిక క్రింద) దీని భావమేమో దేవునికెఱుక!

ఈ అవకతవక యర్థములకు కారణము 'సాతవాహనుల'తో పాటుగ, 'సాదు'నుగూడ మనము మరచిపోవుటయే.

'సాతు' పదముతో బయలుదేరిన మనము భాషా ప్రపంచములోనికి చాలదూరము పోవలసి వచ్చినది. ఇది అనివార్యము. కొన్ని చారిత్రక పదములు ఎటుల తారుమారైనవో, అందువలన సత్యమెంత మఱుగుపడి పోయినదో తెలుసుకొనుట కది యావశ్యకము.

ఇక, నీ సాతవాహనకులము, ఆరాజ్యముతో పాటుగనే నశించి, ఊరు పేరు లేకుండపోయినదా? అను విషయమును మన మాలోచించవలసియున్నది. ఆ కులమున, రాజ్యపరిపాలనజేసిన కుటుంబ మొకటి యుండి, రాజ్యనాశనముతో నావంశమును నశించి యుండిన యుండవచ్చును. కాని కులమంతయు నాశనమయి యుండ నేరదుగదా! అటులగాక, నీకులము వారు క్రమముగ నింకొకకులమువారిలో కలిసిపోయి రనుటయును నమ్మదగు విషయము కాదు. మనజాతి యందు కులముల పట్టుదల యెక్కువ. అందులో చారిత్రకప్రశస్తిని గాంచిన 'సాతవాహు'ల కులము, సులభముగ నితరకులములతో కలిసిపోయి ఆత్మవిధ్వంసన మొనర్చుకొన్నదనుట అవిశ్వసనీయము. ఆంధ్ర జాతియందు గల పెక్కు కులములలో నిదియు నీనాటికి యుండక తప్పదు పరిశోధనాఫలితముగ ఆనాటి సాతవాహనులే నేటి సాదువాండ్లు, లేదా, సాదు సెట్లని తేలుచున్నది.

నామసామ్య మాత్రముననే నే నీ నిర్ణయమునకు రాలేదు...ఈ సాదువాండ్లు సాదుసెట్లను పేర ఉత్తర ఆర్కాటు, చెంగల్పట్టు జిల్లాలలోను, చెన్నపట్నమునను, మైసూరున కోలారు, బళ్ళారి జిల్లాలలోను కలరు. ఇంకొక శాఖవారు, సాదు వాండ్లు, పెరికెరాజులు అను పేరులతో విశాఖ పట్నం జిల్లాలో కలరు. తమిళదేశమున నుండనిండు, కర్ణాటదేశమున నుండనిండు; వీరికి తెలుగే మాతృభాష. వ్యాపారమే వీరి వృత్తి.

'సాదువాండ్లు' అనువారిని గురించి థర్‌స్టన్ తన '*Castes and Tribes of South India* (దక్షిణభారతమునందలి కులములు, జాతులు) అను తన గ్రంథమున నీ విధముగ వ్రాసియున్నాడు. "సాదువాండ్లు, వర్తకసమూహము లేక ప్రయాణీకులు అను నర్థమున 'జనపల' కొక పర్యాయపదముగ వాడబడుచున్నది."

సరియే, యీ 'జనప' లెవరు? 'చనుప' లేక 'చన్న' అనునవి సాతునకు సమానార్థముగల దేశ్య పదములు

"దమయంతి...'ముందట' నొక్క చనుపంగని దాని జొచ్చునపు డందలి జనంబులు."

—ఆంధ్రమహాభారతం. అర. ద్వి. 101

"ఇచ్చన్నతోఁ జని యువ్వనక్లేశంబుఁ దలఁగుడు."

—పై గ్రంథమున. 118.

కావున 'సాదు' నకు పర్యాయపదములుగ 'చన్న,' 'చనుప' లు కూడ వాడబడి, చనుపకు అర్థము మరుగుపడి పోయినతరువాత నది 'జనప' గా మారి సాదుశెట్లు జనపసెట్టు లైరి.

1951 వ సంవత్సరమున, చెన్నపురిలోని సాధు శెట్టి మహాజనసభవారు తమ కులచరిత్రను తెలియ జేయుటకై 'సాధుసెట్లు' అను గ్రంథమును ప్రచురించిరి. అవగింజంత సత్యమును గుమ్మడికాయంత పుక్కిటి పురాణములో కప్పిపెట్టు భట్రాజుల కథల నాధారముగా గొని వీరు దీనిని రచించిరి. కాని రచయితకే యీ గ్రంథము సంతృప్తి నొసగలేదు. 'సాతు', 'చనుప' పదముల ప్రసక్తియే వీ రెత్తుకొనలేదు. సాధుప్రవర్తన గలవారగుటచే సాధుసెట్టులుగా నైతిమనియు, జనపనార గోతాల వ్యాపారము చేయుటచే 'జనప'ల మైతిమనియు సరిపుచ్చుకొని వీరు తమ ధ్వజముపై జనపచెట్టు, ఆకు, పువ్వులను చిత్రించుకొనిరి.

ఈవిధముగ సాదుసెట్టి, సాధుశెట్టి యగుటతో, 'చనుప' జనపగా మారి, పూవులు పూచి, కాయలు గాచి, జెండామీద ఎక్కి కూచున్నది.

ఈ సాదుసెట్లు తాము పృధ్వీశు డను రాజు సంతతివార మనియు, శాపవశమున వ్యాపారవృత్తికి దిగితి మనియు చెప్పుకొందురు. విశాఖజిల్లాయందలి సాదువాండ్లు తాము సాతువ్యాపారులుగ నుండి, దమయంతీదేవిని కష్టదశలో ఆదుకొని రక్షించినందులకు ప్రతిఫలముగ నలమహారాజు తమ్మ నీ దేశమునకు దెచ్చెననియు, తాము రాజులుగ కొంతకాలముండి, పరశురాముని దండయాత్రకు భయపడి పరుగెత్తుటచే, పిరికిరాజులు, లేదా పెరికరాజులు, రాజపెరికలు అను పేరులను పొందితిమని చెప్పుకొందురు. ఈ విషయములన్నియు థర్‌స్టన్ గారి *Castes and Tribes of South India*' అను గ్రంథమున చూడవచ్చును.

'సాతవాహనులు రాజరికము నెరపిన సంగతి యీ ఉదంతములం దెటుల గర్భితమైయున్నదో వివరించ నవసరములేదు.

అయినను, చారిత్రకపరిశోధకుడు వైజ్ఞానిక పరిశోధకున కెందును తీసిపోడు. సహేతుకతి, సరి

యగు ప్రామాణికత, స్పష్టముగ గన్పించనిదే ఆత డేదియు నంగీకరింపజాలడు. నామమాత్ర సామ్యమును, ఆ నామమునందలి పదములకు క్రమానుగతముగ వచ్చిన యర్థమును, ఆ కులమునకు సంబంధించిన పురాణగాథలను మాత్రమే యథార్థముగ గ్రహించి 'సాతివాహన' కుల మీ 'సాదువాండ్ల' కులమేయని యంగీకరింపడు. సాతవాహనులు సార్థవాహులే యగునెడల సాతవాహన పదమున కిట్టి యర్థముకలదని యా కాలపు వారి వ్రాతలలో లేదేమి? అని యతడు ప్రశ్నించక మానడు. దీనికి సమాధాన మాలోచింతము.

సార్థమనగా ప్రయాణికుల సంఘము లేదా వర్తకుల సంఘము అని నైఘంటికు లొసగు అర్థము. ఇట్టి జనసమూహమును, లేదా వర్తకసమూహమును దారితప్పకుండ సరిగా నడపించువాడు సార్థవాహుడు. సాతివాహన పదమునకు కూడ ఇట్టి అర్థమే ఆనాడు ప్రచారమున నుండెడిది. ఆనాడే కాదు క్రీ. శ. 7 వ శతాబ్దిలో కూడ యీ పదమున కీ యర్థము ప్రచారమున గలదని మనకు విస్పష్టముగ తెలియవచ్చుచున్నది.

క్రీ. శ. 7 వ శతాబ్దిలో చైనీయ యాత్రికుడు హుయన్ చాంగ్ భారతదేశమున పర్యటించెను ఇతడు సంస్కృత, పాళీభాషలందు పండితుడు. ఆ భాషలలోగల బౌద్ధమత గ్రంథముల నెన్నింటినో చైనా భాషలోని కనువదించెను. హిమాలయము మొదలుకొని కాంచీపట్టణమువరకు నతడు సంచారముజేసి తన యాత్రావివరముల గ్రంథస్థ మొనరించెను. అందు దక్షిణకోసలమునందలి విశేషములదెల్పుచు నాత డీ క్రిందివిధముగ వ్రాసెను.

*'Near to the south of the city (that is apparently, the Capital) was an old monastery, with an Asoka Tope, where Buddha had vanquished Thairthikas, by the exhibition of super-natural powers, and in which Nagarjuua Pusa had afterwards lodged. Contemporary with this Pusa, was the King styled Sha-to-pho-ho or 'Leading-right' (Yin-cheng), who treated Nagarjuna with ceremonious respect, and kept guard at his residence.* (ముఖ్యపట్టణమే యని భావించదగు) నా పట్టణమునకు దక్షిణప్రాంతమున అశోకస్తూపము గల నొక ప్రాచీనవిహారము కలదు. తన దివ్యమహిమల బ్రదర్శించి బుద్ధదేవుడిచట తైర్థికుల నోడించెను. తరువాత నిట ఆచార్య నాగార్జునుడు వసించెను. ఆ ఆచార్యునికి సమకాలీనుడై, శా-తో-ఫో-హో, లేదా, 'సరిగా నడుపువాడు' అను ఉపనామము గల రాజొక డుండెను. ఆ రాజీ ఆచార్యుని పూజ్యభావమున నాదరించి, అతని నివాసమువద్ద రక్షణ కేర్పాటులజేసెను.) *(From 'On Yuan-Chwang's Travels' by Thomas Watters. P. 200.)*

పై ఉల్లేఖమందలి శా-తో-ఫో-హో, సాతవాహనుడే యని పండితులెల్ల రంగీకరించిరి. కాని 'సాతవాహ' పదమునకు హుయన్-త్సాంగ్ యిచ్చిన 'సరిగ నడపువాడు' అను అనువాదము మాత్రము తప్పని యనిరి.

పై గ్రంథమును ప్రచురించిన 'వాటర్సు' ఆ గ్రంథముననే 207 వ పుటలో, పై ఉల్లేఖము పై వ్యాఖ్యానించుచు యిటుల వ్రాసియున్నాడు.

*"The pilgrim's transcription apparently represents, as has been suggested, a form Satavaha, the translation being incorrect"* (ఇదివఱకు పూర్వమే సూచింపబడిన రీతిగ, నీ యాత్రికుని వ్రాత, 'సాతవాహ' అను పదరూపమునే తెలియజేయును. ఆ పదమున కిచ్చిన అనువాదము మాత్రము తప్పు)

వాటర్సు చెప్పినదానినే తక్కిన పండితులనుసరించిరి. వీ రందరు, చైనాయాత్రికుని అనువాదము తప్పని చెప్పిరేకాని తాముమాత్రము 'సాతవాహన' పదమునకు వేరర్థము చెప్పజాలకపోయిరి. ఇందుమూలమున, నీ విధముగ, యీ పండితుల దయవలన 'సాతవాహన' పదమునకు త్రిశంకుస్వర్గము లభించెను.

'సాతవాహనులు' సార్థవాహులే యని గ్రహించువారికి, హుయన్-త్సాంగు అనువాదమున తప్పేమియును కనుబడదు. ప్రజాసంఘమును త్రోవన 'సరిగా నడపించువాడే' గదా సార్థవాహుడు.

సాతవాహనులు సార్థవాహులే, అనగా సాదువాండ్లకులమువారే యని గ్రహించుటకు యింతకన్న బలవత్తరసాక్ష్యమేమి కావలెను?

దేశపాలకులగు సాతవాహను లాంధ్రులేనా? వర్తకులగు వీరు రాజ్య మెటుల స్థాపించిరి? సాతకర్ణియన నర్థమేమి? ఆయీవిషయములు ఇటుపైని విచారణీయములు.

కథానిక

# * గడచిపోయిన గాథలు

## శ్రీ బలివాడ కాంతరావు

ఎగురుచూస్తున్న భర్త గుమ్మంలో కాలు పెట్టగానే ఆమె చెప్పాలనుకున్నది వెంటనే చెప్పింది. వెంకటేశ్వరరావు బట్టలు మార్చి సోఫామీద చారబడ్డాడు. ఈ చెప్పిన విషయంలోన తను చూపించిన ఆసక్తిలో పదోవంతైనా, భర్త కనపరచకపోవటం, ప్రమీల కేమీ నచ్చలేదు. మళ్ళీ ఆ విషయమే యె

"ఇందులో యేముంది" అన్నాడు భర్త.

"లేదూ! వీధిలోనే కాదు, ఊరంతా చెప్పుకుంటున్నారు!"

"నువ్వేకదూ విన్నావు?" చిన్న నవ్వుతో అంటే...

"అబ్బా! ఆ అమ్మాయి చాలా అందకత్తె... చదువుకుంది"...

"అందచేత తనకు నచ్చిన మొగుణ్ణి చూసుకొంది. ఇందులో గొప్పేం వుంది? తప్పేం వుంది?"

"అలా జాతీ, నీతీ లేకండా లేచిపోవడమే!"

వెంకటేశ్వరరావు చిన్ననవ్వునవ్వాడు: బాత్ రూమ్‌కి వెళ్తోంటే ప్రమీల చిరాకుగా "మీ కెన్ని సార్లు చెప్పాలి, చెప్పల్స్ వేసుకువెళ్లండీ!" ఈసారీ దరహాసంచేసి చెపల్స్ వేసుకొన్నాడు.

డైనింగు టేబిల్ దగ్గర కూర్చునే టప్పుడు కూడా ప్రమీల మళ్ళీ యీ విషయం యెత్తకండా వుండలేకపోయింది. భర్త యిదొక మామూలు విషయంగా తీసుకోవటం ఆమెకేమీ నచ్చలేదు. లేచిపోయేముందు, "పోనీ వాడి అందంచూసైనా లేచిపోయిందంటే, అదీకాదు—అట్టే బావుండడట!" అన్న భార్యవేపు చూసి మళ్ళీ చిన్ననవ్వునవ్వాడు గాని వ్యాఖ్యానించలేదు.

మరుసటిరోజు పనిమనిషిద్వారా మరికొన్ని విషయాలు తెలుసుకుంది. ఈ పనిమనిషి లేచిపోయిన అమ్మాయి తండ్రి యింట్లోకూడా పనిచేస్తోంది. కబుర్లు, వ్యాఖ్యానాలతో సహా వస్తున్నయ్— "సూడమ్మా! మొగాళ్లని నమ్మనేం! ఆపెదాని వంటిలోన యెక్కడికంపె అక్కడుంటే, నమిలి మింగేసినట్టు సూస్తారు! నాకు యీదిలోంచి తలెత్తుకోని యెళ్లడానికే భయం," అన్నది.

ప్రమీలకు యీ మాటలు మోటుగా అనిపించినా పక్కున నవ్వింది. "ఏమమ్మా నవ్వతన్నావంది" పనిమనిషి. ఏమీ లేదులే అంటూ గదిలోనికి వచ్చి పకపకా నవ్వుతూన్న ప్రమీలను, భర్త, పనిమనిషి వేసిన ప్రశ్నే వేశాడు." మీరూ దానిలానే అడిగారు? మా పనిమనిషి వీధిలోనించి తలెత్తుకు వెళ్ళటానికి భయమట—అందగాళ్లంతా నమిలి నమిలి మింగేస్తారట!"

భర్త మాటాడకండా పక్కగదిలోకి వెళ్లిపోయాడు. ప్రమీలకిదేమీ నచ్చలేదు. ఈ నల్లటి కొరివి దెయ్యంలా వున్న పనిమనిషి కోతలకి భర్త కూడా నవ్వితీరాలని పక్కగదిలోకి వెళ్ళి, భర్త ముఖంవేపు చూసి నవ్వుతోంది. వెంకటేశ్వరరావు ముఖం గంభీరంగావుంది. జరిగింది—దగ్గరగా జరిగింది. ముఖంలో ముఖం పెట్టి 'నవ్వరూ!' అంది.

నవ్వాడు. ఆమెకదే తృప్తి—మళ్లీ పెరటికి వెళ్లింది. వెళ్తుండగా ఆమెవేపు చూశాడు. ఆ నవ్వే మనసులో నవ్వుకున్నాడు.

భర్త మోటారు సైకిలుమీద ఆఫీసుకు వెళ్ళిపోయాడు. షేక్స్పియర్, డికెన్స్ యేనాడో పూర్తి చేసింది. హోం లైబ్రరీలో పుస్తకంకోసం వెతికి, ఒకటి తీసి మళ్ళీ యింకొకటి...చివరకు చదువుమీద మనసు పోలేదు. అద్దంముందు కాస్సేపు కూర్చోవాలనిపించింది. చిదిపితే రక్తం వస్తుంది...తప్పదు... గొంతుకనుంచి నీరు దిగితే కనిపిస్తుంది! సంస్కారం ప్రతీ అందమైన కణంలోనూ, నిండిపోయిందని వుబ్బిపోతూ, గిరగిరా తిరుగుతూ, చప్పున నిల్చుని, భర్త గురించి రోజూ గర్వపడేటట్లే, పడుతూ; ఆవేళ

 

ఉదయం — పనిమనిషి... తను నవ్వకపోవటం... తనే నవ్వించటం... అంతా తలుచుకుని, ఆలోచించింది. "నవ్వమనేవరకూ, నవ్వారు కాదుకదూ? యీవేళ సాయంత్రం కాసేపు యేడిపిస్తాను ఏముంది యేడిపించటానికి? యేమన్నా చులకనగానే తీసుకుంటారే? సరైన ఉపాయం ఆలోచించాలి?"

ఆలోచించింది సాయంత్రం యెదురుచూస్తున్న భర్త వచ్చాడు. "మీ సంగతి తెలిసిందిలెండి?" అంది. భర్త ఒకసారిచూసి మళ్ళీ ముఖం త్రిప్పేశాడే గాని, జవాబీయలేదు. నాలుగైదు సార్లు నవ్వుతూ పదేపదే రెట్టిస్తే రెట్టిస్తే "కాపరానికి వచ్చి సంవత్సరమైనా, నా సంగతి యీవేళకా తెలుసుకున్నా" వన్నాడు. దీనికి వెంటనే జవాబు దొరక్క గింజుకుని, ఆ మరుసటిరోజు ఆఫీసుకు వెళ్ళేముందు మాటవరసకి "మీ సంగతి పూర్తిగా తెలిసిందంది."

"ఆ సంగ తేదో చెప్పాలనివుంటే చెప్పు" అన్నాడు.

"ఏమీ లేదూ..."

"ఏమీ లేకుండా యింత గొడవ చేసావెందుకు?"

"ఉంది... మీకూ .."

"ఊ! చెప్పు! సగంలో ఆపటం దేనికి?"

"మీకూ ... పనిమనిషికీ ... " అంటూనే ఫక్కున నవ్వేసింది.

వెంకటేశ్వరరావు ముఖం తిప్పేశాడు. నవ్వండి అంది. నవ్వలేదు. "నవ్వుతారా లేదా?" రెట్టించింది. బట్టలు వేసుకున్న భర్త వెళ్ళిపోతూంటే— "నిజం చెప్పేనా ? కనుకున్నాలెండి!" ఈసారేనా నవ్వుతూ "నీకేం మతిపోయిందా" అని భర్త అంటాడని అనుకుంది. ఆగినభర్త యేమాటా అనలేదు. నవ్వకుండా ప్రమీల "చూడండీ! నాదగ్గర దాపరికం చేస్తారా? నిజం చెప్తారా లేదా?"

భర్త వెళ్ళిపోతూ "నిజం" అన్నాడు.

గదిలో కూర్చుని మొదటిరాత్రి జరిగిన సంఘటన జ్ఞప్తికి తెచ్చుకుంది. భర్తగురించి తలుచుకున్నప్పుడల్లా, మిగతా మగవాళ్లు యేదో లోటున్నవాళ్ళగానే కన్పిస్తారు. "ముప్పయ్యేళ్ళవరకూ పెళ్ళి చేసుకోకండా, పవిత్రంగా ఉండే మొగాళ్ళెగాజుల్లో యేరీ? ఇంత అందగాడిమీద బలేకథ సృష్టించానే— యీకాకి వీధివెంబడివెళ్తే మొగాళ్ళు నమిలి మింగేస్తారా? — చెప్పుకోడానికైనా సిగ్గు పడిందికాదే? ఏ ఆఫ్రికా అడివిలోనో తిరగవలసిన మనిషి—పోనీ అందంలేదూ అంటే, ముఖానికి పౌడరేనా రాస్తుందా? నగలుగానీ ఒక మంచిబట్టగానీ వుందా?—సంస్కారం యేకోశానాలేని యీ అడివిమృగంమీద కథ బాగా అల్లానే—! ఆయన నిజం అని వప్పుకోవటంకూడా బాగానేవుంది బలే అబద్ధాలుకడి నన్ను యేడిపించాలని చూస్తున్నారు. ఇంత చదువూ చదివి, యీమాత్రం తెలుసుకోలేనా? తనకంటె హెచ్చు శాంతం చూపించగలను."

సాయంత్రం భర్త కాస్త ఆలస్యంగావచ్చాడు. డైనింగ్ టేబిల్ దగ్గర "ఉదయం వెళిపోయేటప్పుడు ఏమన్నారండి" అంది.

"నిజం అన్నాను."

"మీ అబద్ధం నిజం చేసేయగలను "

" నే అబద్ధంతాడే అవసరం ఏముంది?"

"అయితే దానికి మీకు నిజంగా ఉండంటారా?"

"అనవసరంగా నీదగ్గర గొంగుకు అబద్ధం ఆడాలి? నువ్వేగావు... నిజం చెప్పటం నాపద్ధతి!"

ప్రమీల ఆయనవైపు ఒక్కసారిచూసి ముఖం దించుతూ "మీరు నిజం చెప్పకపోతే......" వెంకటేశ్వరరావు సగంలో అడ్డుతూ "నిజం, నిజం... ముమ్మాటికి నిజం!..."

ఉద్వేగంతో ప్రమీల కస్సుమంది... "అబద్ధం... అబద్ధం! భర్త మాటాడలేదు. చెలించనూలేదు చప్పున లేచి నిల్చుని, "నిజం చెప్తారా లేదా?" భర్త మాటాడలేదు. దగరగావచ్చి భర్తను కుదుపుతూ "నన్నేడిపించకండి! నిజం చెప్పండి!"

"నిన్నేడిపించకండానే నిజం చెప్పానుకదూ? ఆమెకూ నాకు వుండేది . అదీ ఒక్కసారే !" ప్రమీల కళ్ళలో గిరగిరా నీరు తిరిగింది. చప్పున కుర్చీమీద కూర్చుంటూ, డైనింగ్ టేబిల్ మీద తల ఆన్చి, వెక్కి వెక్కి యేడుస్తోంది. భర్త అలా మీదికి చూస్తున్నాడు. ఒక పావుగంటవరకు మాటాడని మొగుడు, యింకా భార్య యేడవటంచూసి" చదువుకున్నావేమో? యీమాత్రం యెదుటివాళ్ల హృదయాన్ని అర్థంచేసుకోలేవా?" అన్నాడు. తలెత్తింది కాని భర్తవేపు చూడలేదు.

"అసలా, అర్థం చేసుకోటానికి ప్రయత్నమైనా చెయ్యవా?" అని ప్రశ్నించాడు.

ప్రమీల చెయ్యిచాచింది. "నా చేతిలో చెయ్యివేసి యిదంతా నిజం అని చెప్పండి" అంది.

"నేను నిజమే చెప్పాను. దీనివల్ల నీకు పూర్తి నమ్మకం కలుగుతుందంటే వేస్తాను. లేదా అంటే అనవసరం!"

ఆమె తలవూపింది. "ఇదంతా నిజం" అంటూ ఆమె చెయ్యిమీద చెయ్యి వేశాడు—ఇంకా ఆ చేతిని అలా వుంచాడు. ఆమె తన చేతిని చప్పున విసిరి, పక్కగదిలోకి పరుగెత్తింది.

తెల్లవారింది. ముఖం పాలిపోయినా, చూపు తీక్ష్ణంగా వుంది ఆ గది కదల్లేదు. భర్త మామూలుగా లేచాడు. కాఫీకి హోటలుకి వెళ్ళాడు. ఫ్లాస్కులో కాఫీ తెచ్చి భార్యయెదురుగా పెట్టి టూత్ బ్రష్, పేస్టు అందివ్వబోయాడు. ప్రమీల ముఖం యెత్తలేదు. తీసుకోమంటే, అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది ఆవేళ ఆఫీసుకి వెళ్లటం ఆలస్యంఅయింది. తను హోటల్లో భోంచేశాక, కేరియర్ మోసుక వచ్చి, యింట్లో పెట్టి, చెప్పి మరీ వెళ్ళాడు. ప్రమీల పెరటినుంచి గదిలోకి వచ్చేసరికి బీరువా తలుపులు బారుగా తెరచివున్నాయ్. అందులో పుస్తకాలు తనవేపు చూస్తున్నట్లనిపించింది. ఇంచుమించు ఆ పుస్తకాలన్నిటితోను తనకు పరిచయంవుంది. కొన్ని పుస్తకాలు రెండు మూడుసార్లుకూడా చదివింది భర్త యెందుకిలా తలుపు తెరిచాడో వూహించుకుంది. ఇందులో సగమేనా చదివితేనా తను, ఆమెను యెత్తిపొడవటానికి? ఆకలేస్తున్నా కాఫీతాగలేదు. —కూర్చో బుద్ధిపుట్టలేదు.—ఒక్కక్షణం అంతా తల్చుకుని యేడవాలనిపించింది. మరోక్షణం కన్నవారింటికి వెళ్ళిపోదామని—కొంతసేపయాక మొగుడితో యిక మాటలే ఆడనని—కొంతసేపు విసుక్కుంటూ, పరుపుమీద పడుతూ లేస్తూ, కూర్చోలేక నిల్చోలేక, బాధపడుతూ వుంటే, పనిమనిషి వచ్చి "ఏం అమ్మగారు—అలాగున్నారు?"

ప్రమీల తీక్ష్ణంగా చూసింది. "ఈ జాకెట్టు లేని అడివిదున్న—దానిమీదా ఆయనికి మోహం.? మళ్ళీ ఆ మొరటుమనిషి మోటుగా ప్రశ్నించింది. ప్రమీల వినలేక "పో" అని గసిరింది. పోతావా లేదా అన్న యజమానురాలివేపు వింతగా చూస్తూనే కదలలేక కదిలింది. తలుపు వేసి పరుపుమీదపడి "యింత మోసం చేస్తారనుకోలేదు — ఆయన్ని యింక యెప్పుడూ, యేవిషయంలోనూ నమ్మకూడదు."!—

తను తెచ్చిన కేరియర్, అలా నిండుగా అక్కడే వుండటం సాయంత్రం వచ్చిన భర్త చూసి, అప్పట్లో యేం అనలేదుకాని, ఆరాత్రి హోటలు నుంచి తెచ్చిన కేరియర్, డైనింగు టేబిలుమీద పెట్టి భార్యను రమ్మనమన్నాడు. ఆమె మాటాడలేదు.

"తిండిమానితే ఆలోచించే అవకాశం వుండ" దన్న భర్తకు గట్టి జవాబు యివ్వాలనుకొన్నా మాట్లాడటం యిష్టంలేక ఊరుకుంది. ఆయన భోజనం చేస్తున్నా తొంగి చూడలేదు. పడుకునేసమయానికి అన్నాడు. "ఇంకా అర్థం చేసుకోలేదా?"

కొరకొర ఒకసారి చూసి అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది. ఆమెకు వినిపించేటట్లు అన్నాడు. "నేనే అబద్ధం చెప్పుంటే?....

ఈప్రశ్న వేశాక రాత్రి వేసుకున్న పరుపుమీద మళ్ళీ మేనువాల్చి నిద్రపోయాడు. ఒంటిగంట రాత్రికి ఒకసారి తెలివివచ్చేసరికి చూశాడు. ప్రమీల ప్రక్క గదిలో అలానే ఒంటిగా సోఫామీద కూర్చుంది. దగ్గరగా టేబిల్ మీద లైటు వెలుగుతోంది. ఆమె ఏదో ఆలోచించుకున్నట్లున్నా భర్త దగ్గరగా రావటం గుర్తుపట్టక పోలేదు. కిటికీ తలుపు తీశాడు. 'రా' అని చెయ్యి పట్టుకున్నాడు. ఆమె చెయ్యి చిరాకుగా విడిపించుకుంది. కాస్సేపు యెదురుగా టేబిల్ కు ఆనుకొని నిల్చున్నాడు. ఎదరగా కిటికీగుండా వీధిలైటు వెలుగులో యెవరో నిల్చున్నట్లనిపించింది. ఎవరు? లెక్చరర్ ప్రసాదరావా? కిటికీ దగ్గరకువెళ్లి చూశాడు—ఆయనకాదు—రెండో ఆట సినీమాకు వెళ్లిన యెదురింటాయన — వాళ్ళయింటి తలుపు తట్టున్నాడు.—

ఇంతలోనే ప్రమీల ప్రక్కగదిలోకివెళ్ళి, పరుపుమీద బోర్లగా పడుకుంది. వెళ్ళి ప్రక్కన కూర్చున్నాడు. ఆమె మరి కాస్త దూరంగా జరిగిపోయింది. చాలాసేపటివరకు మౌనంగావున్న భర్త ఆమెవీపుమీద చెయ్యివేశాడు ప్రమీల ఏడుస్తూనే ఆపుకోడానికి ప్రయత్నిస్తోంది. ఆమె యేడుపు పూర్తిగా ఆగేవరకు ఊరుకుని, "ఇంకా నన్ను అర్థం చేసుకోలేదా?" అన్నాడు.

"చేసుకున్నాను. పూర్తిగా! ఉత్త నీతిలేని..." ఆమె గొంతుక పట్టేసింది.

వెంకటేశ్వరరావు అక్కడనుంచి లేచి తన మంచంమీదికి వెళ్ళిపోయాడు. ప్రయత్నించినా నిద్దరపట్టలేదు. ఏదో మాటాడాలని అనుకున్నా, మాటాడక లేచి, టేబిల్ మీద లైటు వెలిగించి, కొంతసేపు యేదో రాసుకున్నాడు. రాసుకొన్నది పైకి చదవటం మొదలుపెట్టాడు. "నాకు ఒకనితో పరిచయం వుంది. తల్లి తండ్రీ, నా అన్నవాళ్ళు లేక

కష్టపడి, నలుగురి దయాదాక్షిణ్యాలకు పాత్రుడై పెద్దవాడయ్యాడు. ఒక కంపెనీలో గుమాస్తాగా చేరి, స్వయంకృషివల్ల కొద్దికాలంలో అసిస్టెంటు మేనేజర్ అయ్యాడు. డబ్బుగురించి బాధపడ్డాడు గాబట్టి డబ్బు విలువ ఆయనకు తెలుసు. కష్టాలు అనుభవించిన మనసు—తను సుఖపడేటప్పుడైనా, యెదుటివాళ్ళ కష్టాలు వూహించడమే కాదు, తను అనుభవిస్తున్నట్లు బాధపడుతుంది. ఇంకా కొద్ది నెలలో తను మేనేజరవుతాడు. ఇప్పటికింకా తను ఒక ఆర్థిక అంతస్థులో వుండలేదు. మేనేజరయాకే పెళ్లి చేసుకొంటే ఆర్థికంగా చిక్కు పడకుండా వుంటాడు. ఈ బ్రహ్మచారి వెంట కొందరు ఆడవాళ్ళు పడ్డారు. నిగ్రహం చూపించాడు. మరే వుద్దేశంతో కాదు. వచ్చే భార్యదగ్గర తను నేరస్థుడుగా ఉండకూడదని,—ఒక నాడు—అతను గడిపిన పదివేల రోజుల్లో ఒక రోజు అది.—తన జీవితంలో జరిగిపోయిన గాథల్లో ఒక గాథ.—తెల్లారి కళ్ళు విప్పేసరికి రోజూ వచ్చే పనిమనిషి ముసలమ్మ కాదు—మనుమరాలు వచ్చింది. కలలోనైనా ఆమెను తాకుతా ననుకోలేదు.—కానీ ఆమె యిదివరకు చాలాసార్లు చూసిన చూపుగురించి, ఆలోచించాడు. ఆ బాధపడ్డ మనసును అర్థంచేసుకొన్నాడు. చలించే అవకాశం లేదుకానీ, సానుభూతి చూపించకండా వుండలేకపోయాడు! ఆ జాకెట్టు లేని మొరటుమనిషి—గది వూడుస్తూంటే—అదేవిటో ఆ నిముషం—ఆమె ఒక దేవతాస్త్రీలా కనిపించింది!—నరాలు వుబ్బి తబ్బిబ్బయాయ్.—అంతే తరవాత చాలా విచారించినా, మళ్ళీ యెందుకో మనసు తృప్తిచేసుకొన్నాడు! ఈ సంఘటనే ఆ కొద్దిరోజుల్లో పెళ్లి ప్రయత్నాలు చేయించింది."

చదివాక మళ్లీ యింకొకసారి, మెల్లగా ఆగి ఆగి చదివి, "ఆయనగూర్చి చెపుతూ నాగురించి చెప్పకున్నా ననిపిస్తోంది" అన్నాడు.

నిశ్శబ్దం. ఆలస్యంగా నిద్రపోయినా, మామూలుగానే తెలివ వచ్చింది. ఆఫీసుకు వెళ్ళేవరకు ఆమెలో యేమైనా మార్పు వచ్చిందేమో అని చూశాడు. నీతిని పరిపూర్ణంగా గౌరవించే భార్యలో మార్పు లేకపోవటంతో, ఆమె కూర్చున్న గదిలోనే యెదరగా వున్న టేబిల్ దగ్గర కూర్చుని కాగితం కలం తీశాడు.

వ్రాసిన కాగితంమీద వెయిట్ పెట్టి వెళ్లిపోయాడు. వెళ్ళాక యేంవ్రాసారో చూద్దామనుకున్నా, ఒళ్లుమండి చూడలేదు. ఇంతలో భర్త కేరియర్ మోసుకువచ్చి, మామూలుగానే గొంతుక మారకుండా, భోజనం చేసితీరాలి అని చెప్పి, ఆఫీసుకు వెళ్ళిపోయాడు. భోజనం చేసింది. ఇది ఆమెలో మార్పును సూచించటం కాదు. ఆకలి వేస్తోంది. ఈ భోజనం చేసేముందు, వూళ్ళో వున్న కన్నవారింటికి వెళ్ళిపోదామని అనుకున్నా, తను యింతగా అలంకరించిన యిల్లూ—యీ సోఫాలు—యీ అద్దంలా వున్న నేల—యీ [illegible]లు—యీ జోళ్లు—తను కదిలిన మరుక్షణంలో అన్నీ చిందరవందరైపోతాయ్! ఇంత అందగాడు—గెడ్డాం పెంచుతాడు—ఇప్పుడో—ఆమె బలవంతం చేస్తే—సూటు వెయ్యటం—నెక్ టై కట్టటం—అంటేంది—తను లేకపోతే, ఆఫీసుకు బనియన్‌తోనైనా వెళ్ళిపోతాడు!—

చాలాసేపు ఆలోచించే భోజనంచేసింది భోజనం చేసేటప్పుడు "ఉ! పెద్ద మేనేజరట! హోటలునుంచి నడిరోడ్డుమీద.. సిగ్గులేదూ? కేరియర్ మోసుకొని..." భోజనం చేస్తున్నంత సేపూ అసహ్యించుకొంటూనే వుంది. తరువాత చాలాసేపు తర్కించుకుని యేంవ్రాశారో అని తొంగిచూసింది! "ఇంతసేపు వ్రాసింది యింతే—అంతా నటన! నాకంటే హెచ్చు చదువుకోలేదు! తెలివితేటలతో నన్ను మోసపుచ్చరా మనుకుంటున్నారేమో?"

మళ్ళీ ఒకసారి ఉత్తరంవేపు చూచి ప్రతి అక్షరం చదివింది!

ప్రియమైన—

కొంద రాడవాళ్లు బలే తమాషాగా వుంటారు!

ఏం? మొగాళ్లో? ఆడవాళ్లేనా తమాషాగా వుండేది? కనిపిస్తోందిగా? భర్త వచ్చేవరకూ, జరిగింది నెమరు వేసుకొని, జరగబోయేది వూహించుకొంది.—నెయ్యివిధాలుగా ఆలోచించింది .....

భర్తవచ్చాడు. నీ వుత్తరం చూసే అవసరం నాకులేదని, ఆమె అనుకున్నట్లు, అతనికి తెలియాలని, ఆయన రాకముందే, ఆ గదిలోంచి వెళ్ళిపోయింది. వెంకటేశ్వరరావు వచ్చీరావటంతో, ఉత్తరంవేపుచూసి, తను అనుకున్నట్లుగా, భార్య వ్రాయకపోవటంతో, కలం తీశాడు. బట్టలుమార్చి బాత్ రూమ్‌కి వెళ్ళాడు. ప్రమీల ఆతురతగా మళ్ళీ యేంవ్రాశారో అని వచ్చిచూసింది. వ్రాసిన ఒక వాక్యం ఆయన కొట్టేశారు! నిజంగా.. తన ఆలోచన లన్నిటిమీద క్రాస్ మార్కులు పడాయ్!...

గదిలో కాలు పెట్టిన భర్త, "పనిమనిషివున్నా కాఫీ యెదరగావచ్చేది" అన్నాడు. భార్యకు దీనితో

ఒళ్లు మండిపోయింది. అంతతో వూరుకోక, చిరునవ్వుతో భార్య యెదురుగావెళ్లి, "మంచివాళ్ళనుకొనే ప్రతీవాళ్ళలోనూ, వాళ్ళకు కనిపించని చెదుగు వుండి తీరుతుంది. ఆ చెదుగు తెలుసుకొని, సరిదిద్దుకోకపోతే, వాళ్ళ మంచితనాన్ని ఆ చెదుగు వేగంగా కబళిస్తుంది!"—టేబిల్ మీద పుస్తకంవిప్పి చదువుతున్నట్లుగా, యీమాటలు జార్చాడు! ప్రమీలకు తెలుసు, యిది భర్తకూర్పని—ఆమెకంటే తను తెలివైనవాడినని నిరూపించాలనా తన వుబలాటం! తనకంటె ఆమె హెచ్చు చదువుకుంది.—ఆమె పుట్టి పెరిగింది పెద్దయింట్లో—ఆమె విసుక్కున్నా చూసి ఆనందించినవాళ్లు కాలేజీలోనే కాదు — బయట యెందరుండేవారు!—

భర్త ఉబలాటానికి మనసులోనే అసహ్యించుకొంది. వెంకటేశ్వరరావు, ఆరాత్రి పుస్తకం పట్టుకుని కూర్చున్నాడు. ఉండిఉండి తలెత్తి ప్రక్కగదివేపు చూస్తున్నాడు! రాత్రి పదైంది. వెన్నెల రాత్రేమో, వీధిలైట్లు ఆర్పేశారు. వస్తున్న మలయ మారుతం తన నేగో చలింపచేసింది. మెల్లగా లేచాడు. తన శరీరం పట్టుతప్పి, ఆమె దరిచేరుస్తున్నట్లనిపించింది. కానీ మళ్ళీ మనోనిగ్రహం తెచ్చుకొనే ప్రయత్నంలో కూర్చున్నా—"ప్రమీ!" అని పిలవకుండా వుండలేకపోయాడు. జబాబు లేకపోవటంతో మనసు చివుక్కుమన్నా, తమాయించుకొని లేచాడు. ఆ గదిలోకివెళ్లి, ఆమె ప్రక్కనకూర్చుని, "ఇంకా యెంతకాలం యీ కలహం!" అన్నాడు.

జవాబులేదు—

"కన్నవారింట్లో నేవుంటే, నాకింతగా బాధ వుండేదిగాదు!"

ఈమాటలు అన్నాక తన అనిశ్చలత స్ఫురించి, అక్కడనుంచి లేచిపోయాడు. ఆగది విడిచిపెట్టి మళ్ళీ మొదటిస్థలంలోకూర్చుని భార్య వస్తుందేమోనని చూశాడు.—

రెండుగంటలయింది—రాలేదు! ఆగదిలో అప్పుడు దీపం ఆరింది. ఈగదిలోనూ దీపం ఆర్పేశాడు. తెల్లారిలేచాక యెర్రగావున్నకళ్ళను మరింత యెరుపుచేద్దామనుకున్నా, ఒక అరగంట పోయాక, తను సహనాన్నివీడి, పొరపాటు చేస్తున్నానని బాధపడ్డాడు.

మళ్ళీ భార్యను మామూలుగా పలుకరించాడు—కాఫీ తెచ్చాడు. కేరియర్ తెచ్చి భోజనం చెయ్యమన్నాడు. ఆఫీసుకు వెళ్లేముందు ఉత్తరంకూడా వ్రాసేడు! ఆమె చదివింది!—

ప్రియమైన—

నాకు చాలా అందమైన భార్య వుంది. నాకు యీ విషయంలో గర్వంలేదు.—కాలేజీ చదువు—కావలిసినంత ప్రపంచజ్ఞానం, అన్ని హంగులున్నా, యీమె నిజం చెప్పిన భర్త నిజాయితీని, అర్థం చేసుకుంటుం దనుకున్నాను. కానీ యీమెతో నాకున్న సంవత్సరం పరిచయంతోనూ, ఒక విషయం నిర్ధారణగా తేలిపోయింది. ఏ అనుభూతినైనా అర్థంచేసుకుని అనుభవించలేదు..."

చదువుతూ చప్పున ఆగి "అతి తెలివి!!" అని వికటంగా నవ్వుకుంటూ మళ్ళీ దృష్టిపోనిచ్చింది.

"నా గడచిపోయిన గాథనుసరించి, యింత రాద్ధాంతం చేస్తోంది! ఆమె గడచిపోయిన గాథ నాకు తెలియదనుకుంటుందేమో?

ఇంక చదవలేదు. చదవటానికి యింకేమీ లేదు. నిప్పు నిమిష నిమిషానికి రాజుకపోతోంది. భర్త యింటికి వచ్చేసరికి మంటలు మీదికొచ్చాయ్!

"ఏం తెలుసు? నీలానే నేను నీతిలేకుండా, యెవరితోనూ పోలేదే? ఎందు కిలా రాశా?"

భర్త హఠాత్తుగా అడ్డి "పోయేవని యెవరన్నా"రన్నాడు.

"ఎవరా? ఏం రాశారో చూడండి!"

"నేనేం అబద్ధం రాయలేదే?"

"నిజమా? మీకిదంతా నిజమా?" అంటూ అరుస్తూనే ఆ వుత్తరాన్ని ముక్కలు ముక్కలుచేసి నేల వేసికొట్టింది. అక్కడనుంచి, చర్రున కదిలి పరుపుమీదపడి వెక్కి వెక్కి యేడుస్తోంది.

వెంకటేశ్వరరావు, మండే మంటలో ఆజ్యం పొయ్యదల్చుకోలేదు. మౌన జలంతో మంట నార్పుతున్నాడు. ఆ రాత్రి ఇద్దరూ భోజనం చెయ్యలేదు. ఆయన చిరిగిన వుత్తరాన్ని మళ్ళీ ఒక కాగితంమీద అంటించి జీవం పోశాడు. ఆ వుత్తరాన్నే ఆరాత్రి పొడిగించాడు!

"అవును. ఉత్తరం చింపేయటం సులభం—మళ్ళీ అతికటం కష్టం—అతికినా దాని అసలు రూపుపోయింది! త్వరపడి ఒక నిమిషంలో చూపించిన పౌరుషం, వల్లవచ్చిన, ఫలితాలు జీవితంమీద, యిలాంటి ప్రభావాన్నే చూపిస్తాయ్!

కాని ప్రపంచంలో అందరూ అల్పులైవుండరు. మానవులలో కొందరు ఉన్నత దృక్పథంతో వున్నారు కాబట్టే, యిలా చిరిగిన జీవితాలను అతుకుతూ, యీ ప్రపంచాన్ని నడిపిస్తున్నారు. వాళ్ల మెదడు, అంబరి మెరుపులా, ఆ పుణకలో నే యిమిడి వున్నా, అది ప్రపంచమంత విశాలంగా వుంటుంది. ఆ విశాలతలో, అవినీతికీ వాటి బంధువర్గానికీ, కూడా ఆశ్రయం దొరికి, వాటంతటికి అవే, మారిపోటానికి అవకాశం యిస్తుంది.

ఆ విశాలతే, యింత చదువుకున్న నా భార్యకు లేదని విచారిస్తుంటాను! ఆమె వచ్చిన యీ యేడాదిలో, యెదుటివాళ్ల ఒక తప్పుని విడిచిపెట్టకుండా, భూతద్దంలో పెట్టిచూచింది. ప్రపంచం బ్రద్దలైపోతున్నట్లు అరిచింది—బాధపడ్డది—ఈ లోకంలో యే మానవుడు యే కాలంలోనూ, పరిపూర్ణుడు కాలేడు. మంచి చెడ్డల కలయికే మానవుడు. వ్యక్తిలో చెడ్డనే తీసుకొని అట్టహాసం చెయ్యటం, సంస్కారం గల వాళ్ళ లక్షణం కాదు. దగాపడిన మానవుల తప్పులను యెత్తి గగ్గోలు చెయ్యటం కంటె, వాళ్ల బాధలను సానుభూతి చూపించి, వాళ్ల తప్పులను మన్నించాలి. ఇలా చెయ్యటానికి మనిషి ప్రేమమయుడుగా వుండాలి!

నా భార్యకు, నాకంటె హెచ్చు చదువుకున్నాననే గర్వం వుంది. ఆమెకంటే నేను గొప్పవాడనని నిరూపించాలని, నేను ప్రయత్నిస్తుంటానని, ఆమెకు అనుమానం వుందని, నాకు తెలుసు! నాకా ప్రయత్నంలేదు! కాని చదువుకున్నంత మాత్రాన, సంస్కారం అబ్బిపోదు. మనసు వికసించిన వాళ్ల సహవాసంవల్ల మనిషికి, అసలైన సంస్కారం అబ్బుతుంది. నాకటువంటివాళ్ల సహవాసం అబ్బిందంటే గొప్ప చెప్పుకోవటం కాదు!

ఇప్పుడు యింతకీ జరిగిందేమిటి? నా గడిచిపోయిన గాథను వివరించాను. నేను అబద్ధం ఆడితే నా భార్య మనసులో యిదివరలా "అందమైన ఉత్తముడు నా మొగుడు" అనే భావనగా వెలిగిపోతాను. నేను అబద్ధం ఆడి దూదిలా యెగిరిపోతాను. నిజం చెప్పాను. నా నిజాయితీలో పర్యవసానంతు ఆలోచించినట్లులేదు. ఆ గడిచిపోయిన గాథనుంచి నేను నీతిని నేర్చుకున్నాను. వెంటనే పెళ్లిచేసుకొన్నాను. లెక్చరరు ప్రసాదరావు ప్రేమగాథ యీమధ్య నాకు తెలిసింది. ఆయన యీనాటికి యీమె ముఖమైనా చూడాలనే ప్రయత్నంతో, యీ వీధివెంట రాత్రనక పగలనక తిరుగుతుంటాడు. ఆయనతో పరిచయం చేసుకున్నాను. సంస్కారం గల పెద్దమనిషి! ఆయన చేసినది ఒకే ఒక తప్పు— అందాన్ని, చూశాడేగాని ఆత్మని చూడలేదు. ఒక హృదయంలేని బొమ్మను ఆరాధించాడు—యిదివరకు యీయనగురించి నాభార్యతో యెన్నిసార్లో చెప్పాను — కాని ఒక్కసారైనా ఒక సానుభూతి వాక్యం పలకలేదు!

ఈ గడిచిపోయిన ఆమె గాథనుంచి ఆమె నేర్చుకున్నది యేమీలేదు. మానవులమనసులో రేగిన కల్లోలాన్ని అర్థంచేసుకొంటే కన్నీరు కార్చకపోయినా, అథవా ఒక సానుభూతివాక్యమైనా పలుకుతాం! ప్రసాదరావు ఆరాటాన్ని—ఈనాటివరకు బ్రహ్మచారిగా — బహుశా జీవితంలో అలా వుండిపోతాడేమో—? ఆ మనసుయొక్క మహా సంక్షోభాన్ని కొద్దిగనైనా వూహిస్తే—ఆమె ఆయనను భర్తలా చూడమని కాదు — అయ్యో పాపం—ఇంత బాధపడుతున్నాడే—యిదివరలా అరవకుండా... "క్షమించండి — మీ బాధ అర్థం చేసుకొన్నాను. కాని యీజన్మలో సానుభూతి తప్పించి యింకేమీ చెయ్యలేనని" చెప్పగలిగేది. — ఆ గాథనుంచి యీమె యేమీ నేర్చుకోలేదు. — నేర్చుకొనేవుంటే యీ నాలుగురోజుల్లో జరిగిన గాథను యింత పెద్ద కలహం చెయ్యకుండా యిట్టే పరిష్కారం చేసివుండును. పనిమనిషి యీమెలా అందకత్తె కాకపోవచ్చు— కాని తనలాంటి ఆడది. ప్రమీలనుచూస్తేనే మగవాళ్లు పిచ్చెత్తుతారు — అంచేత ఆమెకు మగవాళ్లగురించి ఆలోచనబాధలేదు — కానీ ఆమెకు — మగవాడి తలపే యెంతో హాయినిస్తుంది! అందులో ఒక అందగాడు అతని తొలివలపు తనమీద కురిపించాడంటే — ఆమె హృదయంలో శాశ్వతకాలం వెలిగే దీపం, ఆక్షణం వెలిగింపబడ్డది! అది తలచుకొని ఆమె బ్రతికి

నంతకాలం సంతోషిస్తుంది! ఈమాత్రం బాధపడుతున్న తోటిస్త్రీమీద సానుభూతి నాభార్యకు లేకపోయింది—

గడచిపోయినగాథలనుంచి నేర్చుకొని, మనిషి తన భవిష్యత్తును నిర్మించుకోకపోతే, మనిషికి పతనం తప్పదు—అలానే జరిగిన చరిత్రను మరచిన దేశం,—ప్రపంచం—పతనం కాక తప్పదు—! సంఘజీవులైన మానవులు చావుని జయించలేరు — అందుచేత వారు చనిపోయేటప్పుడు యేదో ఒకశక్తికి, యీ భూమిమీద గడిపిన యింతకాలంలో చేసిన మంచి చెడ్డలు విన్నవించవలసి వుంటుంది. ఆశక్తినే దేవుడందాం! ఆదేవుడు నా భార్యను చనిపోయేటప్పుడు "నువ్వు బతికినంతకాలం యేంచేశావ్" అని అడిగితే నా భార్యకు చెప్పటానికి "నాయిలు, నా మొగుడూ, నా పిల్లలు,—నా సోఫాలు—నా జార్జెట్ చీరలూ—నా నెక్ లేసులూ" అంతా నేను... నేను..." అని తప్పించి ఒకరికొక మేలు చేశాను, ఒకరి బాధలను పంచుకున్నాను" అని చెప్పగలదా?

ఈవేళనే నేనొక జబ్బుపడి, లేక ఏదో మహమ్మారికి లోనై అసహ్యంగా తయారైతే, ప్రసాదరావు గతే నాకూ పట్టుందని నాకు తెలుసు! నేను కాంక్షించింది నా భార్యదగ్గర లేదు—! నీ—"

ఉత్తరం పూర్తిచేసేసరికి రాత్రి రెండు గంటలయింది. ఉత్తరం మొదట్లో "ప్రియమైన" తరవాత "ప్రమీ" అని చేర్చాడు.

ఆ మరుసటిరోజు మౌనం దాల్చాడు. ఆ వుత్తరం ఆఫీసుకు వెళ్ళాక ప్రమీల చదివింది—మళ్ళీ మళ్ళీ చదివింది. రెండు రోజులైనా వెంకటేశ్వరరావు మౌనంగానే వున్నాడు. ఆమెకు ఆ ఉత్తరం కంఠస్థమైంది!

ఆమె పరిస్థితిలో మార్పు లేనట్టే వుంది.—భర్తను అర్థంచేసుకున్నట్లు అగుపించలేదు. ఏడుపూ లేదు—నవ్వూ లేదు—అలాంటివి యింకేమీ లేవు. ఉత్తరం రాసిన మూడో రాత్రి పదకొండు గంటలయింది.—వెంకటేశ్వరరావు పుస్తకం మూసి పక్కగదిలోకి వెళ్ళాడు. ప్రమీల తెలివితోనే వుంది. గడచిన మూడు రాత్రులనుంచి ఆమె నిద్దర సరిగా పోలేదు—భర్త ఆమెదగ్గరగా వస్తాడని అనుకోలేదు—వచ్చాడు పడుకొనగానే ఆమె శరీరమంతా ఒక్కసారి వణికింది. ఎత్తిన ముఖానికి భర్త చిరునగవు అవుపించటంతో, కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. ప్రక్కన కూర్చుని దగ్గరగా ఆమెను చేర్చుకుంటూంటే, పెల్లుబికిన దుఃఖంతో భర్త భుజంమీద వాలి, వెక్కి వెక్కి యేడ్చింది!

అతని హృదయం మాట్లాడటం విన్నది. ఇప్పుడు ఆమె కౌగిలిలో వున్నది అతని భౌతిక శరీరమే కాదు—మహత్తరమైన మరి యింకేదో!

# మరల ఎండాకాలము వచ్చింది!

...ఒళ్లంతా బా జిగటగాను, మలినముతోను యున్నట్లు ఉందా?












## లైఫ్‌బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల నుండి మిమ్ములను కాపాడును




L. 247-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

# ✻ నేటిసాహిత్యము ✻

## అపభ్రంశప్రయోగములు

### శ్రీ కురుగంటి సీతారామయ్య

నేటి సాహిత్యమనగా దాని ఎల్లలేవి? ఇవతలఎల్ల తెలియుగానే యున్నది. అది ఈదినము వెనుకటి ఎల్లయేది? గడచిన అర్ధశతాబ్ది అనుకున్నా? వీలులేదు. దాదాపు 1940 సంవత్సరమువరకు సాహిత్యమొక మార్గమునన నడచినది. తరువాత అది మార్గము కాదనియు, యావత్ప్రజానీకమునకు సులభముగా తెలిసి, దేశాభ్యుదయమునకు తోడ్పడుము, ప్రజలయొక్క కష్టనిష్ఠురములను చిత్రింపగలిగియే కావలయునను నభిప్రాయము బలవత్తరమైనది. దీనినే అభ్యుదయ సాహిత్యమనిరి. అప్పటినుండి యిప్పటివరకా మార్గము ప్రచారములో నున్నది. సాహిత్యశిరోమణి నాగభైరవ శివరామకృష్ణయ్యగారు తత్సాహిత్య స్వరూపమును నిర్ణయించిరి. తరువాత ఆ నిర్వచనము నెవ్వరును కాదనలేదు. దానిని అనువదించుట ప్రస్తుతము. "అభ్యుదయ రచన" అను గ్రంథమున వారిట్లనినారు.

"పద్యలక్షణాన్ని గాని, కావ్యలక్షణాన్ని గాని, రసపుష్టిని గాని, విసర్జించి యథేచ్ఛగా కావ్యరచన కొనసాగించమని నా ఆశయం కాదు. లక్షణాలూ, నియమాలూ, పూర్వకాలాన్నించీ మనదేశంలో వున్నవే! కాని భాషలోనూ, భావాల్లోనూ, రచనా పద్ధతిలోనూ, మాత్రమే నూతనపంథా అభ్యుదయ రాస్యులైన సామాన్య ప్రజలకుకూడా సాకల్యంగా తెలియజేయాలంటే సంస్కృతభూయిష్ఠమైన కవిత్వం, సమాసాలు మొదలైన పాండిత్యప్రకర్షను వ్యక్తపరిచేవిధానం పనికిరాదు. సులభంగా పామరజనులకు సహితము అర్థమయ్యేభాషలో వ్రాయబడి ఉండాలి. అంటే సరళభాషలో చిన్న పదాలలో అధికమైన భావమిమిడ్చి, సామాన్య ప్రజా ఉద్యమానికి, సామాన్య ప్రజాభివృద్ధికి, అవసరమయ్యే కవిత్వాన్నే కవితల్లజులంతా వ్రాయాలి. సర్వ జనులకు తెలిసే వ్యావహారికభాషలో సమాసరహితమైన శైలియు, గానాని కనుకూలమైన గేయాల్లో, ప్రజలకు కర్తవ్యజ్ఞానం విషయనివేదనం బోధించే పద్ధతిలో కవిత్వముండాలె. దీనినే అభ్యుదయ రచన అనండి." ఇక్కడికి అభ్యుదయరచనయొక్క నిర్వచన మైనది. ఇట్టిది నేటి సాహిత్యము. ఇంతకంటె మంచి నిర్వచన మింతవరకు వెలువడలేదని నా ఆశయము. వ్యావహారి కాంధ్రమహాభారత కర్తకూడ యీవిధముగా అన్నారు.

"మార్క్సు చెప్పినమేరకి సంపదమాత్రమే కాదు మన విజ్ఞానం, వాఙ్మయం, కూడా బహుళజనప్రాప్తం కావాలె. అది వ్యావహారిక భాషవల్లనే సాధ్యపడుతుంది." కాబట్టి రెండు పై అనువాదముల వలన నేటి సాహిత్యములో వాడబడుచున్న వ్యావహారికభాష మనకు ప్రస్తుతము [illegible]్యము. ఈ భాషలో నున్న అపభ్రంశ ప్రయోగములు ప్రస్తుత చర్చనీయాంశము.

ఈ సాహిత్యభావవస్తువులతో మనకు నిమిత్తములేదు. అపభ్రంశమనగా "అపశబ్దము" అనగా లాక్షణికులనిన చ్యుతసంస్కారము, అనగా వ్యాకరణదూష్యమైన ప్రయోగము. ఈ సందర్భమున యిరువురు రచయితల అభిప్రాయముల ననువదించుట అవసరము. ఎలన విషయము వ్యాకరణమునకు సంబంధించినది. వా రిరువురును వ్యాకరణముపై తమ అభిప్రాయమును తెలిపిరి. "మస్తిష్కంలో లెబొరేటరీ" అను గీతమున

"నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగడానికి వ్యాకరణసూత్రపు
కడీమేడ్ దుసులు లేక
దిసమొలల్తో ఉరుకుతూన్నాయి లో కానపడి-
దండించనా!"—అనినాడు కవి.

సరస్వతీభక్తుల్లారా అనే గీతంలో:

కైతకు లక్షణాలున్నాయి కోటాకోటి;
వీనిలో వ్యాకరణంకూడా ఒకటి;
మీకు దాని సూత్రాలే సర్వస్వం;
గొంతుకు పోసుకుని ప్రేలాడే సతతం,
చేస్తారు ఆక్రందన; అంటారు కవిత్వం;
కైతకు వ్యాకరణమే పరమావధి కాదు
అసలే కాదన్నాడు దాశరథి.

ఈ దాశరథి ఇంటికి వెనుక, అఇ ఉరికోలతో బులుక్కలతో కట్టిన వైయాకరణిసమాధి ఉన్నదట. (మస్తిష్కంలో లెబొరేటరీ)

మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు;
మీ రచనంతా వ్యాకరణం; మరేమీ కాదు.

పై రెండు వచనపద్యాలలో మొదటిదానిలో రచనాచమత్కృతి అయినను కలదు. రెండవదానిలో తిట్టు, ఆక్రందన తప్ప మరేమియు లేదు. అది నా కక్కరలేదు. ఇప్పుడు వ్యాకరణమే మనకు ప్రస్తుతము. ఇద్దరిలో మొదటికవి తన ఊహలు వ్యాకరణంలో యిమడవనినాడు. రెండవకవి కైతకు వ్యాకరణము పరమావధి కాదని దాశరథిగారితో ఏకీభవించినాడు. కాబట్టి వీరు బుద్ధిపూర్వకంగా వ్యాకరణ ముల్లంఘించి, ఆ ఉల్లంఘించుటను గొప్పగా చెప్పుకొనినారు. నేటి అభ్యుదయ కవులలో మేటయైన వారి చిత్తవృత్తి యిది. ఇతరుల మాట లిక చెప్పనేల? కావున ఈ విషయముపై ప్రసంగించుట గొంగడిలో తినుచు వెండ్రుకలు లెక్కించుటవంటిది. కాని విమర్శకుడు కక్ష చేయక విమర్శించుట విధి.

వీరికి వ్యావహారికభాష ఉపాదేయము. ఈ వ్యావహారిక భాషావాదమునకు శ్రీ. శ్రీ. గిడుగు వారు తండ్రి. ఆయన శిష్టవ్యవహారము నందరిచేత ఒప్పించినారు. ఈ తరమునకు వెనుకటి నవ్యకవులు కూడ వ్యావహారికభాష నంగీకరించినారు. నేనుకూడ దాని నంగీకరించి గ్రంథములను వ్రాసినాను. రానురాను వ్యావహారిక భాషాప్రయోగము చేయు కవులు తద్వాదమునకు తండ్రియైన శ్రీ గిడుగు వారికే మనస్తాపము కల్గించినారు. శ్రీ మల్లాదివారి మాటలు వినండి. "ఆధునికులు పెక్కండ్రు వ్రాసిన చిన్న చిన్న గ్రంథములు చదివి పంతులుగారు ఒకటి రెండు సందర్భములలో, ఇంత తెగబడి వ్రాయవలెనని నా ఉద్దేశ్యము కాదు. అయితే యిపు డెవరిని నిర్బంధించగలము. ఇది సంధికాలము. అని నాతో (అనగా మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారితో) చెప్పియున్నారు" అప్పుడే యిట్లున్న యిప్పుడున్న పరిస్థితులను చూచి పంతులుగారెంత విలపించి యుందురో! ప్రకృతమునకు వత్తును.

ఇప్పుడీ అపభ్రంశ ప్రయోగములు రెండు భాగములుగా నున్నవి ఒకటి సంస్కృతమునందలివి. రెండు తెలుగునందలివి. వ్యావహారికముగా మార్చినపుడు [illegible] తెనుగులోని పదములను మార్చుట రచయితల యిష్టము కాని సంస్కృత పదములను మార్చుటకు రచయితల కేమి యధికారము కలదు? కాబట్టి తద్భవముల నటుంచి తత్సమముల కున్నవాని రూపములున్నట్లు వాడుట రచయితల విధి. తెలిసి బుద్ధిపూర్వకముగ కొంత, కొంత భాషాజ్ఞాన శూన్యత వలనను ఇది కల్గుచున్నది. కొన్ని ఉదాహరణములు

"ఆలిశ్యం" అని ఒక రచయిత వాడినాడు. "అలసస్య భావః ఆలస్యం" అని వ్యుత్పత్తి. ‘ఇత్వ’ మన్యాయముగా రూపమునందు చేరినది; తుదివర్ణము ‘స’ కారముకాని ‘శ’ కారము కాదు. "పరీక్ష"కు "పరిక్ష" అని వాడుచున్నారు. ‘ఉషోబాల’ అను గీతములో రచయిత ‘ ’ అని వ్రాసినాడు "స" "ష"గా యెప్పుడు మారునో యితనికి తెలియలేదు. ఇతను వేదభాషను సంస్కరించినాడు. "హే ఉషా, హే ఉషా" యని యనేకమార్లు వాడినాడు. సకారాంత నపుంసకలింగ శబ్దమునకు సంబోధన యెట్లుండునో యితనికి తెలియదు. ఉబలాటమున్న ‘ఓ ఉషస్సా’ అని వాడవచ్చునే. "కక్షీవంతుడు"ను బుషిని "కక్షీవంతుని"గా చేసినాడు. "కక్షీవంతం యజేశజం" అనిశ్రుతి. ఈ రచయితయే "కృషియింప" అని వ్రాసినాడు. "అవల" అను గీతములో రచయిత "ప్రత్యహ పరివర్తనలే" అన్నాడు. ‘అహస్’ శబ్దరూప మితనికి తెలియదు. "నటరాట్టు" అను గీతములో కర్త "అట్టహాస్యము" అని వాడి శివుని హాస్యమాడించినాడు. "బతుకు కీలుకు" అనుదానిలో "రక్తపాయ శార్దూలం" అనినాడు రచయిత. "నయాజమానా"లో "శ్రమాభిన్న విశ్వాసాల స్నపిత స్వేద ఝురీవారి వియత్తల సువిశాలాక్షి ఆర్ద్రహృదయ వీక్షణాలై" అనినాడు కవి. ఇది ఆయన వ్యావహారికము. ఇది పాఠకులకే వదులుచున్నాను. ఈ గీతములో యిట్టి భాషారత్నము లనేకము లున్నవి. "సముద్రఘోష"లో "దూర గగనారామసంచర వారివాహము" అని కవి వ్రాసినాడు.

"సంచరించుచున్న మేఘము" అనుట కెట్లు తెలుపవలెనో యితనికి తెలియదు. "నాన్యః పంథా"

అనుగీతములో "జనతాగళి" అని యున్నది. "ద్విగు సమాసము" చేసినాడనుకొందును కవి. "వీరేశలింగం" అను గీతములో "మానవమాతృడు" అనినాడు రచయిత. "మాతృడు" అని కొబ్బోలు కవిహృదయము. స్థాలీపులాకన్యాయముగా మాత్రమే కొన్ని చూపినాను. ఇట్టివి పరస్సహస్రముగా నున్నవి. మనకు సాధువని నిశ్చయముగా తెలియని శబ్దమునుగాని, అర్థము నిశ్చయముగా తెలియని శబ్దమునుగాని వాడుట మంచిది గాదు. ఆ శబ్దమును గుప్తముగా వాడుటచేత ఉద్దేశితభావము రాకపోవుటయే గాక, ప్రతికూలత్వము కూడ ఏర్పడును. సంస్కృత శబ్దముల గతి యిది. మిశ్రమసమాసములను గూర్చి రెండుమాటలను చెప్పెదను ఇవి మన కలవాటైన వెనుకటివానివలెనే వీనిని గూడ సహించగలమని యొక వాదము. "యోగాద్వయ" మునకు బదులుకూడ "తోడద్వయ" మని యెందులకు వాడకూడదని యొక మిత్రుడు నన్ను ప్రశ్నించినాడు. "బహుమంచి" మొదలగునవి వాడుకలో నున్నవి. కాని తప్పువాడుకను మన మెందుకు గ్రహింపవలెను? ఈ క్రింది కొన్ని యట్టిసమాసములను చూడుడు.

"శరత్ వెన్నెల" "విగతం తరణమాత్ర వైతరణి" అనుగీతమున; శీర్షికయే అయోమయము. "సెగపిండాలు" "మృతసందేశము" అనుగీతమున.

"అగ్నిపిండాలు" అనవచ్చునే.

"విషకత్తెర"—"హిరోషిమా" అను గీతములో

"తనుబరువు" "నవభవనం" అను గీతములో.

ఇవియు మచ్చునకు చూపినాను. ఇట్టివి పరశ్శతము లున్నవి. ద్వంద్వసమాస విషయమున "తల్లీ తండ్రులు" (విశ్వగీతి) గమనింపవలసిన ప్రయోగము. ఇక తెనుగునకు వత్తును. తెనుగుభాషలోని అపభ్రంశ ప్రయోగముల నీ క్రిందివిధముగా వర్గీకరణము చేయవచ్చును. అవ్యాప్తి అతివ్యాప్తి దోషములున్నను మొత్తముపై నీవర్గీకరణము సరిపోవునని నా ఆశయము.

(1) నామవిభక్తి ప్రత్యయములు (2) క్రియావిభక్తిప్రత్యయములు (3) శబ్దస్వరూపములు (4) క్రొవడి (5) అవ్యయములు (6) సర్వనామములు (7) వ్యతిరేకార్థకములు (8) దుస్సంధులు (9) అసహజములు. వీనిలో కొన్ని యుదాహరణల నిత్తును. ప్రథమావిభక్తిప్రత్యయము "ము" వీరికి కంటకము. అట్టివానినన్నిటిని "ం"తో నంతమొందించుట వీరి పరిపాటి. "దేశం, మధురం, భీభత్సం, లోకం, సముభావం, పరం" ఇట్టివి కోట్లు. ఏపుటనైనను చూడుడు. ఇట్టివి అధమము 10 గానైనను కన్పట్టును. "ము" ప్రత్యయమును చేర్చిన సామాన్య ప్రజలకు తెలియదనియో లేక తప్పనియో వీరి యభిప్రాయము.

ఉచ్చారణసౌలభ్యమని అపభ్రంశమును వాడుట తగునా? మరియు మనది యాజంతభాష. ఇచ్చట నొక ప్రశ్న వచ్చును. వ్యాకరణము నుల్లంఘించి యుచ్చారణవద్దకు పోవుదమా? లేక యుచ్చారణను వ్యాకరణమువద్దకు కొంపోవుదమా? ఒకవేళ "కవి" చెప్పినట్టు తమ భావముల కీ వ్యాకరణ మడ్డు వచ్చిన యెడల మరియొకమాట. ఎచ్చటను అట్టి యడ్డు రాదనియే చెప్పవచ్చును. వ్యాకరణ దుష్టసమాసములు విపరీతార్థముల నియ్యవా? అప్పు డుద్దేశిత భావమెట్లు వ్యక్తమైనది? ఇక ద్వితీయావిభక్తి. "ఉషనిగాంచి" అనినారు ఉషోబాలకర్త. అకారముతర్వాత ఉత్వమున కున్న సహజత్వము "ఇత్వమునకు లేదు." రచయితను ఉచ్చారణమున తన "యాస్యప్రయత్నమును" దర్పణమున చూచుకొనుమని మనవి. "మానవుణ్ణి" "దేవుణ్ణి" అని వాడుట పరిపాటి అయిపోయినది. "ణ్ణి" లో లాఘవమున్నదో "ని" లో లాఘవమున్నదో రచయితలను ప్రశ్నించుచున్నాను. వ్యావహారిక ఆంధ్రమహాభారతకర్త యీ ద్వితీయారూపముల నసంఖ్యాకములుగా వాడినాడు. "ధామ్యుని" అని వాడిన కొంపమునిగినదా? షష్ఠీవిభక్తి వచ్చినప్పుడు మిక్కిలి విచారము కల్గును. "నీడకి" (ఇన్ ఖిలాబ్ అనేగీతంలో); "పేడివాళ్ళకి" (ఒక్కటి ఓ చెలియా లో); "అడుగడుక్కి" (కిరణశకలంలో); "ఉత్తరకి" (వ్యావహారిక ఆంధ్రమహాభారతము); "రాజుకి" (దానిలోనే); "భీష్మద్రోణులికి" "కర్ణదుర్యోధనులికి" (దానిలోనే). ఇట్టివి లెక్కకు మిక్కిలిగా నున్నవి... పై వానిలో "భీష్మద్రోణులికి; "కర్ణదుర్యోధనులికి" అను ప్రయోగములవంటివి విచిత్రములు. 'కి' షష్ఠి వ్రాయుటకై వెనుకటి వర్ణమును ఇత్వాంతమును చేసినాడు రచయిత. దీనిని అపభ్రంశాపభ్రంశ మనదగును. బుద్ధిపూర్వకముగా ఒక తప్పునకు రెండు తప్పులను చేయుట తగదు. "లకు" అని వ్రాసిన "బహుళ జనప్రాప్తము" కాదా? సప్తమీవిభక్తిగతికూడ యిట్లేయున్నది. "మంటల్లో" ("బగువు బండిలో" రచయిత.) "మంటలలో" నన్న కొంపమునుగునా? బహువచనమున "ండ్లు"కు మారుగా "ళ్లు" ఉపయోగించుచున్నారు. "కళ్లు" మొదలైనవి. "నీళ్లు"కు బదులుగా "నీరు" సులభము కాదా? క్రియావిభక్తిప్రత్యయములనుకూడ స్పృశింతును. వర్తమానకాలమున "తోంది" "స్తూంది" "స్తోంది" "తూంది"

మొదలైనవి వాడుచున్నారు. ఒకరే వివిధరూపములను వాడుట కద్దు. "స్తున్నది" "తున్నది" అని వాడుట సులభము కాదా? మరియు ఏదియో యొక్క రూపము నందరును వాడుట లాఘవము కదా? శబ్దస్వరూపముల పాడుచేయుటను చూపింతును.

'దెయ్యాల" (మస్తిష్కంలో లేబొరేటరీ); "ఉన్నాది" (దానిలోనే); "త్రావాళ" (వ్యా. మహాభారతము); "పెందలేడే" (గోదావరి పొంగింది); "త్రలకిందు" (పాముపాట); "త్రవక" (చెణుకులు); "కుమ్మరవాము" (నీవూ నేనూ కలిసి); "కాస్త" (తొమ్మిదితో కుమ్మా); "బైర్దేరారు" (వ్యా. ఆం. మహాభారతము); "బయల్దేరితే" (దానిలోనే గమనించదగినది). ఈ విధముగా లెక్కలేదు. దయ్యము, ఉన్నది, ఆవేళ, పెందలకడ, అలకించు, కాక, కుమ్మర అవము, కొంచెము లేక కాస్త, బయలుదేరి, మొదలైనవి బహుళజన ప్రాప్తములు కావా? వీరి భావముల నిముడ్చుకొనలేవా? దుష్ప్రయోగము లే వీరి భావములకు తగునా? వ్యాకరణమును మాత్రమే వలదని యివి యుపయుక్తములా? ఇక క్రొవడి యున్నచోట పెట్టకుండుట. "పక్కలో, రాస్తే, మోయలేని, బతకడమే, తాగే, కుంకేసింది; కిందికి" మొదలైనవి అసంఖ్యాకములు. మరల నీ శబ్దములే కొన్ని స్థలములలో క్రొవడితో నుపయోగింపబడినవి. "వినకండా, తినకండా, లేకండా, తెలీని" మొదలైన వ్యతిరేకార్థములు, "చూడవోయ్, నమ్మతావ్, పెత్తనదార్" మొదలైన అర్ధాక్షరరూపములు, "సుమీకి" "స్త్రీ, లా, లాగా, లాగు, మొదలైన అవ్యయములు". వినిపిస్తూవున్నవి, ఘోషిస్తున్నవి, కళ్ళముందు ఎపుడు, లేములు ఎక్కడివి, మొదలైన అసహజ విసంధులు, "కోటాకొట్టి, దింపడనా" మొదలైన దుస్సంధులు, ఇవీ అవీ యేమి, యిట్టి యపభ్రంశములు లెక్కింపరానివి యున్నవి. ధూర్జటి మొదలైన మహాకవులు కొందరు వాడినా రిట్టి ప్రయోగములను. కాని యది సాకుగా బుద్ధిపూర్వకముగా నెల్లచోట్ల నపభ్రంశములను వ్రాయుట తగదు. అపభ్రంశములను వ్రాసినారే గాని సామాన్యజనులకు సులభగ్రాహ్య మగునట్లు వ్రాసినారా? కొన్ని గేయము లస్పష్టాగములకే కష్టమును కలుగజేయును. వ్యావహారికమని దుష్ప్రయోగములను చేయుట పాడిగాదు. మాండలికము లన్నియు భాషలోనికి రావలసినదే! కాని వాటి నన్నిటిని సార్వదేశికములుగా చేయుట యత్నింపదగినది. వ్యాకరణ సూత్రముల ప్రయోగముల ప్రకారము మా భావము లిముడక దిసమొలలతో తిరుగుచున్న వనుట సాహసము, అతిశయోక్తి. వ్యాకరణము తప్ప అన్నియు మా రచనలో ఉన్న వనుట దుస్సాహసము. ఉదాత్తభావమును దుర్భాషలో చెప్పుట రాజును గాడిదమీద ఊరేగించుట వంటిది. సంస్కృతాంగ్లములు రాని ప్రజానీకమున కివి యుద్దేశించిన ట్లగపడవు. ఈ గీతములు కూడ తమ తృప్తికిని మిత్రుల మన్ననలకును, విద్యార్థుల చప్పట్లకును వ్రాసినట్లు కనపడును. 'ఇది వ్యావహారికం *With vengeance* గా ఉంది', అనినా డొక మిత్రుడు. దానివలన సాధించిన ప్రయోజనమును కానరాదు. తుద కొక అనువాదముతో దీనిని ముగింతును:

"The care of the language, is at all times a sacred trust and the most important privilege of the members of a society. Every man of Education should make it object of his unceasing concern to preserve his language, pure and simple, to speak it so far as in his power in all its beauty and perfection. A nation whose language becomes rude and barbarous, must be on the brink of barbarism in regard to everything else. A nation which allows her language to ruin is parting with the best half of her intellectual independence and testifies her willingness to cease to exist."

నాటిక:

# * అస్థిపంజరం *

శ్రీ మంథా వెంకటరమణారావు

## : రంగం 1 :

డాక్టర్ రామారావు ఇల్లు; డ్రాయింగు రూము; గది నాలుగు మూలలా నాలుగు సోఫాలు—సోఫాలకి తెల్లటిగుడ్డలు పైన; మధ్యని గుండ్రటి టేబిలు—దాని మీద తెల్లటిగుడ్డ; ప్రతి సోఫాదగ్గర చిన్న 'స్టూలు', మీదని తెల్లగుడ్డ—'ఆష్ ట్రే'; గది కింకే అలంకారం లేదు—కిటికీలకి తెల్లటి కర్టెన్లు - కర్టెన్లు ప్రక్కకి లాగిఉన్నాయి. గోడలకి ఏ పటాలూ లేవు - గదిలో చెప్పుకోదగ్గ వస్తువు లింకేమీ లేవు. కాని-ఒక్కటి—గది కుడిమూలను ఆరడుగుల ఎత్తున ఒక కప్ర కేసు. కేసురంగు నలుపు; ముందు అద్దపు తలుపు. తలుపుగుండా కానవస్తూ ఒక మానవుడి అస్థిపంజరం.

తెర లేచేసరికి గదిలో యెవ్వరూ లేరు.

[డాక్టర్ వెంకటాచలం ప్రవేశం; వయస్సు దాదాపు ముప్ఫై ఉండొచ్చు. బూడిదరంగు 'సూట్లు'—ఎర్ర 'నెక్ టై'—వెనుక నింకా కొంత మంది ఉన్నట్టు గోల వినిపిస్తూఉంటుంది]

వెంకటాచలం: (ప్రవేశిస్తూనే ఉలిక్కిపడి వెనుక కొక అడుగు వేసి) బాప్రే!!

[ప్రవేశం: డాక్టర్ సుధాకర్—వయస్సు 30 సం||; డాక్టర్ కృష్ణమూర్తి—వయస్సు 32 సం||; డాక్టర్ రామలింగం—వయస్సు 50 సం||]

ముగ్గురూ: { మై గాడ్! / ఓ! / ఇదేమిటి!

(ముగ్గురూ వెనక్కి తగ్గి, తిరిగి సర్దుకొని గదిలో ప్రవేశిస్తారు)

రామలింగం: అస్థిపంజరం!

(సర్దుకొని మామూలుగా) ఔను—అస్థిపంజరం.

సుధాకర్: ఇదెందు కిక్కడుంది?

కృష్ణ: అది రామారావు నే అడగండి—

రామలింగం: నాకు చాలా వింతగా వుంది. డ్రాయింగ్ రూమ్‌లో వెక్కిరిస్తున్నట్టు ఇదేమిటి? (నవ్వుతాడు)

వెంక: డ్రాయింగ్ రూమే కాదు—పోనీ హాస్పిటల్‌లో నన్నా దీని అవసరం ఏముందీ అని?

సుధాకర్: ఇలా కాలు పెట్టగానే గుండెమీద ఒక్క వేటు వేసినట్టయింది.

కృష్ణ: ఏమిటి డాక్టర్! భయమే? (పకపక నవ్వుతాడు)

సుధా: అస్థిపంజరం చూసి భయమేమిటి? ఇప్పటి కప్పుడే డజను 'పోస్ట్ మారమ్' లన్నా చేసి ఉంటాను సర్వీసులో ప్రవేశించేక—కాని, అనుకోకుండా, ఉండరానిచోట ఒక వికారమైన వస్తువు ఉండడం నిజంగా ఒక షాకులాటిదే—

(నలుగురూ వెళ్లి సోఫాలలో కూర్చుంటారు)

వెంక: ఇంతకీ రామలింగంగారే ధైర్యవంతులు! ఆయనా ఒక అడుగు వెనక్కి వేసినా దాన్ని చూసి ఒక చిరునవ్వు పారేశారు—

రా. లిం: నే నెందు కన్న మాట అనకపోవాలి? నేనే నే పరీక్షలూ ప్యాస్ కాలేదు! నాజన్మకి ఒక్కటే పరీక్ష పాసయ్యేను. అది కాంపౌండర్ పరీక్ష. అదీ మూడోసారి వెళ్ళి, చెయ్యవల్సిన బందోబస్తులన్నీ చేశాక మరీను...

కృష్ణ: మీ రన్నట్టు గవర్నమెంటులో కొన్నాళ్లు పని చేసేరనుకుంటాను?

రా. లిం: ఏదో అలాటిదే—బోర్డు సర్వీసు — కొండల్లోకి తోసేసేరు...ఆ పరీక్ష కోసమే అందులో అలా పడిగాపులు పడి ఉండడం అయింది.

కృష్ణ: కాంపౌండరీ పాస్ అవకుండానే ఉద్యోగం దొరికిందీ మీకు?

రా.లిం: ప్యాస్ అయితే ఆ కొండలు, అందులో బోర్డు నౌకరీ ఏంకర్మ? కొంత అనుభవం ఉండేది ఒక ప్రయివేటు డాక్టర్ క్రింద—వాళ్ళకి ఎవడో ఒక మనిషి కాంపౌండరన్న పేరుతో ఆ కొండల్లోకి వెళ్తే చాలన్నట్టుగా ఉండేవారు...అదే అదృష్టం అనుకోండి—నాలుగేళ్ళయాక అనుభవం ఉంది, పరీక్షకి వెళ్ళొచ్చన్నారు. అన్నేళ్లు అనుభవం ఉన్నా మూడుసార్లు వెళ్తే కాని నెగ్గలేదు... అలా అని చేతకాక కాదు! ఈ పరీక్షలూ, చెత్తా, నాకు పడవ్.

వెంక: మీరు కొన్నాళ్లు మన రామారావు తండ్రిగారి దగ్గర పని చేసేరు కదూ?

రా. లిం: అయ్యో! అదే గొప్ప అనుభవం! మళ్లా పని చేసింది నాలుగేళ్లే. పరీక్ష ఎలానో గట్టెక్కేక ఆ కొండల్లో నౌఖరీ కొక దండం పెట్టి ఇక్కడికొచ్చి చేరేను......ఆయన నిజంగా దేముడే అనుకోండి. ఎంత దయ...ఎంత దైవభక్తి!! పూజలో కూర్చుంటే ఉదయం రెండు గంటలు, సాయంత్రం రెండు గంటలు...అలా ఆ భగవంతుడిలో లీనం అయిపోయేవారు...

సుధా: ఇంతకీ ఏదో చెప్పబోయేరు...

రా. లిం: అదే ఒస్తున్నా ... ఆ నాలుగేళ్ళూ అయిపోయేక శుభ్రంగా ప్రాక్టీసు పెట్టేశాను... అది నిజంగా తెగింపేననుకోండి! చెప్పేదేమంటే ... నేను ఏమీ ఆపరేషన్లు చెయ్యలేదు, పోస్ట్ మార్టమ్‌లు అంతకన్నా చెయ్యలేదు ... మీరా అస్థిపంజరాన్ని చూసి వెనక్కి తగ్గేరంటే నాకు నిజంగా నవ్వొస్తోంది...

వెంక: మీ కేమన్నా అనుభవజ్ఞులు...ఇక మా మాటంటారా......నిన్న కాక మొన్న కళ్లు విప్పుతున్నాం!

రా.లిం: (నవ్వుతూ) ఏమిటో ఈ ముసలాడ్ని చూస్తే మీకు నవ్వులాటగా వుంటుంది!...అనుభవం అంటారా...నిజమే......నేను చూసినన్ని రకాల కేసులు...మీ కింకో ఐదేళ్ళో, పదేళ్ళో పట్టొచ్చు. ఒక కేసు...నాకు బాగా జ్ఞాపకం...ఆ కొండల్లో...

సుధా: ఇంతకీ మన్నందర్నీ బెదరగొడదామని పెట్టినట్టుంది ఈ డాక్టరివన్నీ డ్రాయింగు రూములో...

కృష్ణ: ఇంతకీ రామారావ్ ఏడీ?...అందర్నీ 'టీ'కి రమ్మని, పోయి ఎక్కడ దాగున్నాడు...... ఏదన్నా కేసంటూ పోయాడా?......ఏం మనిషో! ఇప్పటికి నాకు బోధపడలేదతని ధోరణి...

[నౌకరు ప్రవేశం]

నౌకరు: బాబుగారు బట్టలేసుకుంటున్నారు... ఐదునిముషాల్లో వచ్చేస్తామని చెప్పమన్నారు...

(నౌకరు వెళ్తాడు)

కృష్ణ: సరే...ఐదు కాదు ఇరవై నిముషాలన్నా ఉండాలి...ఒచ్చేక మరి పోగలమా? కొత్త ఇంట్లో నే దిగనీండి...మరేమన్నా కానీండి...'టీ' ఇస్తున్నాడు అది ముఖ్యం మనకి!

వెంక: నేనుమాత్రం మరో అరగంటకన్న ఎక్కువ ఉండలేను...

కృష్ణ: ఏం ప్రాక్టీసే?

వెంక: నువ్వు నిజంగా అదృష్టవంతుడివి. చెప్పకోవద్దూ? రోజల్లా తీరిక...ఒచ్చిన అయిదుగురో, ఆరుగురో 'పేషెంట్లు' ఒగంట పని...

కృష్ణ: అదృష్టం! చాలా గొప్ప అదృష్టం... నలుగురు పిల్లలు... పెళ్ళాం...ఒక ముసలి తండ్రి... కాంపౌండరొకడు...ఒక నౌకరు...వీళ్ళు కాక చాకలాడు...మంగలాడు ... వీళ్ళంతానూ...వీళ్ళందర్నీ పోషించాలి ... అవతల 'కామర్స్'కి దెబ్బ లేకుండా చూసుకోవాలి.. అంటే మార్కెట్ పడిపోకుండా చూడాలి...పరిశ్రమలను ప్రోత్సహించాలి...

వెంక: ఏమిటిదంతా? చాలా పెద్దమాటలు ఉపయోగిస్తున్నావ్!

కృష్ణ: కాదూ మరి? పెళ్ళానికొక ఫేస్ పౌడర్ డబ్బా — తలలకి నూనె — నాకు టూత్ పేస్టు — జోడుకి పాలిష్ — మరి బట్టలవాడూ, బట్టలు కొనక పోతే ఊరుకుంటాడా ? నెలకి ఒక జతైనా తియ్యాలా ? సినీమా కొక నాలుగుసార్లు అవమం

వెళ్ళకపోతే ఆ కళని మరెలా పోషించడం? ఇవన్నీ వచ్చే రెండువందలలోనూ సరిపెట్టాలి.

రామ: (ఆశ్చర్యపోయి) రెండువందలేనా?!!

వెంక: (నమ్మలేక) ఏం డాక్టర్ రెండువందలేనా ప్రాక్టీసు!!!

...ధాకర్... నే నమ్మను!!

కృష్ణ: ఊరకనే కూర్చోవటం అదృష్టం అని నువ్వే అన్నావ్ చలం.

వెంక: ఉత్తినే అన్నా కాని ఇంత తక్కువా? మాదగ్గర దాస్తున్నావేమో; ఎంత తక్కువైనా ఐదు వందలకి తగ్గ దెవ్వడికీ ... అందులో ఈ మలేరియా జాగాలో....

కృష్ణ: చెప్పేది విను ... మీకూ నాకూ డబ్బు ఆర్జనలో ఎంత భేదం ఉందో, ఆర్జించేవిధానంలో కూడా అంత భేదం ఉంది ... విశ్రాంతి అంటే నాకు మొదటి నుంచీ ఇష్టం...

వెంక: మాకు మాత్రం ఇష్టం లేదూ? సాయంత్రం నాలుగునుంచీ, రాత్రి, మధ్యాహ్నం ఇవంతా విశ్రాంతి కాదూ? ఈ సమయంలో పీకలమీదికేసు వచ్చినా కదల్లమే!

కృష్ణ: అదుగో! అదే నాకిష్టం లేదు. ఒక కేసు ప్రత్యేక రాత్రి కాదు, పగలు కాదు నేను లక్ష్యం చెయ్యను...కాని నేను విశ్రాంతిప్రియుణ్ణి—కనీసం పగలు ఆరుగంటల 'రెస్టు,' రాత్రి 'డిస్టర్బెన్సు' ఉండదన్న హామీ, ఇవి ఉంటే చాలు...అందుకే సీరియస్ కేసులు మొదటికే నేను పట్టను...అలాటి కేసులు నా దగ్గరకి రావు కూడా...పైగా నా పేషెంట్లంతా తెలివైనవాళ్లు...చాలా తెలివైనవాళ్లు...

సుధా: ఏమిటో ఆ సర్టిఫికేటు!

వెంక: మనకుగురించి డాక్టర్ సర్టిఫికేటు... డబ్బు పుచ్చుకోకుండా పారేస్తున్నావ్...ఇలా నే రావల్సిన డబ్బు రాదు...(నవ్వుతాడు)

కృష్ణ: తెలివైన వాళ్లేలా అంటారా? నన్ను చూస్తే వాళ్లకా తెలివి వస్తుందేమో మరి! పోనీ అలా ఎంచుకనాలి...ఇప్పుడు మీరు...జ్వరం వచ్చిందంటే డైఫార్టిక్ మిక్స్చరో, క్వినైన్ మిక్స్చరో, ఆల్కలైన్ మిక్స్చరో ఇస్తారు...మీరు ఒద్దనేవరకూ పేషెంటు పుచ్చుకోవాలి... డోసుకి బేడా పరకా ముక్కు పిండి పుచ్చుకుంటారు...

[illegible] అయ్యేవ్ కాని మమ్మల్ని మాత్రం నిందచెయ్యకు!

కృష్ణ: మిమ్మల్నేమీ అనలేదోయి తండ్రీ! అలా విరుచుకుపడకు...మీకైతే బేడా పరకే కాని, నేను మూడణాలు పుచ్చుకుంటాను డోసుకి...

సుధా: అయితే మరింకేం? తడవే లేదు.

కృష్ణ: అదే చెప్పబోతున్నాను. పెద్ద పెద్ద సంస్థలు—మే ఎండ్ బేకర్, బెంగాల్ ఫార్మాస్యూటికల్స్, గ్లాస్గో లేబొరేటొరీస్, ఇవన్నీ అందరికోసం అమోఘమైన మందులు చేసిఉంచుతే మన మిక్స్చర్లెందుకు? కొంచం జలుబు, చిన్న తలనొప్పి అయితే ఎనాసిన్...జ్వరం ఒస్తే వజ్రంలాటి మందులున్నాయి...అన్నీ మాత్రలు...ఎటాబ్రిన్...కాకపోతే క్వినాక్విన్ వేసుకో...డిసెంట్రీ అయితే సల్ఫాగ్వానడైన్...ల్యాకొరసన్, ఎంబెక్విన్... కార్బర్సన్ క్వినాల్ ఏదో ఒకటి కొనుక్కొని మింగి...ఇంకా క్రానిక్ అయితే 'ఎమెటిన్' తెచ్చుకో, ఇంజక్షన్లు పొడిచేస్తాను... గాస్ట్రిక్ నొప్పి అయితే అల్డ్రాక్స్ ఉంది, పెప్సిన్ ఉంది...టైఫాయిడ్ అయితే క్లోరోమిసిటిన్ కొనేసి వేసేసుకోవడం...ఇంక బలం లేదూ అంటే ఏవిటమినో రాసేస్తే బజారుకిపోయి కొనుక్కోడమే తరవాయి...ఇంత సదుపాయం ఉంటూ ఉంటే నేను మిక్స్చర్లు కలపడం ఎప్పుడు? ఎలా? చిన్నస్లిప్పు తీసి మందు పేరు రాసి ఇచ్చేస్తాను...

రా. లిం: కృష్ణమూర్తిగారూ! మీరు త్త అమాయకుల్లా ఉన్నారు...నాది పాతికేళ్ళ అనుభవం... మీకు చెప్తున్నాను వినండి!

కృష్ణ: నేను చెప్పేది వినండి మొదట...ఒకటి రెండుసార్లు నాదగ్గర కొచ్చిన పేషెంటు మూడోసారి మరి రాడు...

వెంక: ఏం? అదంతా నీ ప్రావీణ్యతే! (నవ్వుతాడు) అంత హాడలగొట్టేస్తావన్నమాట!

కృష్ణ: హాడలు కాదు. వాళ్లంతా తెలివైనవాళ్ళని చెప్పేనుగా... ఇప్పుడు నీకే గాస్ట్రిక్ కంప్లేంటు ఉందనుకో... నాదగ్గరి కొచ్చేవ్... 'అల్డ్రాక్స్' అని రాసిఇస్తాను...మళ్లా ఇంకోసారి వస్తావ్ ఆనొప్పికే...అదే రెండుమూడు సీసాలు వాడండి అని అంటాను...వాడతావ్..తగ్గిపోతుంది.. మళ్లా ఆరునెలల తరవాత, నీ అపత్యంవల్ల అదే రకం నొప్పివస్తే నా దగ్గరకు నువ్వెందుకు రావటం? బజా[illegible] వాడిన మందు కొనేసుకుంటావ్... తెగిపోయింది. నీ జబ్బు నీకు

తెల్సు...దానిమందు నీకు తెల్సు...సరిపోయిందా? అలా!

సుధా: ఇలా అయితే ప్రాక్టీసు వెలిగినట్టే! మిక్చర్సు కొకపోయినా, 'కన్సల్టింగ్'కన్నా ఫీజు పుచ్చుకుంటున్నావా?

కృష్ణ: అది ఈ ప్రాంతంలో నేను ప్రవేశ పెట్టాలి కొత్తగా...అదే అయితే ఉన్న పేరూ, ఈ పాటి ప్రాక్టీసు కూడా ఉండేవు!

రా. లిం: నాది పాతికేళ్ళ అనుభవం! ఇందాక చెప్పేను...ఇప్పుడు చెప్తున్నాను...వినండి! మనలో మన మాట కొబట్టి ముక్కుకి సూటిగా ఉన్నదున్నట్టు చెప్తున్నాను... ఇది మీ కొక విధంగా సలహా కింద వస్తుంది...... ఇంద్రజాలికుడూ, డాక్టరూ ఒకే తరగతిలో కొస్తారు ...ఐంద్రజాలికుణ్ణి చూసి మనం ఎంత ఆశ్చర్య పడతాం! కలలో కూడా నమ్మలేని గమ్మత్తులన్నీ చెయ్యగలడు. మనిషిని నరకడం, నాలిక కోసీడం... నీటిలో నిప్పు పుట్టించడం...ఇలాటివన్నీ...మన కంటికి కనిపించేది నమ్ముతాం...అది మానవ సైజం. ఏం? కాదంటారా...అయితే ఈ ఐంద్రజాలికుడు... నీటిలో నిప్పు పుట్టిస్తానంటాడు...పుట్టిస్తాడు...... వాడు అనడం—మనం చూడడం జరుగతాయి... నిప్పెలా పుట్టిందో వాడు చెప్పడు...మనకి తెలీదు.. అదే తెలుస్తే దానికి విలువ లేదు! అలానే మన వృత్తి కూడా. ఇలా అంటున్నానని ఏమీ అనుకోకండి... ఎవరికన్నా ఆక్షేపణ ఉంటే చెప్పండి...నా సలహా మానేస్తాను...

కృష్ణ: మనం అంతా ఇక్కడున్నవాళ్ళం డాక్టర్లమేగా...కానీండి...

రా. లిం: ఇప్పుడు బాగా కడుపునొప్పితో ఒక మనిషి ఒచ్చేడనుకోండి. అతనికి కావల్సిం దేమిటి? ఆ నొప్పి పోవడం. నేనంటాను...మీ నొప్పి పోతుంది...ఇది మింగండి—అని. అతను మింగు తాడు...నొప్పి పోతుంది...కాని మనం ఇచ్చింది బూడిదో, మందో కూడా అతని కక్కర్లేదు ఇంద్రజాలం...మీరెంత పుచ్చుకుంటారో నేనూ అంతే పుచ్చుకుంటాను...మీ మందు లెంత పని చేసాయో, నా మందులూ అంతే పని చేస్తాయి . మీకన్నా నాకొచ్చే ఆదాయం ఎక్కువ!

కృష్ణ: ఏదో మీ మందు లంటున్నా మీరు మందులు ఇంట్లో కాని తయారు చేస్తారా ఏం?

వెంక: ఏవన్నా స్పెషల్ మందులు వాడ తారా?

సుధా: ఏవో మాకూ చెప్పనుహూ.... .మేం కూడా...

రా. లిం: చెప్పేనేక మీ కెవ్వరికీ నా విధానం నచ్చదు సరే...వినండి...... నేను మూడు రకాల మందుల్లో వైద్యం చేస్తాను...హోమియోపతీ, ఎలో పతీ, డీషేన్ మందులు...

ముగ్గురూ: (ఆశ్చర్యంగా) ఏమిటీ!!

రామ: అంతలా ఆశ్చర్యపడకండి...ఈ డీషేన్ మందులు అమోఘంగా పని చేస్తున్నాయి. చవక— నా ప్రాక్టీసు చాలా మట్టుకు అదే. ఉత్త గుండెలు... తేనెతో కాని, పాలతో కాని కలిపి ...బస్. అయి పోయింది! నేనూ డోసుకి బేడా పరకా పుచ్చుకుం టాను...ఇంకా లాంగదూ అంటే అప్పుడు మన క్వినైనూ అవీ ఎలాగూ ఉన్నాయి...నాకు నెలకు ఎంత ప్రాక్టీసుందో మీరు ఊహించేరా?

వెంక: మీరు చెప్పే విధానైతే మీకు అయిదు వందలకి తగ్గదు...

సుధా: మీరంతగా ఏవో వింతగా ఆ ప్రశ్న మామీద విసిరేరు కొబట్టి ఆరు వందలకి తగ్గదు, ఎచ్చదు...

కృష్ణ: మీదగ్గరి కొచ్చిన పేషెంట్లంతా మేకల మందయిఉంటారు. బుర్రలు ఉపయోగించకుండా ...మీరే గమ్మత్తులు చెస్తున్నారో కూడా వాళ్ళ కక్కర్లేదు...డబ్బున్నవాళ్ళంతా అలాటి పేషెంట్లే ...చదువూ సంస్కారం లేనివాళ్లూ అలాటి వాళ్లే... ఎటుకొచ్చీ, డబ్బులేని, కాస్త చదువుకొని ఉన్న వాడే తెలివైనవాడు...వచ్చేసారి ఈ ఖర్చు లేకుండా చేసుకుందామన్న ఆలోచనమీద ఉంటాడు...... తక్కినవాళ్లంతా మేకలమంద...

వెంక: వోయి డాక్టర్!

సుధా: డాక్టర్! ఆయన్ని!...

రా. లిం: ఫరవాలేదు—కానీయండి...

కృష్ణ: అందుకు మీ ప్రాక్టీసు వెయ్యి రూపా యిలు ఏవరేజ్ ని వేసేసేను...ఏమంటారు?

వెంక: వెయ్యి రూపాయలా!

సుధా: మీ ప్రాక్టీసా...ఇంపాసిబిల్!

రా. లిం: సరిగ్గా చెప్పేరు క[illegible] గారూ! సరే మీ అందరికీ ఆశ్చర్యంగా ఉంటుంది. నేనూ

మీలా నే విశ్రాంతిప్రియుణ్ణే! మనం అంతా సాయంత్రం టెన్నీస్ కి పోతాంకదా... నాలుగునుంచి అది—నా నిద్ర కుంభకర్ణుడి నిద్ర... రాత్రి నిద్ర పోతే పేషెంటొచ్చి తలుపు విరక్కొట్టినంత పని చేసినా, ఇంటిమీద రాళ్లు రువ్వినా తెలివి రాదు... తక్కినవాళ్ళకి తెలివొచ్చినా లేపకూడదని నా ఆర్డర్లు... ఇంక ఉదయం ఎనిమిదికి వెళ్తాను హాస్పిటల్ కి... పదకొండునుంచి రెండు వరకూ విశ్రాంతి ...ఏ కేసు చూసినా ఈ ముఖ్యనే... ఎలా ఉందంటారు?

సుధా: మీ మాటలు నేను నమ్మాలనుకుంటాను.. కాని నాకు నిజంగా చాలా ఆశ్చర్యం వేసింది... నాకు గవర్నమెంటువారు మూడువందలు పారేస్తారు. పూర్తిగా దానిమీదనే బతకలేం కద!... ఇది సర్వీసులో ఉన్న అందరం చేస్తున్నదే.... లేకపోతే ఇద్దరు పిల్లలచదువు... ఇద్దరూ మెడిసినే చదువుతూంట... ఇంట్లో ఖర్చు ఇదంతా ఎలా నెగ్గుకొస్తున్నాను... ఎంత కష్టపడ్డా అది రెండువందలకి మించదు... పై ప్రాక్టీసు... గవర్నమెంటు నౌకర్లంతా మెడికల్ సర్టిఫికెట్ కి నా దగ్గరికే రావాలనుకోండి... ఎన్ని చూసుకున్నా...

రా. లిం: నేనూ కాంపౌండర్ గా పనిచేసేను కాబట్టి, మీ రింటోలా అనుకోకపోతే... మందులకి మీకంత ఖర్చు ఉండదనుకుంటాను.... కొన్ని కొన్ని ఇంజక్షన్లు... ముఖ్యమైన పౌడర్లు ఇవ్వన్నీ వాళ్లే...

సుధా: (కొంచం ముఖం చిన్నదిచేసుకొని చికాకుగా) ఆఁ... ఆ రోజులు పోయేయి... వాళ్ళూ ఏమీ ముఖ్యమైన మందులు సప్లయి చెయ్యటం లేదు..

రా. లిం: అదికాకుండా డైట్ బిల్సులో బాగా నొక్కెయొచ్చు... అది అందరికీ తెల్సిందే... ఇంకోలా అనుకోకండి!

వెంక: మీ రసాధ్యుల్లా న్నారండోయి రామలింగం గారూ!

రా. లిం: ఏమన్నా మీకన్న అనుభవం ఉండంటూరా లేదంటారా? లేకపోతే కాంపౌండరుగా పని చేసి ఈ స్థితి కెలా ఒచ్చేను...

సుధా: ఆఁ... అంతా అనుకోడమే... అంతా కలుపుకొని మూడువందలకి మించదు మరెందుకు దాచాలి...

వెంక: నా దెంతయినా ఎనిమిది అంకెకి ఎక్కదు... ఐదుకి తగ్గదు... పైకి నాది డాబుజాస్తీ... ఉన్న డబ్బంతా ఊడ్చి ఆమేడ కట్టించి, ఊరుకోక ఆ కారుకి తగలేసేను... దాని ఫలితం... ఇన్ కమ్ టాక్సు పీక మొయ్యా పడిపోయింది.. చచ్చినట్టు, నోరు మూసుకు కట్టేసేనుమరి.. లోగుట్టు ఎవరికీ తెలీదు... ఈ మధ్యని డోసు మూడణాలు చేద్దామా అని తటపటాయించేను... కాని భయం... ఉన్నదానికే మోసం వస్తుందేమోనని ... యుద్ధంరోజుల్లో క్వినైన్ దొరకనప్పుడు డోసు ఖరీదు ఎక్కువచేసేం ... ఇప్పుడు అదే ఉంటోందంటే అందుకే సంతోషించాలేమొ! కాని రామలింగం గారూ ... మీకేం కర్మండీ? అద్దె కొంప ... డొక్కు కారు ... దానికొబ్బంబట్టి చెప్పేయొచ్చు మైలుదూరంలో మీరున్నారనగానే ... మీ డ్రయివరుకూడా ఎప్పుడూ నల్లమందు భాయిలా ఉంటాడు!

రా. లిం: (నవ్వుతూ) నా ముందనకండా మాట! మా డ్రయివరు ముందసలే! ఇంక నా కారు సంగతా... కొత్తదికొని లాభం ఏమిటి? మీరు కారుకొని, ఇల్లు కట్టి ఏం బాగుపడ్డారు? ఇన్కమ్టాక్సు! అదికాక నాదంతా ప్రయివేటు ప్రాక్టీసవ్వడంగుకు చాలా ప్రయివేటుగా అయిపోతుంది ... అలా ఉండనివ్వరూ... నాకు అప్పుడప్పుడు కొ కారు కొనాలనే ఉంటుంది... కొంటానుకూడాను... నేను తల్చుకుంటే నిమిషంలో పని ... కాస్త సాయంత్రం టెన్నీసు, మధ్యాహ్నం నిద్ర తగ్గించి పనిలో కూర్చుంటే, మీరు క్షమిస్తే,— మీ ప్రాక్టీసు కొంత నా చేతికింద కొచ్చేయడానికి ఆటంకం ఉండదేమొ!

వెంక: నా పేషెంట్లు నాకు నికరం. ఇంకెవరి దగ్గరికీ వెళ్లరు ... అంతగా అయితే డోసు ఖరీదు తగ్గించేస్తాను...

రా. లి. తగ్గింపుకి మీకన్న నా కెక్కువ అవకాశంఉంది... నా మందులు మొదటికే బైరాగి చిటికలాటివి... చవక!

కృష్ణ: కొంచం ఆగండి ... మీలో మీకంత ఘర్షణవద్దు ... (నవ్వుతూ) నేను తలచుకుంటే మీ అందరి ప్రాక్టీసూ పడగొట్టగలను ... ఒక్క రామానిది తప్పించి.

రా: లిం. మా అందరి ప్రాక్టీసూనా? అసంభవం

కృష్ణ: ఈ ఊళ్ళో అందరికీ తెల్సు... నేను కేసు మొదటికే పట్టుగోనని... పట్టుకుంటే రాత్రి పగలు అనకుండా పనిచేస్తానని... కాని అలా పనిచెయ్యడం నా కిష్టంలేదు ... నేనే దాని కిష్టపడితే మీ దగ్గరి కెవడొస్తాడు?

వెంక: ఎందుకీ పొల్లుమాటలన్నీ...ఆ సంగతి మరెత్తకండి. ఇప్పుడు రామలింగంగారికి విశ్రాంతి అక్కర్లేదా—కాలంకూడా మళ్ళింది...నీ కక్కర్లేదా...అసలే నీకు గుండె జబ్బు!

కృష్ణ: (బాధగానూ, విచారంగానూ ముఖం పెట్టి) ఔను! గుండె జబ్బు!

రా. లిం. మీకు గుండె జబ్బా!

సుధా: ఏమిటి డాక్టర్! ఆశ్చర్యం!

వెంక: ఔను పాపం—కృష్ణమూర్తికి గుండె జబ్బే. రామారావు ట్రీట్ చేస్తున్నాడు...

రామ: } నిజంగా?
సుధా: }

కృష్ణ: (చిన్న గొంతుతో) ఔను! నిజమే!

వెం: ఇప్పుడు చేసిన పనికన్న ఎక్కువ పని చేసినా, అనవసరంగా ఉద్రేకపడ్డా ఒక సంవత్సరం కన్న లాభంలేదన్నాడు. పాపం...

సుధా: నమ్మండి! నా కిప్పటివరకూ తెలీదు! అసలు మీ వంక చూ... నా కనుమానం వేసేది..

రామ: అయ్యయ్యో! ఎంతపని! నే నప్పుడే అనుమాన పడ్డాను కొంచం ఇలాటిదే ఏదో ...డాలని.. అడగడానికి కాస్త జంకే నసే చెప్పాలి... ఒక సంవత్సరంకూడా చాలా జాగర్తగానే ఉండాలయితే...

కృష్ణ: మీ కందరికీ దయఉంది...నిజమే...ఖాలిపడగలరు...ఈమాత్రం విశ్రాంతి ఉంటే నాలు గేళ్ళవరకూ బాధ లేదన్నాడు రామం!

రామ: అయితే ఇంకేం? రామారావుగారు ఇందులో స్పెషలిస్టు...ఆయనమాటకి తిరుగులేదు...

వెం: అయితే ఇంకేమోయి! ఏ బెంగా లేకుండా హాయిగా ఉండు.

సుధా: మరింక బాధలేదు...నాలుగేళ్లమాట...

ఔను—నాలుగేళ్లమాట — బాగానే ఉంది. ఒక ప్రశ్న వేస్తాను చెప్పండి. నేను పోయేక నా పెళ్ళాం, పిల్లలూ ఒక్క దమ్మిడీ కూడా లేకుండా ఉండిపోతారు. నేను చిల్లిగవ్వకూడా నిల వెయ్యలేదు...కారణం, ఇప్పుడు చేస్తున్న పనికన్న ఎక్కువపని చెయ్యడానికి అవకాశంలేక — ఈ గుండె జబ్బువల్ల; మీరంతా ఎంతో కొంత నిలవేసే ఉంటారు...రామారావు తప్పకుండా ఒప్పుకుంటాడు...మీరంతా చందా ఎత్తి నా సంసారం నిలబెట్టాలి నేను పోయేక—

వెంక: చందా ఎత్తా? అవేం మాటలు కృష్ణమూర్తి!

రా. లిం: అవేం మాటలూ!

సుధా: హారిబుల్! ఏం మాటలు!

కృష్ణ: చెప్పేది వినండి—చందా ఇస్తే చాలు! నాకేం చిన్నతనం లేదు—పరిస్థితి అలా వచ్చింది మీరంతా రెండేసి నెలలమీద మీ ప్రాక్టీసుకొచ్చే డబ్బు, నాసంసారానికిస్తే అంతకన్న నేను కోరుకొనే దింకొటిలేదు. ఆ డబ్బుతో నా పిల్లలు పెద్దవాళ్ళై ఏదో ఉపాధి సంపాదించుకోనేందుకు సరిపోతుంది. ఏం?

రా. లిం: (మెల్లిగా) నా రెండు నెలల ప్రాక్టీసు.. అంటే రెండు వేలు!

వెంక: నిజమేకాని...నాలుగేళ్ళ మాట కదా!

సుధా: ఈమధ్యని ఏమన్నా కూడెయ్యడానికి అవకాశం ఉంటుందేమో!

కృష్ణ: నేను నాలుగేళ్లు బతకాలంటే లేదు. ఇప్పుడే నేను నిర్ణయించుకోవాలి ఏమంటారు? ఒప్పుకుంటే ఇప్పుడు మీ రెంత నెలకి ఆర్జిస్తున్నారో, రెండు నెలలది, రేపే నా భార్యపేర బ్యాంక్‌లో వేస్తే నాకింక ఏచింతా ఉండదు!

రామ: కాని కృష్ణమూర్తిగారూ...

వెంక: నువ్వేదో ఊరికే ఎక్సయిటయిపోకు... ఒంటికి మంచిదికాదు...ఆ ఆలోచనే మానెయ్.

కృష్ణ: (నిట్టూర్చి) సరే—మీ అభిప్రాయం బోధపడ్డాది....అయితే నేనింక ఇవాళనించీ రాత్రీ పగలు పనిచేస్తాను...మీ ప్రాక్టీసు చాలామట్టుకు నా కొస్తుంది. నాకు తెలుసు. ఒక్క సంవత్సరమే బతకాలి మరి. నెలకి రెండు వేలు చొప్పున సంవత్సరంపాటు—సగం ఖర్చులకి పోయినా...ఓ ఫరవా లేదు. నా పెళ్ళాం పిల్లలికీ పూచీ ఉండదు! తరువాత ఇంక నిశ్చింతగా కళ్లు మూసెయ్యొచ్చు!

[రామారావు ప్రవేశం—వయస్సు 30 సం॥ కాని మనిషి పాతికేళ్లికన్నా ఎక్కువ ఉన్నట్టు కనిపించడు. చామనచాయ - బలమైన శరీరం - చురుకైన కళ్లు ముఖాన్ని ఆకర్షణీయంగా చేశాయి— సూది ముక్కు—ఒంటిమీద ఇప్పుడున్న బట్టలు తెల్లటివి—]

రామారావు: (ప్రవేశిస్తూనే) నమస్తే! అందరికీ. ఆలస్యం అయింది క్షమించాలి...

అంతా లేచి: కంగ్రేచులేషన్స్!

వెంక: కొత్త ఇంట్లో దిగినందుకు...

రా. లిం: కొత్త హాస్పిటలు—కొత్త ఇల్లు... అంతకన్న ఇంకేం అదృష్టం కావాలి!

రామారావు: (సంతోషంతో) నాకు చాలా సంతోషంగావుంది—మాట తీసెయ్యకుండా అంతా వచ్చినందుకు. పని వదిలేసి మరీని...

వెంక: మరేమీ ఫరవాలేదు...పన్ల కేవిటి ఎప్పుడూ వుండేవే—

రా. లిం: ఒకగంటమాత్రానికి ఏమంత బెంగ... ఏ కేసన్నా ఆపాటసేపు వేచిఉండగలను...

సుధా: నా కివాళ మధ్యాహ్నం సెలవ్. తీరు బాటే.

కృష్ణ: నా కిప్పటివరకూ తీరుబాటే కాని మరింక లేదు. నువ్వు నన్ను క్షమించాలి రామం! నే నింకొక పది నిముషాలకన్న ఎక్కువ ఉండలేను.

రామారావు: (కృష్ణమూర్తి ప్రక్కన కూర్చుంటూ) అంటే? నాకేం అర్థం కావటంలేదు.

వెంక: ఊరకనే ఎక్సైటయిపోతున్నాడు మనిషి ఇందాకట్నించీ! నువ్వన్నా చెప్తూ బాబూ!

రా. లిం: ఊరకనే అలా బెంగ పెట్టుకుని ఆరోగ్యంపాడుచేసుకోకండి కృష్ణమూర్తిగారూ!

రామారావు: ఏమిటిదంతా కృష్ణమూర్తీ! బెంగ దేనికి? నీకుం డెసురించేనా? నీకు నాలుగేళ్లవరకూ ఫరవాలేదోయి, ఈమాత్రం విశ్రాంతిఉంటే!

కృష్ణ: లాభంలేదు రామం. అంతా దయ చూపెట్టేవాళ్లేకాని...నిజానికి...

రామా: ఇప్పుడేమొచ్చింది?

కృష్ణ: ఈమాత్రం విశ్రాంతి తీసుకుంటే నాకు నెలకి రెండువందలకన్న ఎక్కువ రాదు ఖర్చువగా ఇక్కడా, అక్కడా అప్పుకూడా అవుతోంది. నాలుగేళ్ళతరవాత నేనుపోయాక నా పెళ్లాం పిల్లలగతి?

రామారావు: మేమంతా ఏమయేమంటావ్?

కృష్ణ: అదే నేనూ అన్నాను. మీరంతా ఉన్నారు... నాకిప్పుడు మాటలవల్ల లాభం లేదు. నెలకి మీకందరికీ పైడబ్బు నాభార్యపేర బ్యాంక్‌లో వేస్తే నాకు నిశ్చింతగా ఉంటుంది...అదే ఇందాక అన్నాను. కాని దయ, మాటలతో ఆగిపోయింది.

రామారావు: తప్పకుండా కృష్ణమూర్తీ! అంతా సాయంచేస్తాం ..నీకా బెంగ వద్దు.

వెంక: కాని రామారావ్ ఊరకనే అతనలా ఎక్సైటయిపోతూఉంటే నువ్వు మరింతప్రోత్సాహం చెయ్యకు. నేను చెప్తున్నాను కృష్ణమూరి పదేళ్లు బ్రతుకుతాడు!

రా. లిం: సరిగా చెప్పేరు చలంగారూ! నే నింకో ఐదే ళ్లెక్కువ వేస్తాను. పదిహేనేళ్ళవరకూ మీకు బాధలేదు కృష్ణమూర్తిగారూ! ఇంకా మీరు కుర్రాళ్లు. ఏ గుండెజబ్బు మిమ్మల్నేం చేస్తుందండీ?

సుధా: నేనైతే మీకు గ్యారంటీ రాసిస్తాను. ధైర్యంగా ఉండండి! అంతేచాలు.

రామారావు: (మెల్లిగా) మరా సంగతి ఎత్తకు. అంతా వెళ్ళిపోయేక మాట్లాడుకుందాం. (పైకి గట్టిగా) నేనూ పొరపాటుపడితే పడుండొచ్చు. ఫరవాలేదోయి గుండెజబ్బుతో తొంభైయేళ్లు బతికినవాళ్లున్నారు. ఏ నిమిషమో అనుకుంటూ—మరాసంగతే మరిచిపో—

(నౌకరు ప్రవేశం, ట్రేతో; ట్రేలో ప్లేట్లు—వాటిలో కేకుముక్కలు, బిస్కట్లు—ఎవరి ప్లేటు వాళ్లకందించి వెళ్లిపోతాడు)

వెంక: ఇంకా కొన్ని ఇళ్లు కట్టించాలని నా కోరిక...

(తింటాడు)

రా. లిం: రామారావుగారి ఆయుష్షుకోరుతూ! డాక్టరుకోరే దదే! నేనుకోరే దదే ప్రతిఒక్కడికీ—కాని ఆరోగ్యంమాటమాత్రం ఎత్తను...అందరూ ఆరోగ్యంగా ఉంటే మరి మనం ఎందుకు?

(తింటాడు)

సుధా: (వేదాంతిలా) మనం అనుకున్నంత మాత్రాన ఏదీ అయిపోదు!

(తింటాడు)

కృష్ణ: అన్నివిధాలా నీ అభివృద్ధిని కోరుతూ.

(తింటాడు—నౌకరు మరొక ట్రేతో ప్రవేశిస్తాడు—ట్రేలో 'టీ' కప్పులు—అందరికీ 'టీ' అందించి వెళ్తాడు)

రా. లిం: గది ప్రవేశించగానే మీ అస్థిపంజరాన్ని చూసి ఒక్కఅడుగు వెనక్కివే

రామారావు: నా అస్థిపంజరమా!!

రా. లిం: అంటే...అదుగో ఆ కేస్‌లోది...

(కేస్ వేపు చూపిస్తాడు)

సుధా: డాక్టర్! మీరు మమ్మల్నందర్నీ బెదిరకొడదామని పెట్టినట్టుంది గదిలో...అసలు దీని అవసరం మీకేముంది?

రామారావు: కొత్తఇంటికి అదొక వస్తువు లాటిది. హాస్పిటల్‌కీ దానికీ సంబంధంలేదు. వారం రోజులై వచ్చింది...ఏదువందలయింది ఇంటికొచ్చే

వెంక: అయిదువందలే! ఎందుకయ్యా ఖర్చు అనవసరంగా? కొత్తఇంటికి ఇంకో పియానో తెప్పించుకుంటే బాగుండును! వాయించటం రాకపోయినా గదినిండుగా ఉండును.

రా. లిం: వెక్కిరిస్తున్నట్టు అది ఎదురుగా ఉంటే రామారావుగారూ! ఇక్కణ్ణుంచి పారిపోవాలని ఉంది!

సుధా: నే నొకమాట చెప్తాను రామారావుగారూ! మన వృత్తే, నన్ను క్షమిస్తే, అసహ్యమైనది.

రా. లిం: డాక్టర్! మన వృత్తిమీదే మీరు నింద వేస్తున్నారు అనవసరంగా!

వెంక: చెప్పనీండి రామలింగంగారూ! చెప్పి. అతడన్నంతమాత్రాన నష్టంలేదు.

సుధా: నేను నిందించడంలేదు. మనం డ్యూటీలో ఉన్నప్పుడు చెయ్యవల్సిన పనులు మనస్సుకి సంతోషం, ఆనందం కలిగే పనులు చెయ్యం—మనిషి దేన్ని అసహ్యించుకుంటాడో, ఏది అక్కర్లేదని అహోరాత్రాలూ కోరుకుంటాడో, పాటుపడతాడో ఆ వ్యాధి—ప్రతి నిమిషం దానిలోనే వుండాలి మనం. అది మన కుండకపోయినా దానిలో మునిగితేలతాం. మనిషి ఆనందానికి అడ్డొచ్చిన ఆ అసహ్యాకరమైన కళ్మలాన్ని పోగొట్టడానికి ప్రయత్నిస్తాం. దానితోనే మనుష్యులు మనదగ్గరికొస్తారు. మన బ్రతుకంతా, ఈ వృత్తి చేస్తున్నంతకాలం అంతే. ఒక పోస్ట్‌మార్టమ్ చేస్తే నాకు రెండు రోజులవరకూ తిండి సయించదు. ఎంత అలవాటైనా మనస్సుకి ఆ పరిశ్రమ, ఆ బరువు చాలదూ? ఇంక మన విశ్రాంతి సమయం హాయిగా, సంతోషంగా, తేలిగ్గా గడపేద్దామని ఎంతో కోరుకుంటాం. అలాటి సమయం గడిపే ప్రదేశం డ్రాయింగ్ రూమ్ ఒకటి—కాని ఈ అస్థిపంజరం ఎదురుగా ఉంటే తిరిగి మనిషి, ఎముకలు, వ్యాధులు గుండెలో జొరబడతాయి. సంతోషం కాస్తా చచ్చి ఊరుకుంటుంది...అదీ నేననేది.

వెంక: బాగా చెప్పేవ్ సుధాకర్! అయినా ఎందుకయ్యా ఈ ఎముకలగూడు, ఎదురుగా?

రామారావు: (నవ్వి) మిమ్మల్నింతగా బాధపెడుతోందా అది?

సుధా: మామూలు మనిషి బాధపడతాడో లేదో కాని, మానవశాస్త్రం పనివాళ్లం మనం. అది ఆ మరలనే జ్ఞాపకానికి తెస్తుంది, మగుద్దా మనుకుంటే. చికాకుగా ఉంటుంది, మరేం లేదు కాని.

రామారావు: అది నాకు ఆత్మబలాన్నిస్తుంది!

రా. లిం: అది పోతుందేమో అని, నేను భయపడుతున్నాను. దాన్ని చూస్తూ ఉంటే.

వెంక: ఏమి అనిపించినా అనిపించకపోయినా దాని అవసరం ఇక్కడ లేదు.

రామారావు: నన్ను మీరంతా క్షమిస్తానంటే ఒక్క మాట అంటాను.

వెంక: తప్పకుండా చెప్పవోయి! అందులో నీ కొత్త స్వంత ఇంట్లో!

రామారావు: మీకు మీ వృత్తిమీద ఉండవల్సినంత అభిమానం, శ్రద్ధా లేవేమో! ఇది కూడా ఒక కళ లాటిదే...ఆ కళమీద ఆసక్తిలేదేమో.

రా. లిం: మైగాడ్! ఏమిటలా కొట్టి పారేస్తున్నారు రామారావ్ గారూ? నన్నొదిలేయండి ఫరవాలేదు—కాని వారంతా మీ అంతటివారే.

సుధా: మీ రెలా చెప్పగలరు!

రామా: ఎలా చెప్పగలనా? నాకూ అందులో శ్రద్ధలేదు కాబట్టే నాకూ దానిమీద అభిమానంలేదు కాబట్టే...నాకూ అదంటే ఉత్సాహంలేదు.

కృష్ణ: ఎందుకులేదు రామం? వీళ్లందరికన్నా నీకు శ్రద్ధఉంది. అందులో ఆసక్తి తప్పకుండాఉంది. తిండి, నిద్ర లేకుండా మేం ఎవరమున్నా పనిచేస్తున్నామా? రాత్రి ఒంటిగంటకి ఈ డాక్టర్లెవరన్నా కదిలేరేమో అడుగు? రాత్రిళ్లు, పగలూ రోగుల దగ్గర వీళ్లెవరన్నా కూర్చున్నారేమో అడుగు? నా సంగతి ఒదిలీ—నేను అలాటి కేసులు పట్టేపట్టను...నీ దగ్గరికి పంపించేస్తాను.

రామా: నువ్వలా ఆవేశపడకు కృష్ణమూర్తీ!

వెంక: ఏమోయి! నువ్వెక్కువకాలం బతకాలని మేం కోరినందుకు కోపంలా ఉంది?

సుధా: అలా ఊరికినే ఆవేశపడకండి! మీకొక్కవల్సిన సాయం మేం చెయ్యమన్నామా?

కృష్ణ: (సుధాకర్ వేపు కసిగా చూసి ముఖం దించుకుంటాడు.)

రా. లిం: తప్పకుండా కృష్ణమూర్తిగారూ! శేపంటే రేపే కాదుకాని... ఈ నాలుగేళ్ళలోనూ ఎప్పుడైనా తప్పకుండా సాయంచేస్తాను.

రామా: ప్రతి డాక్టర్‌కీ సుధాకర్ అన్నట్టే ఉంటుంది. అతను చెప్పినట్టు వికారమైన దానిదగ్గరకైనా ఎవరికి వెళ్ళాలని ఉంటుంది చెప్పండి? కాని అది మనోబలంమీద ఆధారపడి ఉంటుంది. ఆసక్తి, ఆ వికారాన్ని పోగొడుతుంది. అందులో శ్రద్ధ కలుగచేస్తుంది. నాకు మనోబలం తక్కువ... అందమైనవి, సంతోషాన్ని, ఆనందాన్ని ఇచ్చే వస్తువులకోసం నేనొకప్పుడు ప్రాకులాడేను. కాని నాకవి అందకుండా పోయేయి. అందుకే ఈ వృత్తి. కాని ఆ అందమైనవాటివేపు అప్పుడప్పుడు మనస్సుపోతుంది. అదే నా మనోదౌర్బల్యం. సంసారం చేస్తూ జీవితంలో అన్నివిధాలా ఆనందం అనుభవిస్తూ ఈవృత్తికి పూర్తి శక్తిని వినియోగించినవాళ్లున్నారు. ఇందులో పరిశోధనలు చేసిన గొప్పవారంతా అందం అంటే ఏమిటో తెలియనివారు కారు. కాని నాకాశక్తి లేదు. అందుకనే ఈ అస్థిపంజరం—ప్రతినిమిషం ఇది నాకర్తవ్యాన్ని గుర్తుకు తెస్తుంది. రోగాల్ని, మనుష్యుడిబాధని జ్ఞాపకానికి తెస్తుంది. ఆ వికారమైనవాటిని గుర్తుకు తెస్తుంది. పోయినబలాన్ని నామనస్సుకి తిరిగి ఇస్తుంది.

సుధా: మీరు కేవలం డబ్బుగురించి ఈ వృత్తిని అవలంబించనట్టు మాట్లాడుతున్నారు. మేంకూడా కొంతవరకు అంతేననుకోండి. కాని మీకు మా అందరికన్న ప్రాక్టీసెక్కువే అనుకుంటాను.

రామారావు: కేవలం డబ్బుగురించేకాదు. నాకిందులో మొదటినుంచీ ఆసక్తి ఉంది. కాని డబ్బు లేకుండా ఏదీ లాభం లేదు. పదిహేనువందలు నా ఏవరేజి. మీరంతా పుచ్చుకొనేటట్టు పుచ్చుకుంటే నాకు మూడు వేలవరకూ వస్తాయి.

రా. లిం: ఏం? మీరు తక్కువపుచ్చుకుంటారా?

రామారావు: కొంచం—అదొక్కటే కాదు. డబ్బున్నవాళ్లంతా ఇచ్చేస్తారు. కొంతమంది మందు ఇస్తారు. కొందరు రెండుమూడు వాయిదాలుగా ఇస్తారు. కొందరు ఇవ్వనేలేరు. అలాఅని ఇంకోసారి వచ్చినప్పుడు డబ్బు ఇచ్చాక రండి అందామనుకుంటూ అనలేను. అస్థిపంజరం జ్ఞాపకానికొస్తుంది. చిన్న వేదాంతంలా మనస్సులో బయలేర్తుంది. రోగం! దానికి డబ్బుతో సంబంధం లేదు. ప్రతివాళ్లకీ వస్తుంది. డబ్బున్నవాడికీ లేనివాడికీని... దానికి స్నేహితుడూ శత్రువూ అని లేదు. ఒకప్పుడనిపిస్తుంది. ఈ మనిషి రోగంతో నాదగ్గరికొచ్చేడు. ఇతను నాకు డబ్బివ్వాలి. అప్పుడు అస్థిపంజరం జ్ఞాపకానికొస్తుంది. ఒక మానవశరీరం నీదగ్గరికొచ్చింది. రక్తం, మాంసం, ఎముకలతో కూడుకున్న ఒక శరీరం. అది రోగంతో బాధపడుతోంది. పాడవుతోంది. నువ్వు దానిని మరామత్తు చెయ్యగలవ్. అది నీకర్తవ్యం — ఆశాస్త్రంలోనే శ్రద్ధుంటే, అదెందుకు తెల్సుకున్నావో ఆపని నెరవేర్చు అనిపిస్తుంది... కేవలం డబ్బు పుచ్చుకోకుండా చేదాం అంటే లాభం లేదు—

వెంక: అందుకే నీకు పేషెంట్లెక్కువౌతున్నారు. ఎందుకొ అనుకొనేవాడ్ని. డబ్బు పుచ్చుకోడం పూర్తిగా మానేస్తే, ఊరంతా నీ దగ్గరికే వస్తారు. మేం అంతా మకాం ఎత్తేయవచ్చు!

రామారావు: అలాటిదేమీ లేదు. నాకూ డబ్బు కావాలి. కాని నాకొక కోరికఉంది. అదింత వేగం కాదు—కాని, నేననుకున్న డబ్బు జతపడ్డాక— అది ముసలితనంలోనే కావొచ్చు- నాడబ్బు, మరికొన్ని చందాలు వసూలుచేసి ఒక సేనిటోరియమ్ కట్టించాలని ఉంది, బీదవాళ్ళకి అందుబాటులో ఉండేలా—చాలా కాలం పడుతుంది. నేనొక్కణ్ణీ ఇప్పటికే ఉన్న పేషెంట్లతో నెగ్గుకురావడం కష్టంగా ఉంది... తగ్గించుకోవాలనిపిస్తోంది. మీరు భయపడనక్కర్లేదు—

రా. లిం: ఆమాత్రం ధైర్యం ఇస్తే చాలు—మీలాంటి పెద్దభావాలూ, ఉదారస్వభావం మాకూ ఉన్నయ్. కాని మాకు పెళ్లాం, పిల్లలు, సంసారం, పిలల చదువులు అన్నీ చుట్టుకున్నాయి—మీకెవ్వరూ లేరు—మీరు పెళ్ళిచేసుకోరనికూడా విన్నాం. మీరు మీ ఆదర్శాలు అమలులో పెట్టినా సబబుంది.

(మౌనం)

కృష్ణ: (ప్రసంగం మార్చి) ఏమండీ సుధాకర్! నాథంగారు మీకు తెల్సునా?

సుధా: విశ్వనాథంగారు?

కృష్ణ: ఔను—మరిచిపోయినట్టుంది మీరు- ఆయనపేరు తెలియనివాళ్లీ ప్రాంతంలో ఉండరను

కుంటాను—డబ్బున్న రోజులలో ఆయన అడిగిన వారికి లేదనకుండా ఇచ్చి ఆఖరుకు ఫకీరయ్యేరు—

సుధా: ఔనౌను! విశ్వనాథంగారు—రెం క్రింద...

కృష్ణ: మీ గవర్నమెంటు హాస్పిటల్‌లో పోయేరు...

సుధా: (చికాకుగా) ఆయనసంగతి ఇప్పుడెందుకు?

కృష్ణ: ఆయన్నొకసారి తలుచుకుంటే పుణ్యమే గాని పాపం కాదుగదా!

రామారావు: పాపం, ఆయన పోయినప్పుడు నే నిక్కడలేను—కలరా వచ్చిపోయేరుట— నేనూ తప్పకుండా సహాయపడి ఉందును వీలైనంతమట్టుకు —చాలా బాధపడ్డా రాఖ్రరోజులలో—

కృష్ణ: రామం అప్పుడే ఉంటే ఆయన తప్ప కుండా బ్రతికిఉండు నేమో అనిపిస్తుంది!

సుధా: చెయ్యవల్సిందంతా చేసేం. రామారావు గారున్నా అంతకన్న మరేం చేసివుండలేక పోయేవా రేమో!

రామా: అంతే అంతే! పాపం...ఆయన్ని తల్చుకుంటే—

కృష్ణ: ఆయన పోయేక పుకార్లు చాలా చాలా పుట్టేయి లెండి.

రామా: నేనూ విన్నానేవో! అవన్నీ వట్టివి కృష్ణమూర్తీ! సుధాకర్ పాపం చెయ్యవల్సిందంతా చేసేరు - అంతకన్న...

కృష్ణ: విశ్వనాథంగారిని ఈ హాస్పిటల్‌లో పడేసేరంటే, పూర్వం విశ్వనాథంగారు కారుకదూ? డబ్బున్న రోజులలో మనిషి కారు...

సుధా: మీ రనదల్చుకున్న దేదో సూటిగా అనండి!

కృష్ణ: పుకార్లు సుమండీ! ఎంతమట్టుకు నిజమో మరి మీకే తెలియాలి. మీరు ఆయనవిషయంలో తీసుకోవల్సినంత శ్రద్ధ తీసుకోలేదని...

రామా: కృష్ణమూర్తీ! అవేమ్మాటలు!

వెంక: నేనూ ఏవో విన్నానుకాని అవి వట్టి మాటలు—

సుధా: వాటి కెంత విలువఉన్నా కృష్ణమూర్తి గారు మాత్రం నమ్మినట్టుంది

కృష్ణ: మనంకూడా మనుష్యులమే చూడండి— కోరిక, అసూయ, లోభిత్వం ఇవి ముఖ్యంగా మనిషి కుండవల్సిన గుణాలు—పోతాయా? వాటికి వేటి కన్నా, డాక్టరే కానీండి లొంగడంటే అంత ఆశ్చర్యపడాల్సిన సంగతి కాదు.

సుధా: అంటే? నే నశ్రద్ధ చేసేనంటారా?

కృష్ణ: నే ననను. పుకారు చెప్తున్నాను. రోగం కాస్త దారిలోకి వచ్చి, రాత్రి పదిలో ఎప్పటికో మళ్ళా తిరగేసిందన్నాగ—అప్పుడు మీ ఇంటికి వెళ్ళి, తలుపు విరక్కొటేనంత పని చేసినా లేవ లేదని అంటారు...అంతలా నిద్రపోయే మనుష్యు లుంటారా అనిపిస్తుంది—

రామ: నే నలా నిద్రపోతానండోయి — ఇందాక చెప్పేనుకదూ—కుంభకర్ణుడి నిద్ర—

సుధా: ఏదన్నా పుకారు పుడితే మనుష్యులు చాలా సులభంగా అది నమ్మేస్తారు...కాని నిజం తెల్సుకు నేందుకు ప్రయత్నించరు

కృష్ణ: నిజం ఏమిటో!

సుధా: నే నింట్లో లేను—మరొక కేసుమీద వెళ్ళేను...

కృష్ణ: అదీ నేను విన్నాలెండి. ప్రయివేటు ప్రాక్టీసా?

సుధా: కృష్ణమూర్తీ! మీరు నన్ననవసరంగా అపార్థం చేసుకుంటున్నారు—అప్పుడు మీరంతా ఏమయ్యేరు?

కృష్ణ: నాకప్పుడు గుండెనొప్పి వచ్చింది. లేక పోతే నేనే...కాకపోయినా ఒక కేసు మీ దగ్గర కొచ్చినప్పుడు పూర్తి బాధ్యత మీదే నేమో!

సుధా: ఆ బాధ్యత నెరవేర్చలేదంటారా?

కృష్ణ: ఏమోమరి—ఉన్న నిజం ఏమిటంటే మీరు రాత్రి రెండుకి వెళ్ళేరని...అప్పటి కప్పుడే ఆయన ఆఖరి ఘడియలలో ఉన్నాడని.

సుధా: నేను రెండుకి వెళ్ళడం నిజమే! కాని అప్పటివరకు ఇంకొక కేసు చూడాల్సొచ్చింది... తిరుగుముఖం పట్టిందనుకున్నది, తిరగేస్తుందని ఎవ రనుకోగలరు?

కృష్ణ: పోనీ ఆ కేస్‌లోనన్నా సక్సెసయ్యేరా?

సుధా: ఔను—అయ్యేను.

కృష్ణ: పడిన కష్టం వృధాపోదంటారు. ఫలితం లేకుండా పోయిఉండదు!

సుధా: కృష్ణమూర్తిగారూ! మీరు అనవసరంగా నామీద ఒక నింద మోపుతున్నారు! మీకు మర్యాదకాదు.

రామా: కృష్ణమూర్తీ! నీకు పిచ్చికాని ఎత్తిందా!? ఊరుకో!

వెంక: నాకు టైమయింది, టెన్నిస్‌కి—పద సుధాకర్! ఉత్తినే వెర్రివాడిలా ఎక్సైటయిపోతూ ఉంటాడు! ఆ మాటలు పట్టించుకోకు...

రా. లిం: (లేస్తూ) అలా ఉద్రేకపడితే గుండెకి మంచిదికాదు కృష్ణమూర్తిగారూ! అలా అయితే ఒక్క సంవత్సరం కూడా నా కనుమానమే! మీకు సహాయం విషయం రేపే కాకపోయినా ఆలోచిద్దాం లెండి!

సుధా: మీరు నాకు 'ఎపాలొజీ' ఇచ్చుకోవాలి కృష్ణమూర్తిగారూ!

రామా: దాని కంతగా పట్టించుకోకండి సుధాకర్! మనం అంతా స్నేహితులం—ఒకే వృత్తివాళ్లం!

సుధా: (లేస్తూ) ఆ రకంగా అయితే... మీరు చెప్తున్నారు కాబట్టి నేనంతగా పట్టించుకోను... కాని అది మనస్సు కెంత బాధకలిగిస్తుంది!

(అంతా లేచి నిల్చుంటారు)

కృష్ణ: ఏమిటి డాక్టర్ గారూ? ఎపాలొజీ అన్నారు? నిమిషాలమీద అంతా ఋజూ చెయ్యగలను —మీరు ఎవరిని 'ట్రీట్' చేసిందీ, ఎంత పుచ్చుకున్నదీ... నలుగురి సాక్ష్యం చాలదూ?

రామారావు: కృష్ణమూర్తీ! నీ కివాళ...

వెంక: పద సుధాకర్! అతనితో మన కేమిటి...

కృష్ణ: ఇంక మీ ఎవ్వరిసాయం నా కక్కర్లేదు... మీ అందరిసాయకీ చాలా సంతోషం... ఒక్క సంవత్సరమే చాలు... నాలుగేళ్లేంకుకి వెధవబ్రతుకు -ఈ ఏడాదిలోనూ నా సంసారానికి నేనుపోయేక ఏబాధా వాళ్లకుండకుండా చెయ్యగలను...

రా. లిం: అంత ఆవేశం వద్దుడాక్టర్! మంచిది కాదు గుండెకి!... పదండి.... పద సుధాకర్ .... మళ్లా కల్సుకుందాం రామారావుగారూ... (అస్థిపంజరాన్ని చూసి ధైర్యంగా, కులాసా ఆ? (పకపక నవ్వుతాడు)

వెంక: మళ్లా కలుద్దామోయి రామం. పద సుధాకర్ ... టెన్నిస్‌కి టయిమయింది!

(ముగ్గురూ వెళ్ళిపోతారు)

రామారావు: అలా ఎందుకు ప్రవర్తించేవ్ కృష్ణమూర్తీ... అత నెంతగా నొచ్చుకుని ఉంటాడు!

కృష్ణ: నే నన్నదాన్లో అబద్ధం ఏమీలేదు... ఎపాలొజీ కావాలిట!... ఎపాలొజీ...!

రామారావు: నువ్వలా ఆయ న్ననడం నా కిష్టంలేదు సుమా!

కృష్ణ: (వాచీ చూసుకొని) నా కిక టైము లేదు. నే పోతాను. ఇవాళనుంచీ ఒక నిమిషమున్నా విశ్రాంతికి, అవకాశంలేదు... పూర్వంలా కాదు... ఒక సంవత్సరమే టైమ్ ఇచ్చేవ్ మరి నువ్వు!

రామారావు: నాలుగు సంవత్సరాలు!

కృష్ణ: విశ్రాంతి తీసుకుంటేగా.

రామారావు: విశ్రాంతి తీసుకో.

కృష్ణ: నా పెళ్లాంపిల్లలమాట—తెలిసి నువ్వెందుకలా అంటావ్? ఒక దమ్మిడీకూడా నేను నిలవ చెయ్యలేదు. నేను కళ్లుమూస్తే వాళ్లంతా కట్టుగుడ్డలతో నిలబడిపోవల్సిందే...

రామా: మేమంతా ఎక్కడి పోతామనుంటావ్? మరో పదేళ్లు బ్రతుకుతావని ఎందు కనుకోకూడదు? గుండె జబ్బుతో, చెప్పేనుకదూ ముసలితనం చూసినవాళ్లున్నారు...

కృష్ణ: నాకు బతకడానికి ధైర్యంలేదు. నాలుగేళ్ళా నాకనుమానమే ... నొప్పొచ్చిన ప్రతిసారీ నా న్నేళ్లు తరిగిపోతున్నట్టుంటుంది!

రామా: మేం అంతా ఉన్నాం నీకు భయం ఎందుకు?

కృష్ణ: చూసేవ్ కదూ మనస్నేహితులధోరణి... డబ్బుసాయం వచ్చేసరికి నాకింకో పదేళ్లు ఆయుర్దాయం ఇచ్చేసేరు! లాభంలేదు రామం! రాత్రీ పగలు కష్టపడి వీళ్లందరి ప్రాక్టీసూ పడగొడతాను .. నా కర్తవ్యం పెళ్లాం పిల్లలకి...

రామా... ఇలా రా... కూర్చో...

(ఇద్దరూ కూర్చుంటారు)

నువ్వూ నేనూ చిన్నప్పట్నించీ స్నేహితులం... ఆరోజులు జ్ఞాపకమున్నాయా? చిన్నప్పటి రోజులు?

(మౌనం)

కృష్ణ: (జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు) ఔను. సముద్రపొడ్డున ఇసుకతో గూళ్లుకట్టి ఆడుకొనేవాళ్లం...

రామా: ...క్లాసులో నువ్వు మొదటివాడవుగా ఉండేవాడివి ... నీతో నాకు తిరగడానికి ఎంతో గర్వంగా ఉండేది!

కృష్ణ: నువ్వు చాలా పొట్టిగా ఉండేవాడివి. కాని అందరితోకన్న నీతో తిరగడంఅంటే నాకేదో సర్దాగా ఉండేది...

రామా: సినిమాలకీ, హోటల్ తిళ్లకీ నువ్వే డబ్బు తెచ్చేవాడివి. ఇద్దరం ఇష్టమొచ్చినట్లు ఖర్చు పెట్టే వాళ్లం. మానాన్నగారు ఒక దమ్మిడీకూడా ఇచ్చే వారుకారు ఇలాంటి ఖర్చుకి.

కృష్ణ: ముఖం ముడుచుకుంటే చాలు అమ్మ కావల్సినడబ్బులిచ్చేది ... నేనంటే ఎంత ముద్దుగా చూసేది...

రామా: మెడిసిన్‌లోకూడా నువ్వే ఫస్టు. నేను నీతరవాతే...

కృష్ణ: అలా అనకు—నీకున్న పట్టుదల—అందులో శ్రద్ధ నాకు లేవు.

రామా: గుండెజబ్బు నీ కడ్డొచ్చింది...లేక పోతే నువ్వా

కృష్ణ: ఈ వృత్తిలో అంతగా ముందుకు రాలేక పోయాననికాని, నాకు గుండెజబ్బుందనికాని నా కెప్పుడూ విచారంలేదు. బ్రతుకులో ఎంత ఆనందం అనుభవించాలో అది అనుభవించేను. కాని ఇప్పుడు ఒక్కటే విచారం. ఎవరివల్ల అంత ఆనందం, సుఖం పొందేనో వాళ్ళకి ఏమీలేకుండా చేసిపోతానేమో అని...

రామా: నువ్వు ఆ విచారం పెట్టుకోకు -(ఊరుకొని) నేను సాయంచేస్తాను—సరా? రేపే మీ ఆవిడపేర, ఆరువేలు బ్యాంక్‌లో వేసుకో—నా దగ్గర తీసుకో డబ్బు.

కృష్ణ: (నమ్మలేక) ఏమిటి రామం?

రామా: అంతలా ఆశ్చర్యపోకు...

కృష్ణ: నిజంగానా?!

రామా: నీకన్నా నాకు దగ్గరస్నేహితు లెవరున్నారు? నువ్వు మనస్సు స్థిమితపరచుకో: సరా?

కృష్ణ: నేను నమ్మలేకుండా ఉన్నాను రామం!

రామా: నాలో నీకు నమ్మకంలేదా?

కృష్ణ: ఎందుకు లేదు?

రామా: మా తండ్రి వదిలిన డబ్బు, నే నార్జించిన డబ్బు ఏం చెయ్యాలంటావ్...సేనిటోరియమ్ కట్టాలనిఉంది...అయినా ఈమాత్రం తగ్గినందువల్ల దానికి నష్టంలేదు...

కృష్ణ: నువ్వు నీ పెళ్లిసంగతి మరి ఆలోచించ దలచుకోలేదా?

రామా: పెళ్లిచేసుకుంటే ఈ వృత్తి మానెయ్యాలి.

కృష్ణ: ఎందుకు?

రామా: ఈపని అలాటిది—పెళ్ళి, ఈ వృత్తీ రెండూ నడవలేవు-పెళ్ళిచేసుకొని లాభం ఏముంది? పెళ్ళానికి సుఖం ఉండదు...నాకూ అందులో సంతోషం ఉండదు...నాసంగతి సుసా—రాత్రి పగలు అనకుండా పేషెంట్లపట్ల శ్రద్ధ తీసుకోవాలి. పెళ్ళాంమాట మరిచిపోవాలి... ఆ సంతోషమే కావాలంటే ఈ వృత్తిని అశ్రద్ధచెయ్యాలి...ఏదో ఒకటే ఉంచుకోవాలి...అందుకే అనుకున్నాను... కొన్నాళ్లు ఈ వృత్తిచేసి మానేసేక పెళ్లిచేసుకుందామని...

కృష్ణ: ఇప్పుడు నీకేమయింది! మానెయి ఈ పని. డబ్బుకేం బాధలేదుగా? ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు?

రామా: నాకా ఉద్దేశం మరి లేదు—ఇందాక చెప్పేనుకదూ. అందం, సంతోషం నా దగ్గరికి రాలేవు.

కృష్ణ: పాతసంగతులు మరిచిపోవాలి రామం. మళ్ళా కొత్తగా మొదలెట్టు.

రామా: మరిచిపోయేను. కాని మరికొత్తగా మొదలెట్టలేను—

కృష్ణ: ఎలాఅయింది అదంతా? విశ్వనాథం గారికి నీ ఉద్దేశం తెలీదూ?

రామా: తొందరలేదనుకున్నాను.-కమలకూడా అలానే అంది. డాక్టర్ చదువు పూర్తిఅయేవరకు బాధలేదనుకున్నాను—ఇందులో నాకు మొదట్నించీ శ్రద్ధఉండేది. చిన్నప్పట్నించీ డాక్టర్ అవుదామని ఉండేది. వీలుంటే రెండుమూడేళ్లు ప్రాక్టీస్ చేసి మానేసేక, కాదూ అంటే ప్రాక్టీస్ చెయ్యకుండానే పెళ్ళిచేసుకుందామనుకున్నాను.

కృష్ణ: మరెలా?

రామా: ఇంటరమీడ కమలకీ చదవాలనే ఉండేది—అప్పటికే వాళ్ల పరిస్థితి బాగులేదుట—నాకిదంతా తెలీదు—మద్రాసు వెళ్ళిపోయేక ఆరేళ్ల వరకు మరి ఇంటిముఖం చూడలేదు. ఇక్కడి స్థితి తెల్సిందికాదు. కమలన్నా రాసిందికాదు. తిరిగి వచ్చేసరికి కమలపెళ్లిఅయిపోయింది—

కృష్ణ: కమల ఎలా ఒప్పుకుందో నా కాశ్చర్యమే

రామా: తిరిగివచ్చేక మరి ఆ ఇంటికి వెళ్ళలేదు—కమల దిప్పుడు ఏ ఊరో కూడా తెలీదు... బాగా డబున్న వాళ్లే సంబంధమేనుట. అయివుండాలి. వాళ్ళు చాలా సాయం చేసేరని అంటారు. అదంతా ఆలోచించే కమల ఒప్పుకొని ఉంటుంది.

కృష్ణ: నీకు తెలిస్తే నువ్వాపాటి సాయం చెయ్యలేకపోదువా?

రామా: నేను సాయం చెయ్యడం ఆమె కిష్టం లేదేమో? తన స్థితి తెలియజెయ్యడం ఇష్టంలేక అయ్యుంటుంది. లేదా మా నాన్నగారు బ్రతికేఉండే వారప్పటికి... ఇలాటి సాయానికి ఆయన ఇష్టపడరని ఊరుకుందో ఏమిటో? ఏదీ నాకు సరిగ్గా తెలియకుండాపోయింది. ఒక్క ముక్కన్నా ఎవ్వరన్నా అప్పుడు తెలియజేసిఉంటే కమలని దక్కించుకుందును!

కృష్ణ: అయిపోయినదానిగురించి మరింక విచారిస్తే ఏం లాభముంది? నీ మనస్సు మార్చుకు నేందుకు ప్రయత్నం చెయ్యి.

రామా: అది లాభంలేని పని.

[మౌనం]

కృష్ణ: చెప్పకేం— నువ్వంటే నా కొంచెం అసూయగా కూడా ఉం  కమల విషయంలో, ఆ రోజుల్లో.

రామా: మరింక ఆ అసూయ నీ కక్కర్లేదు.
(నవ్వుతాడు)

కృష్ణ: కాని, ఇది గమ్మత్తుగా లేదూ? మా ఆవిడకీ కమలకీ ఎంతదగ్గరి పోలికో! ఇద్దరూ కవలపిల్లలా అనిపిస్తుంది. నేను ఆ సంబంధానికి ఇష్టపడిం దందుకే. కట్నం గిట్నం ఏమీ లేకుండా పెళ్ళిచేసుకున్నాను.

రామా: మొదటిసారిగా మీ ఆవిడ్ని చూసినప్పుడు నేను ఉలిక్కిపడ్డాను. నమ్మలేకపోయేను- కమల ఇక్కడి కెలా వచ్చిందా అని...

కృష్ణ: నేనంటే దానికి ప్రాణం. (ఆ మాట అన్నందుకు సిగ్గుపడుతూ) అంటే, ఈ గుండెజబ్బుందని బెంగపెట్టుకుంది. నువ్విలా టైము కూడా ఇచ్చేవని చెప్తే నాకన్న అదే ముందు దారి తీస్తుందేమో అనిపిస్తుంది.

రామా: ఆ పనిమాత్రం చెయ్యబోకు. ఏమీ ఫరవాలేదన్నానని ఆవిడతో చెప్పు. నువ్వైనా మరి మనస్సులో ఏ ఆలోచనా ఉంచుకోకు. నిశ్చింతగా ఉండు. విశ్రాంతి తీసుకో అంతే... ఈ ఆరు వేలూ రేపు బదిలీ చేయిస్తాను.

కృష్ణ: తొందర్లేదు రామం—నీ మాటుంటే అదే చాలు.

రామా: మాట ఒక్కటే లాభంలేదు. ఇలా అయితే నీకు పూర్తిగా ధైర్యం ఉంటుంది—

[నౌకరు ప్రవేశం]

నౌకరు తమని కల్సుకొనేందు కెవరో వచ్చేరు.

రామా: పేరు చెప్పలేదా?

నౌకరు: లేదు. తమని అర్జంటుగా చూడాలిట!

రామా: సరే—రమ్మను.

నౌకరు: చిత్తం.

[నౌకరు నిష్క్రమణం]

రామా: ఏదో కేసయి ఉంటుంది.

కృష్ణ: నీకు మరి సెలవంటూ ఏనాడూ ఉండదేమో!

రామా: ఉన్నా ఏం చెయ్యాలి?

కృష్ణ: సరే నేనువెళ్తున్నాను. రేపుసాయంత్రం నువ్వు మాఇంటికి 'టీ' కి తప్పకుండా రావాలి. క్రిందటివారం పనితొందర్లో రాలేకపోయేవ్. నువ్వు సరదాగా మాటాడతావని మా ఆవిడ అంటుంది.

రామా: తప్పకుండా ఒస్తాను. కాని ఒక్కమాట. ఈడబ్బుసంగతి తెలియనివ్వకు ఇప్పుడప్పుడే...

కృష్ణ: ఏం?

రామా: తొందరలేదు మాడూ? ఈ జాగ్రత్త అదీచూస్తే ఆవిడకి అనుమానం వెయ్యవచ్చు. నీవిషయంలోమాత్రం ఏ బెంగా ఆవిడ కుండకూడదు.

కృష్ణ: అలా నేకానీ... రేపుసాయంత్రం మరిచిపోకు. వెళ్తాను...

[కృష్ణమూర్తి గదిని వదుల్తాడు. రామారావు చేతులు వెనక్కి కట్టుకొని గదిలో పచారుచేస్తూ చేస్తూ అస్థిపంజరంముందు ఆగుతాడు — ఇంతలో ఏభైఏళ్ళ ఒకవ్యక్తి ప్రవేశం. మనిషి దృఢకాయుడు. పైకి దువ్విన క్రాపు. జుత్తు చాలాభాగం నెరసింది. కనుగుడ్లు, ఏనిమిషం పైకి తోసుకొస్తాయో అన్నట్టున్నాయి. చూపులలో నిశ్చయం, పట్టుదల, కొంత క్రూరత్వం ఇమిడి ఉన్నాయి. నొక్కేసినట్టున్న ముక్కు, దళసరి పెదవులు, మెలికలు తిరిగిన, పెద్ద

మీసాలు, మనిషి కట్టుకున్నది ఒక తెల్లటి లుంగీ, తెల్లటిలాల్చీ; ఒంటిమీద భుజంమీద టర్కీటువ్వాలు ఎర్రఅంచులది. చేతికి లేబిలు లైంపీసును జ్ఞాపకం తెస్తూ వాచీ—)

వ్యక్తి: అస్థిపంజరాన్ని చూసి ఒక్క అడుగు వెనక్కి వేసి, సర్దుకొని బొంగురుగొంతుతో) రామా రావు గారు మీరేనా?

రామా: (అటు తిరిగి వ్యక్తిని పరిశీలించిచూసి) బోర్డుచూసే ఉంటారు.

వ్యక్తి: చూసేనెలెండి—ఇంట్లో మీరొక్కరే ఉంటారని ఎక్కడాలేదుగా...ఎందరెందరో ఉంటారు—అందులో రామారావెవరో—క్షమించాలి, రామారావుగా రెవరో?

[సోఫా వేపు వెళ్తాడు కూర్చోవేందుకు]

రామా: కూర్చోండి—

వ్యక్తి: (కూర్చుంటూ) అదే అనుకుంటున్నాను —సరే...నేను మీకు కొంచం మోటుగా జొపించొచ్చు. క్షమించాలి...

రామా: (కూర్చుంటూ) మీరే పనిమీద వచ్చేరో తెల్సుకోవచ్చా?

వ్యక్తి: దాని కభ్యంతరం ఏముంది? అందుకే నేను రావడం.అయినా ఇది కొంచం రహస్యం లెండి.

రామా: నే నొక్కడ్నే ఉన్నానిక్కడ, ఫరవాలేదు.

వ్యక్తి: అలా అనకండి – మనిషికి మామూలు సంగతు లొకలాగ, రహస్యం ఒకలాగ చెప్పాలి... మనిషిలోపల, మనిషి, రాక్షసి ఇద్దరూ ఉంటారు రహస్యాలన్నీ రాక్షసి వినాలని నా ఉద్దేశం.

రామా: (చిరునవ్వుతో) మనిషిమీద మీకెందుకు నమ్మకంలేదు?

వ్యక్తి: నాకులేదు—రాక్షసి, అది విన్నసంగతి మరింకొకరికి తెలియనివ్వదు—తెలియకుండా చేస్తుంది పనులు—రహస్యాలన్నీ, రాక్షసి చెయ్యవల్సిన పనులే—

రామా: సరే—అదేమిటో చెప్పండి...

వ్యక్తి: నా పేరడగలేదు మీరు!

రామా: అడుగుతే నే కాని మీరు చెప్పరా?

వ్యక్తి: అడక్కుండా చెప్పే, పొగుడుకుంటున్నా ననుకుంటారేమో అని

రామా: సరే—మీ పేరు?

వ్యక్తి: మీకు తెల్సేఉంటుంది (నొక్కుతూ) సర్దార్ వెంకట ప్రసాదశెర్మ.

రామా: క్షమించాలి నే నెప్పుడూ మీ పేరు వినలేదు.

సర్దార్: నన్ను తెల్సిన చాలామంది సర్దార్ అని పిలుస్తారు. మరికొంతరు రౌడీ వెంకన్న అని అంటారు. అలా పిల్చేవాళ్లు మా గ్రామం వాళ్లుకారు లెండి. గిట్టనివాళ్లు పిలుస్తారలా.

రామా: (జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు) సర్దా ...ర్!

సర్దార్: తెలీకపోతే జ్ఞాపకం రాదులెండి. సర్దారన్న బిరుదు మా ఊరివాళ్ళిచ్చేరు నాకు— (మీసాలు మెలివేస్తాడు)

రామా: అలానా! మీ దేఊరో...

సర్దార్: ఇక్కడికి పదిమైళ్ళదూరి లెండి... నాటుదారి...విష్ణుపురం

రామా: విష్ణుపురం, చిన్నప్పట్నించీ వినడమే కాని ఎప్పుడూ వెళ్లలేదు. అక్కడున్న భూములన్నీ కొత్తపట్నం మొఖాసాదారువి కదూ?

సర్దార్: (పళ్ళుబిగించి) ఔను...

రామా: ఆయన పేరు మరిచిపోయేను—

సర్దార్: ఏం? ఆయన మీకెరుకా?

రామా: ఎప్పుడో చిన్నప్పుడు...నాకు సరిగా జ్ఞాపకంలేదు...

సర్దార్: మీ తండ్రిగారిదగ్గరి కెప్పుడన్నా వచ్చిఉంటారు...

రామా: ఔనౌను...అదే చెప్పాస్తున్నాను...

సర్దార్: వర్షాకాలం...సాయంత్రం వేళ...

రామా: (జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు) వర్షాకాలం....ఔను! వర్షం పడుతూఉంది...ఒక గుర్రబ్బగ్గీ వచ్చి ఆగింది...

సర్దార్: తరవా తేమిటయిందో జ్ఞాపకం ఉందా?

రామా: నేనప్పుడు ఏం జరిగిందీ చూడలేదు – వీధి గుమ్మంలో ఉండిపోయేను, గుర్రబ్బగ్గీని చూస్తూ– ఒక అరగంటయాక ఆయన తిరిగివచ్చేరు...ఆయన కోపంగా ఉన్నట్టు జ్ఞాపకం.

సర్దార్: ఎందుకో మీకు తెల్సునా?

రామా: తరవాత తెల్సింది. కొన్నేళ్ల తరవాత అతని భార్యకి చాలా సుస్తీగా ఉండేదట...అందుకని ఆయన మా నాన్నగారికోసమని వచ్చేరు.

సర్దార్ : మీ తండ్రిగారు వెళ్ళిఉండరు...

రామా: ఆయన పూజాసమయం అది. పూజ అయిపోయాక ఎంత రాత్రయినా, ఎంత దూరమైనా ఆయనకు వెళ్లేందుకు అభ్యంతరం ఉండేదికాదు... కాని ఉదయం రెండుగంటలు, సాయంత్రం రెండు గంటలు పూజ...ఆయన కదొక పట్టు... పూజలో కూర్చుంటే పీక పోయినా లేచేవారుకారు...

సర్దార్: (ఆలోచనగా) పూజ!

రామా: ఒక్కొక్కరి కొక్కొక్క నమ్మకం—మనిషయ్యాక—ఆయన రాకపోయేసరికి మొఖాసా దారుగారు కోపంతో వెళ్లిపోయేరు. ఇంకొక డాక్టర్ ఎవరో వెళ్లేరని విన్నాను...కాని ఆయన భార్య పోయింది—ఈయన వెళ్లకపోవటంవల్లనే అది జరిగిందని అతనంటాడు... నేనూ వినటమే...మా నాన్న గారిమీద ఆయన పగపట్టిఉండేవారని ... ఆయనిప్పుడు లేరు. ఏ పగకైనా—

సర్దార్: మీ తండ్రిగారు లేకపోయినా మీ మీద పగ ఉండవచ్చు నాయనకి...

రామా: పగ, మనిషికీ మనిషికీ విరోధం అంటే నాకు నవ్వొస్తుంది...నా వృత్తిలో నాకు స్నేహితుడు, శత్రువు అని లేదు—ఉండకూడదు. ఈ వృత్తికి మనస్సు అలా దిట్టం చేసుకోవాలి...

సర్దా: ఆయనొచ్చి ఇప్పుడు మిమ్మల్ని పిలుస్తే వెళ్తారా?

రామా: నా వృత్తికి సంబంధించిన పనిమీద అయితే తప్పకుండా వెళ్తాను...వెళ్ళాలి...అది నా కర్తవ్యం...

సర్దా: అయితే మీరు వీదన్నా కేసుమీద వాళ్ళ పిలిస్తే, కర్తవ్యం కనక వెళ్తారా...లేదా ఆమనిషి పడే బాధని చూసి దయ కలిగి వెళ్తారా? మీ విషయంలో నే నిది అడుగుతున్నాను......మీ గురించి విన్నాను కాబట్టి—ఎప్పుడైనా ఎక్కడికన్నా, ఎవరైనా రోగంతో బాధపడుతూ, కబురు వస్తే వెళ్తారని విన్నా కాబట్టి.

రామా: అది నామట్టుకు నాకే తెలీదు...తెల్సుకోనేందుకు ప్రయత్నించ లేదు కూడా. ఈ వృత్తిలో నా కొకవిధమైన ఆసక్తి ఉంది—అందుకే ఇది ఎంచుకున్నాను. దయ, అన్నది నా కెప్పుడూ కలగలేదేమో అనుకుంటాను...కేవలం మరలా ఒక పని చేసుకపోయేనేమో......మర నడవడానికి 'పెట్రోలు' వాళ్ళు డబ్బురూపేణా ఇస్తారు...అంతే...

సర్దా: అలానే మీ రంటారా?

రామా: దయ అన్నదే ఎప్పుడన్నా కలిగి పనులు నాచేత చేయిస్తే, నేనిలా ఉండకపోయే వాడినేమో. దయ అన్నది మనస్సుకి, ఆత్మకి సంబంధించినది. దయ, జాలి మనస్సులో ఉంచుకొని రోగికి చికిత్స చేస్తే ఫలితం సరిగ్గా ఉండదేమో...ఆత్మీయమైన జాలి కలుగుతుంది......అలా కలగడంవల్ల లాభం ఏమీ ఉండదు...ఆ అనుభూతి కలిగితే ఆ రోగాన్ని చూస్తే నాకే భయం వేసును....ఆ భయం ఎప్పుడైతే నాలో పుడుతుందో రోగాన్ని నాఅదుపులో పెట్టుకోలేను.

సరా: అంటే?

రామా : ఒక పెద్ద హాస్పిటల్‌లో ఒక సర్జన్ సంగతి చెప్తాను వినండి. ఆయన పెద్ద స్పెషలిస్టు తన కుమార్తెకే ఆపరేషన్ కండక్ట్ చెయ్యాల్సొచ్చింది. ఆపరేట్ చేసి గర్భంలోంచి శిశువుని తీసెయ్యాలి...అతనితోటి సర్జన్ అతన్ని ఆపనికి పూనుకోవద్దన్నాడు. తను కండక్ట్ చేస్తానన్నాడు. కాని ఈయన ఒప్పుకోలేదు. ఏ ఫీలింగూ లేకుండా ఉండగలనన్న ధైర్యం ఆయనకుండేది.... కాని ఆపరేషన్ నడుస్తున్నప్పుడు... సగంలో...ఆ అమ్మాయికి తెలివి వచ్చేస్తొందేమో అని అనుమానం తట్టిం దతనికి. ఆతురత, భయం రెండూ వెంటనే కలిగిఉంటాయి. వెంటనే క్లోరోఫారంతీసి మరొకసారి, కొద్దిగా ఎక్కువ కాలం ఇచ్చేడు...దానితో ఆవిడ ప్రాణాలు పోయేయి... ఆ పెర్సనల్ ఫీలింగుంటే లాభంలేదు...జాలి పుట్టినప్పుడు అది ఒస్తుంది...

సర్దార్: మీరు పట్టిన కేసులలో మీరు చాలా వాటిలో నెగ్గుకొస్తున్నారనుకుంటాను...

రామా: ఎందు కడుగుతున్నారు...

సర్దార్: నాపనికీ దానికీ సంబంధం ఉంది కాబట్టి.

రామా: దేనికన్నా హామీ ఇవ్వలేం చూడండీ... నాకు సాధ్యమైనంతవరకు చేస్తాను...ఫలితం నేను చెప్పలేను...

సర్దార్: ...నే నడిగిన ప్రశ్నకి చెప్పండి...

రామా: (వింతగా చూసి) ఏం? అంత ఖండిస్తున్నారు?

సర్దార్ : నాగొంతు అలానే ఉంటుందిలెండి...

రామా: మీగొంతులో మార్పు కనిపిస్తోంది...

సర్దార్: నేను చెప్పవల్సిన రహస్యం ఇంక చెప్పొచ్చు కాబట్టి

రామా: నాలో రాక్షసుణ్ణి సంబోధిస్తున్నా రనుకోవాలా?

సర్దార్: ఎలా అనుకున్నా బాధలేదు. మీరనుకున్నా లేకపోయినా వాడు వినక మానడు. వాడు దాన్ని దాచుకుంటాడు...

రామా: సరే...అదేమిటో చెప్పండి...

సర్దార్: ముందు నా ప్రశ్నకి జవాబివ్వండి

రామా: నూటికి తొంభైకేసులు సెగ్గుకొస్తున్నాను...

సర్దార్: నూటికీ తొంభైకీ పదేకదూ భేదం?

రామా: అది మీరు నన్నడగక్కర్లేదు.

సర్దార్: పది. అట్టే పెద్దభేదంకాదు...(గొంతు సవరించుకొని) సరే వినండి... కొత్తపట్నంలో కలరా ఉంది...

రామా: కలరా ఆ? ఉంటే ఉండొచ్చు. ఇది దాని ఋతువే మరి...ఆరోగ్యశాఖవాళ్లేమీ జాగ్రత్త తీసుకోలేదూ?

సర్దార్: ఊళ్ళో అందరిగురించీ నేను రాలేదు. వాళ్లేమైతే నాకేం...

రామా: మీకు సంబంధించినవారి కెవరి కన్నా...

సర్దార్: అది చెప్పేముందు నా సంగతి కొంచం చెప్పకోవాలి...కొత్తపట్నం మొఖాసాదారని ఇప్పు డెవరినంటున్నారో ఆయన ఏమీకారు...

రామా: ఆయన మొఖాసాదారు కారూ?

సర్దార్: ఆయన కొడుకు మొఖాసాదారు... తండ్రి కేవలం పార్వతీశమే.

రామా: ఔనౌను...పార్వతీశం...ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది పేరు...ఏం? పార్వతీశంగారు కారూ మొఖాసాదారు?

సర్దార్: కాదు...

రామా: ఏం? ఎలా?

సర్దార్...అదే చెప్పబోయేది...పార్వతీశం తమ్ముణ్ణే నేను...

రామా: నిజంగా!

సర్దార్: అబద్ధం అయితే బాగుణ్ణు...తగువే ఉండకపోను...

రామా: ఇప్పుడొచ్చిన తగువేమిటి?

సర్దార్...తగువేమీ లేదు. ఈ ఆస్థి పార్వతీశం ఆర్జించింది కాదు...మా తండ్రి ఆర్జించింది...మా తండ్రికి మేం ఇద్దరమే కొడుకులం...మా తాతనించి మా తండ్రికి వచ్చినది చాలా తక్కువ...కొంచం భూములు...వాటిలో నే నాకు సగం వాటా ఒచ్చింది ...మాకు పెళ్లికాకముందునుంచీ మా తండ్రి, మొదటి మనుమడికి ఆస్థంతా రాసేస్తానని అంటూ ఉండే వాడు... మేం ఇద్దరం పెళ్ళిచేసుకున్నాం...మా అన్న అదృష్టం బాగుంది...కొడుకు పుట్టాడు... నాకుమాత్రం పుట్టింది ఒకకూతురు...మా తండ్రి స్వార్జితం ఆస్థి...ఎలా పడితే అలా రాసుకోవచ్చు ...అనుకున్నంతా చేసి చచ్చేడు మా తండ్రి...ఆ మనుమడికి అంత ఆస్తీ వెళ్లింది...అంటే మా అన్నకి వెళ్లినట్టే లెఖ్ఖ...అది, నా దురదృష్టం అనుకోవాలో ఏమో నాకు తెలీదు...

రామా: అతని అదృష్టం అనుకోండి...

సర్దార్: ఆ వీలులో చిన్న కిటుకుంది...ఒక వేళ ఆ మనుమడు ఏ కారణంవల్లయినా పిల్లలు లేకుండాపోవటం తటస్థిస్తే, కొంతభాగం, అది చాలా తక్కువలెండి, ఆ మనుమడి భార్యకి పోను మిగిలినదంతా మా ఇద్దరిమధ్యా పంపకం జరగాలి...

రామా: ఇప్పుడు మీ కింకేం లాభం

సర్దార్: ఇప్పుడు అదృష్టం నావేపు తిరిగింది..

రామా: ఎలా ?

సర్దార్: ఇక్కడే ఉంది నే చెప్పబోయే రహస్యం...మా తండ్రిపోయేక అట్టేకాలం నే నా ఇంట్లో ఉండలేదు...మా అన్నకీ నాకూ పడలేదు...

రామా: అది ఊహించుకోవచ్చు...

సర్దార్: దేనికన్నా న్యాయముంది చూడండి. ఆ కుర్రాడికి క్షయ...

రామా: క్షయా? అతని వయస్సెంత ఉంటుంది...

సర్దార్: ఇరవైతొమ్మిది సంవత్సరాలే లెండి..

రామా: ఊఁ.

సర్దార్: సరే వినండి...నేను చాలా మోటు మనిషిని. నన్ను రౌడీ అని పిలవడంలో అర్థం లేకపోలేదు. తల్చుకుంటే ఏదన్నా చెయ్యగలననుకోండి...బుద్ధి పుట్టినంతవరకే...

రామా: (వింతగా చూసి) అదంతా ఇప్పుడెందుకు? కలరా సంగతేదో చెప్పబోయేరు...

సర్దార్: అదికూడా అవసరం కనక నే...ఇంకో గంటలో మీ శత్రువు మీ ఇంటికొస్తాడు

రామా: శత్రువా !!

సర్దార్: అంటే మీ తండ్రిమీద పగపట్టిన పార్వతీశం, మొఖాసాదారు తండ్రి...

రామా: పార్వతీశంగారా? నా శత్రువా?

సర్దార్: తండ్రిమీది కోపం, కొడుకుమీద కూడా ఉండకపోదు...

రామా: కాని నేనలాటిది పట్టించుకోను... ఇందాక మీకు చెప్పేను...(ఊరుకొని) నా శత్రువు అనకపోతే మీ శత్రువు అనరాదూ?

సర్దార్: ఎందుకనకూడదూ? తప్పకుండా అనొచ్చు—అనండి...

రామా: (చిరాకుగా) నాకా అవసరంలేదు... మీరే అనండి...సరే...ఆయన వస్తే...

సర్దార్: (మీసం దువ్వుతూ, అలవాటు ప్రకారం) వచ్చి మిమ్మల్ని పిలుస్తాడు కొత్త పట్నం...

రామా: దేనికి?

సర్దార్: మీ తండ్రి కాలంలో భార్యకి సుస్తీ చేసింది...ఇప్పుడు కొడుక్కు...

రామా: అతని కొడుకా? మీ రన్న క్షయవల్ల కాని...

సర్దార్: కాదు. కలరా.

రామా: కలరా!!

సర్దార్: ఔను. ఊళ్ళో అక్కడక్కడుంది... వాటితో నాకు సంబంధం లేదు. కాని ఇది...(ఊరుకొని) ఇవాళ ఉదయం ఆరంభమయింది...ఆ సంగతి తెలిసి నేనా ఊరు వెళ్ళేను. ఆ ఇంటికి వెళ్ళలేదనుకోండి.

రామా: ఇవాళ ఉదయం...కలరా! ఆలోచించండి...ఎంత ప్రమాదమో......ఇప్పుడొస్తున్నారాయన డాక్టర్ కోసం...

సర్దార్: చాలా సేపు ఏదో అజీర్తి అనుకున్నట్టుంది...

రామా: నా కొకందుకు చాలా విచారంగా ఉంటుంది...ఈ పేషెంట్లని చూస్తూ ఉంటే... రోగం ఏదన్నా బాగా ముదిరితేనే కాని బైటపడరు. అప్పుడు బాగుచెయ్యాలి...అటువంటి సందర్భంలో నెగ్గుకురావడం ఎంత కష్టం!

సర్దార్: మిమ్మల్ని డాక్టర్ గా ఎంచుకోడానికి తటపటాయిస్తున్నాడుదయంనించీ...మీరు తప్ప ఇంకెవరూ సరైన డాక్టరీ ఊళ్ళో...మీ తండ్రిమీద కోపం ..ఈ రెండింటి మధ్యా సందిగ్ధంలో పడ్డాడని విన్నాను...ఇష్టం లేకపోయినా తప్పదు...మీదగ్గరికే నిశ్చయంగా వస్తాడని నా నమ్మకం...

రామా: నేనే అని ఎందుకు? అటువంటివాళ్ళకోసం ఈ ఊళ్ళో ఏ డాక్టరన్నా కష్టపడతాడు...

సర్దార్: వీళ్ళ పస అందరికీ తెల్సు...అతగాడు మీదగ్గరికి రావడం తప్పదు...నే నొక ప్రశ్న వేస్తాను చెప్పండి...

రామా: వెయ్యండి...

సర్దార్: ఇంత ఆఖరిదశలో, మీ రీ ఏడు మైళ్ళు వెళ్ళడంలో లాభం ఏముంది?

రామా: (విమర్శగా చూసి) లాభం ఉన్నా లేకపోయినా ప్రయత్నం చెయ్యడంలో ఏం నష్టం లేదనుకుంటాను...

సర్దార్: ప్రయత్నిస్తే ఏమన్నా ఆశ ఉందంటారా?

రామా: ఉండొచ్చు...

సర్దార్: మీరు వెళ్ళడంలో నష్టంకూడా ఉండొచ్చునేమో...

రామా: మీ రలా అనుకుంటున్నారా? నామట్టుకేం నష్టం కనుపించలేదు...

సర్దార్: నష్టం ఉందంటాను...

రామా: (చిరాకుగా) మీకా?

సర్దార్: (కొంచం తృళ్ళిపడి) మీకుకూడా...

రామా: (ఆశ్చర్యంగా) ఎలానో సెలవిస్తారా?

సర్దార్: (ఆలోచనగా లేచి) మీరు వెళ్ళడం ఖాయం. మీ మాటలనిబట్టి తెలుస్తోంది ... కాని మీ రే నెగ్గినట్టయితే మీకు నష్టం...

రామా: (లేచి) మీరు నన్ను...

సర్దార్: బెదిరించలేదు...మీకొక మంచి అవకాశం ఇస్తున్నాను...అది పోకుండా చూసుకోండి....

రామా: అదేమిటో! ఎందుకంతదయ నామీద?

సర్దార్: స్వలాభంఉంది కాబట్టి...(ఊరుకొని) మీ రే ఇందులో నెగ్గుకు రాలేకపోతే,...అంటే నా మోటుమాటలలో చెప్పాలంటే .... మీ పేషెంటు బ్రతక్కపోతే....

రామా: మీకు వంతొస్తుందికదూ వీలుప్రకారం?

సర్దార్: నిజం చెప్పేరు ... చూసేరా ఎంత లాభం ఉందో!

రామా: మీకు...

సర్దార్: మీకుకూడా...

రామా: ఒక్క అపజయంతప్ప నా కింకేదీ ఉండదు...

సర్దార్: పోయే పదింట్లో ఇదొకటవుతుంది పదీ మీరెలానూ మార్జిన్ ఇచ్చేసేరు ... తొంభైకీ, నూటికీ అట్టే భేదంలేదని ఇందాక అన్నానుకదూ? మీ పేరుకేం దెబ్బరాదు

రామా: అదే అయితే, మరి అలా అనుక్కోనే తృప్తిపడాలి.

సర్దార్: ఈసారి అలా క్కాదులెండి...పది మందిలోనూ ఇతనొక్కడైతే నాకు లక్ష రూపాయిల లాభం. అంతకు తక్కువలేదు.

రామా: (అనుమానంగా చూస్తూ) అదే అనుకున్నాను.

సర్దా: అందులోది మీకు పదివేలు.

రామా: పది వేలు!! నాకు!! (ఊరుకొని) మీ మాటల్ని బట్టి అదే ఏదో అనుకున్నాన్లెండి...

సర్దా: కాని మీ రొకటాలోచించాలి...ఈ పదివేలూ నే నూరకనే ఇస్తున్నట్టు లెఖ్ఖ—అంటే చాలా తక్కువ సాయానికి వదులుకుంటున్నాను.

రామా: మొదట్నించీ మీ అభిప్రాయం నాకు తెలుస్తూనే ఉందిలెండి.

సర్దార్: మీరు పట్టిన వంద కేసులకీ, తొంభై వాటిలో మీరెలా నెగ్గుకొస్తున్నారో...మీరెలా హామీ ఇచ్చేరో...అలానే ఈ కేసులో తొంభై పాళ్లు నాకు నిబ్బరం...మీరు కాదు, బ్రహ్మదిగి వచ్చినా సరే మీ పదిలోనూ ఇతనొకడౌతాడని.... మిగిలిన పది పాళ్లూ కూడా బకాయిఉంచడం నా కిష్టం లేదు. ఇలాటి అవకాశం మరి రాదు కనక... ఆ పది పాళ్లు కూడా పూర్తిచెయ్యడానికి మీకు పది వేలు.

రామా: (ఆవేశం అణుచుకుంటూ) ఊఁ.

సర్దార్: కొంచం అశ్రద్ధ—అది చాలు. నూటికి నూరుపాళ్లు నాకు నిబ్బరం...డబ్బు మీరు తిరిగి ఇంటికి వెళ్ళేటప్పుడు మీకు నేనిస్తాను రెండో కంటివాడికి తెలీకండా. మీకు అపనమ్మకం అక్కర్లేదు. డబ్బు సిద్ధంగా ఉంది...నా దొకటే మాట—

రామా: అతను నా తొంభైలోనూ ఒకడైతే?

సర్దార్: అలా అవదు. తొంభై పాళ్లు నాకు నిబ్బరం. ఆ పదిపాళ్ళలోనూ అయితే అందుకు మీరు బాధ్యులు...

రామా: అలానే అనుకోండి...

సర్దార్: అలా కాదు. జరగదు. అందుకే మీలోని రాక్షసుడికి రహస్యం చెప్పేను. అతనలా చేయడు...

రామా: నాలో అలాటి రాక్షసు డెవ్వడూ లేడు. ఉన్నా నాలోని మనిషిని జయించలేడు.

సర్దార్: పది వేలు ఆటంబాంబులాటిది వాడికి. (నవ్వుతాడు)

రామా: అది వాడికి అందకుండా చేస్తే?

సర్దార్: అందుకు మీరు ప్రయత్నం చెయ్యరనుకుంటాను...ఎలానూ వాడి చెవికి వెళ్ళింది కదా వార్త. అది కొంచం నిబ్బరం. ఆలోచించండి. ఇందులో ఎవ్వరూ అనుమానించవల్సిన విషయం ఏమీ ఉండదు.

రామా: సరే—మీరు చెప్పవల్సిన విషయం అయిపోయింది కదూ? మీరు ఒక దమ్మిడీకూడా ఖర్చుపెట్టడం నా కిష్టంలేదు ..

సర్దార్: (కొంచం సంతోషంతో) అంటే?

రామా: పదివేలు! చూడండి...అంత డబ్బు మీరు నష్టపోవడం నా కిష్టంలేదు...నా గురించి.

సర్దార్: ఏమీ పుచ్చుకోకుండా సాయపడతానంటారా? రామారావుగారూ! అలా నా కిష్టంలేదు ...ఇంకా సంతోషం అయితే పోతేపోయింది మరో అయిదు వేలు మీ కిస్తాను...

రామా: ఎందుకు? ఏమీ వద్దు.

సర్దార్: నిజంగా!

రామా: నిజంగానే. తొంభైపాళ్లు నిబ్బరంతో మీరు గెలవరని నే నెలా చెప్పగలను? నాకు గుండేది? అందులోనూ ఉదయం మొదలైన కలరా...తొంభై కాదు—తొంభైతొమ్మిదిపాళ్లు మీరు నిబ్బరంతో ఉండొచ్చు...

సర్దార్: (సంతోషంతో) నిజంగా! ఏదీ... మీ చెయ్యి ఇలా ఇవ్వండి...

రామా: కాని ఆ మిగిలిన ఒక్కపాలూ నేను నాలో ఉన్న శక్తి, జ్ఞానం అంతా వినియోగించి ప్రయత్నిస్తాను...మీ తొంభైతొమ్మిదిపాళ్ళ నిబ్బరాన్ని నాశనం చెయ్యడానికి...

సర్దార్: (ఆశ్చర్యపోయి, నమ్మలేక) ఏమిటీ! ఏమిటీ!

రామా: నేను డాక్టర్ని—ఒక రోగాన్ని పోగొట్టడానికి చెయ్యవల్సిందంతా నేను చెయ్యాలి ...చేసాను—

సర్దార్: ఆలోచించే మీ రంటున్నారా ఈ మాట?

రామా: ఆలోచించడం అన్న ప్రశ్న లేదు... ఇలాటివి నే నాలోచించను...ఆ శక్తి నాకులేదు...

సర్దార్: సరే. అయితే మీకు కలిగే నష్టం ఆలోచించేరా?

రామా: మీ ప్రకారం పది వేలు—

సర్దార్: అదే కాదు—మీరు తిరిగి ఇంటికి రాలేరు...

రామా: (కొద్దిసేపు ఊరుకొని) డబ్బెప్పుడైతే చూపించేరో బెదిరింపుకూడా ఉంటుందని నాకు తెలుసు...

సర్దార్: ఇది ఉత్త బెదిరింపు కాదు. జరుగుతుంది. నా సంగతి మీకింకా తెలీదు...

రామా: సర్దార్ గారూ!..మీ ధైర్యం ఏపాటో నాకు తెల్సు-మీ రేపాటి అపకారం చెయ్యగలరో నాకు తెల్సు—

సర్దార్: చెయ్యలేననుకుంటున్నారా. ఏమిటి మీ ధైర్యం?

రామా: నేను మీతో చెప్పను—కాని మీ ధైర్యం తెలుసు—మీరింక వెళ్ళండి—

సర్దార్: అయితే కాసుకోండి — మీరింకా వయస్సులో చిన్నవారు—పెళ్ళికూడా కాలేదు—

రామా: అది మంచిదేకదూ కాచుకోడానికి—ఎవ్వరూ ఏడిచేవారుకూడా లేరు—

సర్దార్: ప్రాణం అంటే అంత చులకనగా చూస్తారా? సరే - నేను వెళ్తున్నాను—మీ గురించి విచారంగా ఉంది ..పోలీసుల్ని తెస్తారేమో - అదేం లాభం లేదు - ఎక్కడా ఋజువు లేకుండా అంతా అయిపోతుంది - నా సంగతి మీకింకా తెలీదు...

రామా: సరే తెల్సుకుంటాను - వెళ్ళండి!

సర్దార్: ఆలోచించి మనస్సు మార్చుకున్నట్టయితే - అంటే నే ననుకున్నదే అయితే మీకు బాధ లేదు—

రామా: నేను ఆలోచించేను—

సర్దార్: వెళ్తున్నాను- కాని ఇది తెల్సుకోండి- అతను బ్రతుకుతే మీరు తిరిగిరారు - అతను పోయినా అది మీ ఇష్టానికి వ్యతిరేకంగా జరిగినట్టే లెక్క - అప్పుడు మీకు కలిగే నష్టం ఒక్క పది వేలే—

రామా: మళ్ళా నన్ను ఆశపెట్టి లొంగతీద్దాం అనుకుంటున్నారు - లాభం లేదు - వెళ్ళండి—

[సర్దార్ ఇంకా నిల్చుంటాడు]
నే నాలోచించటం లేదు!

సర్దార్: (కోపంగా) అయితే కాసుగోండి!!

[గది వదుల్తాడు సర్దార్ - రామారావు వెళ్ళి అస్థిపంజరం ముందు నిల్చుంటాడు దానిని చూస్తూ - అలా దానిముందు రెండుమూడు నిమిషాలు నిల్చుంటాడు - అతనేదో ఆ పొందుతున్నట్టు అతని ముఖం జేవురించుతుంది - ఆఖరికి ఒక నిట్టూర్పువదిలి, వెళ్ళి సోఫాలో కూర్చుంటాడు, ఆలోచిస్తూ]

[తెర]

[సశేషము]

# * పెద్దన: మనుచరిత్ర *

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

అల్లసానివారి కీర్తి కృష్ణరాయలవారి కీర్తితో అల్లిక జిగిబిగియైనది.

విజయనగ రాస్థానమున కృష్ణరాయల కాలమున వెలసిన కృతులలో రాయలు స్వయముగా నర్థించి యంకితముగొన్న దొక్క మనుచరిత్ర మాత్రమే.

మనుచరిత్రతోపాటు హరికథాసారమను, వేఱొక కృతిని లాక్షణికు లుదాహరించినారు. పాత్రపు వెంకటరమణకవి లక్షణశిరోమణి1 యను లక్షణగ్రంథములో పెద్దన సత్యావధూపరిణయములోనిదని యీ క్రిందిపద్యము నుదాహరించి యున్నాడు:

కనుపింద్రై యభిషిక్తుఁడైన విభు నా
జ్ఞం గొల్వులో సీత యి
చ్చిన ముక్తామణిహార మెవ్వడు ధరిం
చెన్ మేరు కూటంబుఁ జు
ట్టిన మిన్నేఱనఁగా మెడంబెడగుఁ బు
ట్టింపంగ నయ్యాంజనే
యు నజేయున్ కరుణావిధేయు నిరపా
యుం గొల్తు వాంఛారతిన్.

'ప్రపంచ దర్పణము' అను సంస్కృత సంకలన గ్రంథమున 'అల్లసాని పెద్దనార్యేణ విరచిత సత్యావధూపరిణయే' అని యుదాహృతమైనది. ఇది రాయలవారి సంస్కృత కృతులలో నొకటిగదా. వారి సంస్కృత సకల కథాసార సంగ్రహము ననుసరించి యెలకూచి రామభద్రకవి సకల కథాసార సంగ్రహము తెనుగున రచించెను. అట్లే పెద్దనయు సత్యావధూప్రీణనము ననుసరించి యీ కృతిని రచించి యుండవచ్చును. రాయలవారిది ప్రీణనము పెద్దనది పరిణయము. సత్యావధూ ప్రీణనమునకు తెనుగు పారిజాతాపహరణమున్నది గదా. రాయలవారు రచించిన కృతులకు ఆస్థాన కవులు రచించిన కృతులకు గల నాంతరంగిక సంబంధ మింకను పరిశోధింపదగియున్నది.

మనుచరిత్రప్రశంస, ప్రశస్తి చాటువులలో కూడ నెక్కినది. వెలుగోటివారి చాటువులలో క్రీ. శ. 1600 ప్రాంతముల విలసిల్లిన మహాశూరుడు యాచమనాయని గూర్చి చెప్పిన చాటువులు గలవు. వానిలో నొకదానియం దిట్లు గలదు:

సీ. ధర నేలు నీ ప్రభుత్వము యయాతి చరిత్ర
వరకీర్తి రాజశేఖర చరిత్ర
వెలయు నీ శౌర్యంబు విక్రమార్క చరిత్ర
ఘనమైన నీతి యా మనుచరిత్ర
ఖ్యాతి నీ హరిభక్తి రుక్మాంగద చరిత్ర
పొసగు నీ సిరియంబు వసుచరిత్ర
నిత్యంబు నీ బుద్ధి సత్యధర్మ చరిత్ర
చెలగు నీ రూపంబు నలచరిత్ర

గీ. ఇన్ని చరితలు నీయందె యున్న విపుడు
వసుధ నీ భాగ్యమెన్న నెవ్వారితరము
పద్మనాయక వంశాబ్ధి భవ్యసోమ
రంగ ఘన యాచధీర విక్రమవిహార.

పై కృతులన్నియు తెనుగు ప్రబంధములే. సత్యధర్మచరిత్ర అనగా హరిశ్చంద్ర చరిత్ర— ఇందు పేర్కొనబడినవన్నియు క్రీ. శ. 1600 ప్రాంతమునకు ముందుగా రచితములు.

మనుచరిత్ర రచనమువలన పెద్దన కవిత్రయము వారితో నుద్దియైనాడని వెన్నెలకంటి వేంకటపతి యిట్లు చెప్పినాడు—

---

1. ఈ గ్రంథ మముద్రితము—ఇది యొక విపులమైన లక్షణగ్రంథము. క్రీ. శ. 17 వ శతాబ్దినాటిది; మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున, ఆంధ్రసాహిత్యపరిషత్తులో దీని ప్రతులు గలవు.

ఇద్దరు జోడు నన్నకవి
యెఱ్ఱన, తిక్కన సోమయాజి దా
నుద్దగువారికిన్, ముగురి
క్కొక్కఁడె దీటగు నల్లసాని మా
పెద్దన, వారితోడు తమ
పేరు వహించిన శ్రీ కణాదముం
బెద్దన సోమయాజి నిముఁ
బెద్దనఁబోలుఁ గవిత్వసంపదన్.

మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవ పాండవీయము, శృంగారనైషధము, ఆముక్తమాల్యద అనునాంధ్ర పంచకావ్యములలో మొదటిది మనుచరిత్ర. ఒకించుక భాషా పాండి మున్న చదివి యానందింపదగినది. వసుచరిత్ర చదివి యానందించుటకు భాషా పాండిత్యమే గాక శాస్త్రీయసంప్రదాయ పరిజ్ఞానము చాలగా నవసరము. మనువు గట్టి పడినగదా వసువుపై భ్రాంతి. మనువు వసువు గట్టి పడినవెనుక, రామా! కృష్ణా! యని రాఘవ పాండవీయమును జదివి, కలివిధ్వంసకమగు నైషధ దివ్యదన్నుతమును సేవించి యాముక్తమాల్యము ధరించుటకు నాంధ్ర సాహిత్య స్నాతకుఁడర్హుడగును—ఆంధ్ర సాహిత్య సౌధమునకు మొదటి సోపానము మనుచరిత్ర.

మనుచరిత్రకు తొలుత టీక లేదు—ఆవశ్యకతయు లేదు. భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు 1832 లో ఆస్థానమల్లినాథుడైన అప్పయపంతుల వారిచే టీకాతాత్పర్యము వ్రాయించినారు. ఈ టీకతో నిది క్రీ. శ. 1851 లో ముద్రితమైనది. మనుచరిత్ర మొదటిముద్రణ భాగ్యమందినది యీ వత్సరమునందే. పాండిత్యము వ్యుత్పత్తి, శబ్దార్థపరిజ్ఞానమువలనగాని కలుగదు. బ్రౌనుదొరవారీ మనుచరిత్రకు 1839 లో నొక శబ్దసూచికకూడ వ్రాయించినారు. కాని పాశ్చాత్యవిమర్శనపద్ధతుల పరిపాటియే ప్రధానముగా నున్న నేడు, ఆ శబ్దసూచి మొగమైన జూచువారులేరు. ఈ తరువాతి ముద్రణములందైనదది చేర్చబడలేదు.

సాహిత్య విమర్శనకు శబ్దార్థపరిజ్ఞానము సునిశిత పరిశీలనము, అత్యంతావశ్యకములు. దానికి సాధు పాఠ సంస్కరణముతో గూడిన గ్రంథ మాధారము. ఈ యభిప్రాయముతో నే, కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రిగారు బహుళ ప్రాచుర్యముగల మనుచరిత్రమున పెక్కు ప్రశస్త పాఠములను వెల్లడించినారు. ఆనందముద్రణాలయమువారి ప్రతిలో వీనిని గానవగును. మఱియు నీ పరిశోధనల మూలమున వెలుగబడిన నూతనవిషయములను తత్పరిష్కర్తలగు శ్రీయుత బులుసు వేంకట రమణయ్యగారందు వెలకొల్పినారు. అయినను కవిచరిత్రయందును వ్యాఖ్యానమునందును చేర్పదగిన యంశములు కొన్నింటిని తెలుపుచున్నాను.

## పెద్దన మాలికా కవిత్వరచన :

ప్రబంధరచనకు మార్గదర్శకులు కాకపోయినను పెద్దనగారు మాలికా కవిత్వరచనకు మార్గదర్శకులు.

"పూతమెఱుంగులున్ పసరు
పూప బెడంగులు...సారెసారెకున్"

తుఱంగలింపగా ముప్పది చరణములుగల యుత్పల మాలికను రాయలవారి యాస్థానములో, అష్టదిగ్గజముల సమక్షమున నీ రచనకు పెద్దనగారు శ్రీకారము చుట్టినారు. నాలుగు పాదముల పరిమితిగల సమవృత్తములు చంపకోత్పలములు, శార్దూల మత్తేభములు మొదలగు వృత్తములు, ఆ పరిమితిని మించరాదని లాక్షణిక మతము.

అట్లు వారి వృత్తరచన యసంఖ్యాకముగా సాగించిననదిమాత్రొచ్ఛందస్సంఘటితములైన,ద్విపద, రగడ మున్నగువానివలె, ఏకధారగానుండి చదువరులకు విసువు గలిగించి, కావ్యోపయోగికములు కాజాలవు. ఈ యుద్దేశముచేతనే అనంతుడు ఛందోదర్పణమున ఇట్టి వృత్తములలో నొక్క పాదము మాత్రమే హెచ్చుగా వాడవచ్చుననియు చెప్పి, దానికి 'పంచపాది' అని పేరు పెట్టినాడు. అది యుత్పలమాలయే.

పెద్దనగారా నియమమును వీడి, సంస్కృతాంధ్ర సమపదపాళముగా నీ మాలికను రచించినారు. దీనికి సింహావలోకనోత్పలమాలిక అని పేరు. అనగా చివర పదములు సారెసారెకున్ అను వానితో మొదలిడిన, సారెసారెకున్, పూత మెఱుంగులున్ పసరు పూప బెడంగులు జూపునట్టి వాకైతలు, అను సమన్వయము కుదురుచున్నది. నూతనముగా నిట్టి పథకమును ద్రొక్కినందుకు, రాయలవారు పెద్దనకు కవిగండ పెండేరము నొసంగుట సమంజసమే.

ఆ సభలోనే పెద్దన వెనుక భట్టుమూర్తియు మఱియొక మాలికను చెప్పియున్నాడు. ఇదియు నుత్పలమాలయే.

పెద్దనగారి వెనుక నీ మాలికాకవిత్వరచన వ్యాప్తమైనది. మహాలక్ష్మికుపెసు గణపవరపు వేంకట కవి 'పెద్దళగిరి విజయము'1 అను పేర, నాలుగు మాలికలను రచియించియున్నాఁడు. తూర్పుమాలిక, దక్షిణపుమాలిక, పడమటి మాలిక, ఉత్తరమాలిక అని వాని పేళ్లు. ఏకోజీరాజు తంజాపురముపై క్రీ శ. 1674 లో దండెత్తివచ్చి, పెద్దళగిరిచే పరాజితుఁడైన వృత్తాంతమిందు వర్ణితమైనది. ఇందు 414 ఉత్పలమాలికా చరణములు గలవు. ఈతఁడే 'ఆంధ్రకౌముది'2 అను పేర వేయి చరణములుగల సీసమాలిక రచియించియున్నాఁడు. అదియు ముద్రితమైనది.

దక్షిణాంధ్ర వాఙ్మయమున నీ మాలికారచన ప్రవేశపెట్టినది విజయరాఘవనాయకుడు. ప్రహ్లాద చరిత్ర యక్షగానమున మొదట నొక సీసమాలికలో నాతడు రచించిన గ్రంథములను చెప్పియున్నాడు.

పుదుక్కోటలో నుదురుపాటి వెంకనకవి ఆతని మనుమడు సాంబశివకవి, 'తోండమాన్ వంశావళి'3 అను పేర సీసమాలికలను రచియించియున్నారు. అవి రెండును కలిసి 500 చరణము లున్నవి. ఇవి రెండును ముద్రితములు.

ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో 'వికచోత్పలమాల' అనునొక యుత్పలమాలికారచన గలదు. అది యంతయు 'ర' కార ప్రాసము.

శ్రీ రమణీమణీ కుచకు
  శేశయ కోశల సత్పటీర కా
శ్మీర నిశా కురంగమద
  మిశ్రిత కుంకుమసాంద్ర చంద్రనీ
హారపయోఘుమంఘుమ ఘు
  మాయితవక్షు, సుధాబ్ధికుందమం
దారతుషారపారద సు
  ధాకరహారశతారతారడిం
డీరశరద్బలాహకప
  టీరసితాంబుజతారహారగో
క్షీరసురాపగావిమల
  కీర్తివళక్షు, విదూరకంసచాణూర...

అని మొదలిడి యించుమించుగ 1930 చరణములలో

ముని
  శేఖరుఁడైన ప్రచేతసాత్మజుం
డారసికూర్చినట్టి యితి
  హాసము సంకుచితంబుగాఁగఁ దా
నేరిచినట్లు శ్రీహరిని
  నెమ్మనమందుఁ దలంచి మ్రొక్కి మం
దారమరందగుంభిత సు
  ధామయశబ్దవిచిత్రచాటు వా
గ్ధోరణిమీఱ వత్సముని
  గోత్రలలాముఁడు గొడ్లవర్తి వి
స్తారకులాబ్ధిపూర్ణ హిమ
  ధాముఁడు......................

వేంకనమంత్రి చంద్రుఁ డిం
  పార రచించినట్టివిక
    చోత్పలమాల....

ఈ గొడ్లవర్తి వెంకనమంత్రి కవిచరిత్రమున కేవలు కపరిచితుఁడు.

కడచినశతాబ్దిలో నుద్దండ కవిపండితుఁడు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి పెద్దనగారొక్కటి సంస్కృతాంధ్రములలో నే చెప్పగా, నట్టిమాలికలను రెండింటిని చెప్పిరి. ఒకమాలికలో విశేషమేమనగా నందు సగము తెలుగు సంస్కృతపదములు, సగము అరబ్బీ ఫారసీ మొదలగు నన్యదేశీయములు.

మాలికాకవిత్వమునకు పితామహుఁ డనదగిన మహావ్యక్తి మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు. వీరు 1833-1897 ప్రాంతముల విలసిల్లిరి. అసమాన ధారాధోరణితో రసము చిప్పిలు నట్లుగా నే వృత్తముతో

---

1. ఈ గ్రంథమంతయు పూర్తిగా ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము బుల్లెటన్ 5 వ సంపుటము. 2 సంచికలో 47 - 68 పుటలలో ముద్రితమైనది.

2. ఆంధ్రసాహిత్య పరిషత్తు-కాకినాడ.

3. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక - 2 సంపుటము 6 సంపుటము.

సెట్టి ప్రాసతోనైన మాలికలు రచించు సామర్థ్యము గలవారు. ఈ మాలికారచనలు కొన్ని గ్రంథరూపమున నున్నవి.

త్రైపదేంద్ర గురుచరిత్ర—ఇది బిందుపూర్వక దకార ప్రాసముతో చెప్పబడిన 500 చరణములు గల యుత్పలమాల.

ఉపన్యాస విలాసభూషణము—ద్విత్వనకార ప్రాసముతో చెప్పబడిన 240 చరణములు గల యుత్పలమాల.

ఇంకను 'కుదురుగఁ దావకీన' అను పాదముతో మొదలిడి, అయిదక్షరముల ప్రాసతో నొక మాలికను, 'ప్రిన్సుప్రువేల్సు' అను పదములతో ప్రారంభించి మఱియొక మాలికను, మఱియు నెన్నెన్నో అద్భుతరచనములను గావించినారు.

పెద్దన ప్రారంభించిన మాలికాకవిత్వరచన విశేషవ్యాప్తిలోనికి దెచ్చినవారగుటచేత, 'అభినవాంధ్ర కవితా పితామహ' అను బిరుదము లభ్యమై సార్థకత చెందినది. వీరి రచనములు పూర్వము నెల్లూరిలో విలసిలిన అముద్రితగ్రంథ చింతామణి పత్రికలో ప్రకటితములైనవి.

కీర్తిశేషులు, వసురాయకవి, భోగరాజు నారాయణమూర్తి సెట్టి లక్ష్మీనరసింహము, ఉమర్ ఆలీషా మున్నగు వర్తమాన కవిశేఖరులు మాలికారచనమున నెన్నిక గన్నవారు. ఇంకను మఱికొందరు గలరు. వారిని పేర్కొనుట కిట తావులేదు.

ఖండముక్తక కావ్యరచన లఖండముగా సాగుచున్న యీ కాలమున మాలికారచన మూలబడినదన్న యాశ్చర్యమేమున్నది.

మనుచరిత్రయందు ప్రయుక్తములైన కొన్ని పదములను వాని యర్థవిశేషములను కొంతపరిశీలింతుము.

## 1. హింగుళా:

"కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా పాదాంభోరుహముల్."

1-71

హింగుళా క్షేత్రము ఏబది రెండు శక్తిపీఠములలో నొకటి. ఇది బెలూచిస్థానములో నున్నది. దీనిని గూర్చి నందలాలు డే గారి ప్రాచీన హైందవభూగోళ నిఘంటువునం దిట్లున్నది.

Hingula - Hinglaj situated at the range of mountains in Baluchistan called by the name of Hingula about a day's journey from the sea coast. The Aghor or Hingula river passes by its side. It is one of the 52 Pithas or places celebrated as the spots on which the disserved limbs of Sati are scattered. (Page 28. Geographical Dictionary of Ancient & Medival India—Nandalal Dey.)

ప్రాచీన హైందవ భూగోళమును వ్రాసిన కన్నింగహామ్ గారు దీని యునికి నిట్లు తెలిపి యున్నారు.

Hingulaj—Hingula Devi one of the 52 Pitha Stanas sacrad to the devotees of Godess Kali nine, days journey from Patha by Karanjee and about nine miles from the sea-shore. (Cunningham's ancient Geography of India. Page 696)

## 2. ఇనుప కచ్చడము:

"ఇనుప కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల తామరస నేత్రలిండ్ల బందాలుగారె'

2-73

మనుచరిత్ర వ్యాఖ్యానములలో గాని నిఘంటువులలో గాని దీని యర్థవివరణములు లేవు. ఈ 'ఇనుప కచ్చడము' అను ప్రయోగము పెద్దనకన్న ముందు జక్కన విక్రమార్క చరిత్రలో వాడియున్నాడు.

'జమిలి మొలత్రాట నినుపకచ్చడముమర్చి' 2.92

పెద్దనవెనుక తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యములో (4-278) 'విషయాంకురము గిల్లి వేయనివారికి నినుపకచ్చడమున కింతదవ్వు' అని వాడియున్నాడు.

బ్రౌనుదొరవారు మనుచరిత్ర ప్రయోగమునకు: 'గోచీ'—ఇనుపకచ్చడాలు కట్టినాడు; *He was rigorously Chaste*—*Manu* 1182 అని వ్రాసి

యున్నారు. శబ్దరత్నాకరమున నీ ప్రయోగమున కర్థము 'కౌపీనము' అని వ్రాయబడినది. సూర్యరాయాంధ్ర నిఘంటువున నిట్లే కౌపీనము - గోచి - అని కచ్చడము శబ్దమునొద్ద వ్రాయబడియున్నది 2 సం 28 పుట.

కాని పై ప్రయోగములన్నింటియందును, నిది ఇనుపకచ్చడము అని అజాది పదములలో చేర్చబడక, కచ్చడము శబ్దమున చూపబడి యున్నది.

పై విక్రమార్క చరిత్ర ప్రయోగమువలన నిది సర్వసాధారణముగా ధరించు కౌపీనమును గాక దానికి సంబంధించిన మఱియొక వస్తువునుకూడ మనకు స్ఫురింపజేయుచున్నది. ఒకడు 'గోచి పెట్టుకున్నాడు' అనగా "మొలత్రాటితో గోచీ పెట్టుకొన్నాడు" అని చెప్ప నగత్యము లేదు. మొలత్రాడు గోచీ రెండు అవి నాభావసంబంధము గలవి. కాబట్టి 'మొలత్రాట నినుపకచ్చడ మమర్చినాడనగా నిచట గోచీగాక వేఱొకవస్తువునుగూడ ధరించినాడని యర్థము చేయక తప్పదు. అది యినుముతో చేయబడినదని యినుప అను విశేషణము తెలుపుచున్నది. అది మొలత్రాటితో నమర్పబడియుండుటచేత మొలచుట్టు తిరిగివచ్చు స్వరూపముగలదై యుండవలెను. అది యినుముతో చేసిన నొకవిధమగు సన్నబద్దె.

యోగాభ్యాసకాలమున, యోగులు ఆసన స్థైర్యముకొఱకు ఒక యినుపబద్దెను మొలత్రాటచేర్చి ధరింతురు. ఊయ్యాలికొసనమున నిట్టి బద్దె యొకటి యున్నట్లుగా అమంచర్ల గోపాలరావుగారి వ్యాసమున (భారతిసం. 26, సం 4. పుట) 277లో కానగును.

ఇనుపకచ్చడమునకు పర్యాయపదము ఇనుపమొల. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రలో నీ ప్రయోగము కలదు

అరపైకంబును జేయని
హరివాసరమునకునై నిజాత్మజు దునుమన్
గరవాలు చేతఁ బూనిన
కరణి, యినుపమొలకు మేడ గాల్చుట జుమ్మీ.

(5-143)

ఇది ప్రత్యేకముగా నా యినుపబద్దెలను తయారు చేయుచుండెడివారని తెలుపుచున్నది. ఇనుమును నిప్పుతో కాల్చినగాని సాగదు - ఇనుపబద్దె చేయుటకు తగుమాత్రము నిప్పున్న చాలును. కాని విశేషముగా నవసరము లేదు. పై ప్రయోగములో నా విషయమే చెప్పబడినది—ఏమాత్రమును విలువలేని హరివాసరముకొఱకు (ఇవి మోహిని మాటలు) కన్నకుమారుని జంపుటకై కత్తి యెత్తుట, యినుపకచ్చడము చేయుటకు నొక పెద్దమేడ కాల్చునంతటి నిప్పు నుపయోగించుట వంటిది—అని దాని తాత్పర్యము.

వసూంధిని యిచ్చట సరిగానే చెప్పినది- జితేంద్రియత్వమునకై, యోగసాధన చేయుటకు నినుపకచ్చడముచే బంధనము గావించుకొను మునులు తామరసనేత్ర లింట్లలో బంధితు లగుచునే యున్నారు."

కాగా ఇనుపకచ్చడమనగా యోగులు ధరించెడి యినుపబద్దెయని పెద్దనగారిచ్చట నొక యపూర్వమైన యోగ సంప్రదాయ విషయమును తెలిపిరనియు గ్రహింపవలెను.

3 నక్కకొమ్ము:

"ఒక్క యెలుకకు జేఁపు నక్కకొమ్మును
నిట్టి గోరజంబు జున్ను చాలపవ్వ కాను
కిచ్చి—"

(4-14.)

సూర్యరాయాంధ్రనిఘంటువున 4 సంపు. పుట 510 లో నక్క + కొమ్ము. ఒకవిధమైన వనమూలిక యని వ్రాయబడి పై యుదాహరణమే చూపబడియున్నది. ఈ సంపుటి ప్రకటనకుముందే - కీ. శే. కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావుగారు. త్రిలిజ్ఞ రజతోత్సవసంపుటమున మనుచరిత్ర మను వ్యాసమున నీశబ్దమునుగూర్చి చర్చించియున్నారు. వారు దీనిని పసుపుకొమ్ము మొదలగువానిజాతిలోనిదని భావించియున్నారు. నక్కకొమ్ము—అనగా పులిగోరు అని అర్థము. ఇచ్చట నక్క అనగా జంబుకము అను నర్థము కాదు. నక్క అనగా పులి లేక చిఱుతపులి అని అర్థము. ఈ అర్థములో నీపద మిప్పటికిని రాయల

సీమలో వాడుకలోనున్నట్టు తెలియుచున్నది. చిఱుతపులికి చాలియుండవు. పులిని జూచి నక్క వాత పెట్టుకున్నది అన్న సామెతలో నక్క, అనగా మామూలు నక్క కాదు - చిఱుతపులి యనియే అర్థము. ఏక జాతిలో చేరినవే కాన స్పర్థచేత చిఱుతపులి చాలికొనుటకు ప్రయత్నించినది. తెలుగులో నే నక్కతోక కసవు అనుదానికి సంస్కృత నామము సింహపుచ్ఛి. పులి, సింహము మొదలైనవి యొకే జాతిలోని జంతువులుగదా. కొమ్ము ఆకారమునుబట్టి 'గోరు' అను అర్థమును సమంజసమే యగుచున్నది.

## 4. లాలాటికము:...

> పాటన సేయమిం గురులు పైఁబడి శీర్ణ
> పటీరపంక లాలాటికమై—3-53

ఇచ్చట లలాటిక శబ్దమునకు బదులు లాలాటిక శబ్దము ప్రయుక్తమైనది. లాలాటికశబ్దము పుంలింగము, ప్రభువుయొక్క అభిప్రాయమును తెలుసుకొనువాడు, కార్యమునందు నేర్పు చాలనివాడు అని దీని యర్థములు. పెద్దన యీ శబ్దము లలాటము అను నర్థమున వాడినాడు.

## 5 గ్రహయాళు:

'అద్రిగ్రహయాళు భల్లుకము'—4-38

సంస్కృతమున - గృహయాళు శబ్దమే గాని గ్రహయాళు శబ్దము లేదు.

"స్పృహయాళుః, గృహయాళుః, పతయాళుః" అని కౌముదిలో గలదు.

పై పద్యమున 'గృహయాళు' అనినచో పూర్వాక్షరము గురువు కాజాలదు—

పెద్దన యీ శబ్దము శ్రీనాథునినుండి గ్రహించినాడు.

> "ఆమోదగ్రహయాళువుల్ బోలసె
> దాక్షారామ మధ్యంబునన్."

—భీమఖండము-(5-94)

మనుచరిత్ర వ్యాఖ్యానమున నూతనముగా నిట్టివెన్నో చూపి పెద్దనగారి ప్రతిభ పెంపొందింప జేయవలసియున్నది.



# క్రొంగూరగంప

## విజయవిలాస వ్యాఖ్య

శ్రీ గర్భాం అప్పారావు

చేమకూర వేంకటకవి ప్రణీతంబయిన 'విజయవిలాసము'నకు బహుప్రచారముకలదు. కాని దానికి సరియైన వ్యాఖ్యానమెవరు రచింపలేదు. ఒక వ్యాసములో కీ॥ శే॥ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు దీనిని ఆంధ్రపంచకావ్యములలో జేర్చ్కొని వసుచరిత్రాది ప్రబంధములు నాల్గింటికి వ్యాఖ్యానములు గలవు కాని విజయవిలాస ప్రాశస్త్యమును వివరించెడి వ్యాఖ్యానము లేకపోవుట శోచనీయమని వ్రాసిరి. నిజమే. ప్రభానుదొరగారి కాలములో జూలూరు అప్పయ్య పండితులు దీనికిని సారంగధరచరిత్రకును టీకలు వ్రాసినట్టున్నది. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమ సారంగధరచరిత్ర వ్యాఖ్యానమున 'పూర్వటీక' నొకదానిని పేర్కొనిరి. అదియే జూలూరి వారిది కావచ్చును. వేదము వేంకటరాయశాస్త్రిగారు ఒక లఘుటీకను వ్రాసిరి. దానిలోని లోపములను అప్పుడపుడు శ్రీ తాపీ ధర్మారావుగారు తెలుపుచుండిరి. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు సారంగధర టీకలోని లోపములను పూర్తిగా విమర్శించిరి: నిజముగా వ్యాఖ్యాత చక్రవర్తియగు శాస్త్రిగారి టీకలో చాలా లోపములున్నవి. ఇందుకు కారణము శాస్త్రిగారు దానిని స్వంతముగా వ్రాయక తాము విన్నదియు కన్నదియు వ్రాయించి యేదో సవరించి నదై యుండవచ్చును.

ఇటీవల శ్రీ బులుసు వెంకటరమణయ్యగారిచే రచింపబడిన 'విజయవిలాస వ్యాఖ్యానము' ఒకటి చూచితిని. ఇది వేంకటరాయశాస్త్రిగారి లఘుటీకకు కొంత పైమెట్టు-అనగా వేంకటరాయశాస్త్రిగారిటీకను కొన్ని చోటులననుకరించి కొంతవిపులము చేయబడినది. ఇదికాక 1906 సంవత్సరములో ప్రచురింపబడిన టీక నొకదానిని పేర్కొన్నారు. కొన్ని పద్యములు వ్యాఖ్యానించుటలో అది మాతృకగా నుండవచ్చును. ఏమన పద్యములలో నున్న పదములు టీకలో మారియున్నవి. ఏది యెట్లున్నను వేంకటరాయశాస్త్రి గారి లఘు టీకలోని పొరపాటు లిందుకూడ నున్నవి. కవి భావములు, చమత్కృతులు, ధ్వనులు చాలా పద్యములలో వివరింపబడలేదు. విడువబడక వివరింపబడినవానిలో కొన్ని వేంకటరాయ శాస్త్రిగారి లఘు టీకలోని లోపములే గ్రహింపబడినవి. కొన్నిపట్టుల అన్వయక్రమము తప్పినది.

ఈ వ్యాఖ్యానము నొక రొక దినపత్రికలో ప్రశంసించుచు ఒక పద్యములోని పాఠభేదము నెట్లు వీరు సవరించి వ్యాఖ్యానించిరో తెలిపిరి.

ఆ పద్యమిది. పీఠిక—14 వ పద్యము.

గెలిచిన గెల్పు లర్థితతి
  కిచ్చిన దినమిచ్చిన యీవులన్ వహుల్
తలచిన విక్రమార్కులొక
  లక్షయుఁ గర్ణులు కోటియుక్ గదా
కలిగిన నీడువత్తురనఁ
  గాఁదగు సాహసదాన సద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె
  పుట్టిన వచ్యుత భూమి జానికిన్.

ఇందు నాలవపాదమున 'పుట్టఁగనె పుట్టిన యచ్యుత భూమిజానికిన్' అనియున్న సరియైన పాఠమును సవరించి 'పుట్టగనె పుట్టిన వచ్యుత భూమి జానికిన్' అనివ్రాసి సమర్థించిరి.

సమర్థన—సద్గుణంబులు ధరయందు బుట్టగనె 'పుట్టిన యచ్యుత భూమిజానికిన్' అనుటలో వాక్యము ముగియుటకాదని అన్వయము కుదురదని పుట్టినవి అని చెప్పినచో సమాపక క్రియ కలుగునని యట్లు సవరించి పద్యార్థమిట్లు చెప్పిరి.

అర్థితతికిన్ = యాచకుల సమూహమునకు; ఈవులన్ వహుల్ = త్యాగములందలి విధములు-వివిధములగు దానములు ఈడువత్తురు = సాటియగుదురు, సాహసం...బులు = (విక్రమార్కునిఁబోలు) సాహసము; (కర్ణునిబోలు) దానమునను గొప్పగుణములు; పుట్టగనె పుట్టినవి = పుట్టుకతోడనె వచ్చినవి. అలం. క్రమము—

ఇది సరియైన అన్వయముకాదు. మఱియు మొదటిపాదమున 'ఈవులుక్ వహుల్' అను పాఠము

విడిచి 'ఈవులన్ వహుల్' అని సవరించి—'త్యాగములందలి విధములు—వివిధములగు దానములు' అని అర్థము చెప్పిరి—'త్యాగములందలి వివిధములు—'వివిధములగు దానములు' ఒకే అర్థమీయవు—

కావున 'ఈవులున్ వహుల్' అను పాఠము సరియైన పాఠము. అపుడు పద్యార్థమీ క్రింద పొందు పఱుపబడినది.

ధరయందు బుట్టగనే=(అచ్యుతరాజు) భూమియందు పుట్టగానే, సాహసదాన సద్గుణంబులు = సాహసము దానముగల గుణములు—పుట్టిన = కల్గిన, అచ్యుత భూమి జానికిన్ = అచ్యుత ప్రభువునకు—గెలిచిన గెల్పులున్ = తాను పొందిన విజయములు—(అర్థితతికి) దినమిచ్చిన యీవులున్ = ప్రతిదినము తాను చేసిన దానములును; వహుల్ తలచినన్ = (విజయదానముల) లెక్కను తెలుపు పుస్తకములు పరిశీలించినచో విక్రమార్క లోకలక్షయు = జయముల లెక్కకు ఒక లక్ష విక్రమార్కులు; కర్ణులు కోటి నున్ = (దానమందు) కోటికర్ణులు, కలిగినన్= ఉండినచో,—ఈ డువత్తురనగాదగున్ = సరిపోవుదురని చెప్పవచ్చును.

తాత్పర్యము—జన్మతోనే సాహసదాన గుణములు కలిగిన అచ్యుత రాజునకు—అతడు గెల్చిన గెలుపులు, దినమిచ్చిన దానములును లెక్క తెలుపు పుస్తకములు చూచినచో సాహసమున లక్షమంది విక్రమార్కులు, దానమున కోటికర్ణులు ఉన్నట్లయిన సరిపోవచ్చును—అనగా పుట్టువుతోనే సాహసౌదార్యములు గల అచ్యుతరాజునకు—లక్షమంది విక్రమార్కులు కోటిమంది కర్ణులు ఉంటే, ఈడువత్తురని చెప్పవచ్చునని భావము.

'ఈ డువత్తు రనగాదగు' అనుదానిలో 'తగు' అనునది తద్ధర్మార్థ కవి శేషణముగా గ్రహించుటవలన కలిగిన దీసవరణ—తగున్ = తగును అని సమాపక క్రియగా చెప్పవలెను. వహి = (*account book*) జమా ఖర్చులు తెలుపు పుస్తకము—ఇపుడు దినవహివారు (*day - book keepers*) తంత్రవహివారు గృహనామములు వారి రాజకీయోద్యోగములబట్టి వచ్చినవి- -హంసవింశతిలో 'దినవహి లెక్క వ్రాలనగ' అని యీ యర్థమునిచ్చు ప్రయోగముకలదు (చూ—1-142 హంస — ) ఇట్లె అన్వయ క్రమము పోగొట్టబడిన పద్యములు కొన్నిగలవు—ఇంకొక్కటి మచ్చునకు చూపెదను.

నలినలీలసంచు నలినలి గావించు
నించుమించు బాఁడు నించుమించు
లేమనగవుఁ జూపు లేమనవచ్చు? బాపు!
జగ మెఱుంగు దాని జగ మెఱుఁగు ‖

ఆ 1- -పద్య 36.

శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు వ్రాసిన అర్థము:—

లేమ...జూపులు = సుభద్రయొక్క నవ్వుతో గూడిన చూపులు; నలిన...సంచున్=పద్మముల నివాసముయొక్క పొందికను (కాంతినని కొందఱు) నలినలి గావించున్= బాగుగా నలిపివేయును, ఇంచుమించున్=ఇంపైన మెఱుపును; ఇంచుమించు - ఆడున్= ఎక్కువ తక్కువలాడును - తిరస్కరించును. ఏమి అనన్ అగున్=ఇక నేమని చెప్పవచ్చును? బాపు!= బాపురే—ఆశ్చర్యము; దాని జగ మెఱుంగున్ = ఆ సుభద్రయొక్క లోకోత్తర విలాసమును; జగము, ఎఱుంగున్ = లోకమంతయు బాగుగా నెఱుఁగును. అలం. ఉపమ, యమకం—

తా॥ చిఱునవ్వు నొలికించు నా సుభద్ర చూపులు తామరపువ్వుల కాంతిని మెఱుపు కాంతిని తిరస్కరించియుండును. అట్టి కాంతి లోకమునం దెచ్చటను లేదను సంగతి లోకమునకు బాగుగా దెలి యును—అలం. ఉపమ-యమకము.

ఇందు కవి భావవిశదీకరణ చేడినది. అర్థము క్రిందను తాత్పర్యము క్రిందను రెండు మార్లు అలంకారములు పేర్కొన్నారు—కవి 3 వ ఆశ్వా— 13 వ పద్యమున సుభద్రయొక్క స్వభావాలంకరణను వర్ణించుచు

'చక్కదనముల ప్రోవైన చంద్రముఖికి
నిచ్చలపురూపు లెస్సైన నింపునింపు'

అని సుభద్రకు ప్రయత్నమున తెచ్చిపెట్టికొన్న అలంకారములకంటె (నిచ్చలపురూపు) స్వభావసిద్ధమైన రూపము లేస్సైన నింపునింపును అని అలంకారముల గురించి తన యభిప్రాయము తెలిపెను. కావ్యాలంకార సంగ్రహమున 'ధ్వని యలంకరణము...... కావ్యేందిరకున్' అనునట్లు అలంకారముల మెఱుగుల చూడక ధ్వని ప్రధానముగా అప్రయత్నపూర్వకముగా చమత్కృతులతో పద్యములు రచించెను. కావున వాతని గ్రంథమునందలి పద్యములలోని ధ్వనులు చమత్కృతులు విశదము చేయుటయే కావలెను కాని అలంకారముల పేర్లు అవసరము లేదు. అట్టివి పూర్వ వ్యాఖ్యాతలు వసుచరిత్రాదిప్రబంధములకు తగిన వ్యాఖ్యలు వ్రాసి అందు అలంకారములుకూడ చివరను చేర్చుచుండిరి. అట్టి వ్యాఖ్యాన మీ గ్రంథము కోరదు.

ఇక ప్రస్తుతపద్యార్థమునకు మరలుదము—

పైపద్యము టీకలోను తాత్పర్యములోను చిఱునవ్వు లొలికించు సుభద్రచూపులు తామరపువ్వుల మెఱుపుకాంతిని తిరస్కరించి యుండును. అని స్పష్టపఱచిరి. చూపులు తామరపువ్వుల వికాసమును ధిక్కరించుట కవులు పెక్కురు చెప్పిరి కాని మెఱుపుకాంతిని తిరస్కరించుట లేదేమో. మిఱుమిట్లు గొల్పు మెఱుపును ధిక్కరించుట సరసముగా లేదు. కావున పద్యార్థ మది కాదు.

అన్వయమిది—లేనగవుఁజూపులు, నలినలీల సంచున్ (పద్మవిలాసముతీరును) నలినలి కావించును- నగవు వెన్నెలను స్ఫురింపజేయును గాన, నగవను వెన్నెలపద్మవికాసమును నలినలి గావించును. అందుచే నగవుఁ జూపులు నలినలి గావించుననుట—

జగమెఱుంగు దాని జగమెఱుంగు, ఇంచుమించును ఇంచు మించులాడించును అనగా జగమెఱిగిన (ప్రతీతిగల) ఆమెయొక్క గొప్ప శరీరకాంతి, మెఱుపును ఇంచు మించులాడించును. ఇచట 'జగమెఱుంగు' అను దానిని తద్ధర్మార్థకవిశేషముగా గ్రహింపవలెను గాని, వ్యాఖ్యాత సమాపక క్రియగా గ్రహించెను. అందుచే పై మూడుపాదములకు దీనికి భావసంబంధము లేనేలేదు. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు వెనుకటి వ్యాఖ్యానములకు మెఱుగు పెట్టిరి కాని సంతృప్తికరముగ మెఱుగుకాదు. అయినను వారిసేవ ప్రశంసనీయమే.

పై రీతిగా కొన్ని పద్యముల అర్థము సరిపడలేదు. కొన్ని చమత్కృతులు విశదీకరింపబడక విడువబడినవి.

# [illegible]

## : కవిత :

సంకలనము: శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి. ప్రాప్తిస్థానం: A. 10 431, హిమాయత్ నగర్, హైదరాబాదు వెల రు 1-8-0.

ఈ పత్రిక సంవత్సరానికి మూడుసారు వెలువడుతుంది. సాహిత్యరంగంలో కావ్యరూపాలకు ప్రధానమైన స్థానం వుంది. ఏ సారస్వతంలోనైనా కవితా సంప్రదాయాన్ని అనుసరించే మిగతా సాహిత్యరంగమంతా రూపొందుతూ వుంటుంది. అట్టి కావ్యరూపాలను, ప్రత్యేకంగా ప్రకటించే పత్రిక మనకు యింతవరకు రాలేదు. అట్టికొరత తీర్చటానికి వీరు ఉద్యమించారు. ఇందుకు అభినందనీయులు!

ఈ కారణంగానే వీరు చేపట్టిన ఈ కార్యక్రమం ఎంతటిబాధ్యతాయుతమైనదో కూడా ఊహించవచ్చు.

వీరి ఉద్యమస్వరూపాన్ని సమగ్రంగా అవగతం చేసుకోవటానికి, ఇందులో సంపాదకీయంలాంటి దేదీలేదు. కాని 'సంకేత' రూపంలో టి యస్. ఇలియట్ వాక్యాలను కొన్నిటినీ, 'స్వవిషయసూచిక' అనే శీర్షికతో ఆస్కార్ వైల్డు, 'పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే' అనే రచనకు ప్రవేశికగా వ్రాసిన వాక్యాలనూ అనువాదం చేసి పత్రిక తొలిపుటలలో ప్రకటించారు. వీటినుంచి వీరి ఉద్యమస్వరూప మెట్టిదో ఊహించటానికి కొంత అవకాశం కలుగుతోంది. ఇలియట్ సందేశంలో ఎలాంటి ఉత్తమకవి అయినా సర్వదా ఉత్తమకావ్యాలే రచిస్తూ వుండలేడనీ, సాధనదశలు వుంటాయనీ వ్యక్తీకరింపబడి వుంది. కాని సాధనదశలో ఉత్పత్తిఅయ్యే ప్రతి సామాన్య రచనను అచ్చువేసి, మహత్తరమైన రచన క్రింద చలామణీ చెయ్యాలని ఇలియట్ అభిప్రాయమై వుండదని మనం గమనించవలసి వుంటుంది.

*'The artist is the creator of beautiful things'*—ఆస్కార్ వైల్డు ఆ 'ప్రవేశిక'ను పై వాక్యంతో ప్రారంభించి చిత్ర విచిత్రాలైన అనేక భావాలను వెల్లడించుతూ వచ్చి,

*'There is no such thing as moral or immoral book. Books are well written or badly written. That is all.'* అనే దగ్గరకు తేలాడు.

ఈ వాక్యాలను వీరు ఇలా అనువదించారు:

'రామణీయకాన్ని సృష్టిసాను కళాప్రపు... నీతికరం, అవినీతికరం అంటూ గ్రంథాలు లేవు; బాగా వ్రాసిన పుస్తకాలూ, బాగా వ్రాయని పుస్తకాలూ, అంతే' —

ఈ వాక్యాలు మనకు శిరోధార్యాలు కావలసి వుంటే, సాహిత్యరంగం ఉదాత్తమైన ప్రయోజనాన్ని దేన్నీ కలుగజేయ లేకపోతుంది.

ఆస్కారువైల్డ్ అనే ఈ మహాశయుడే మానవ జీవితమంటే యేమిటో అర్థమైన పరిణతదశలో సెలవిచ్చిన ఈ క్రిందివాక్యాన్ని ఈ ఉద్యమ నిర్వాహకులు చిత్తగించివుంటే బాగుండేది.

*'The value of art is not beauty, but right action.'*

'కళయొక్క విలువను నిర్ణయించాలిసింది రామణీయకతనుబట్టి కాదు, ఋజుమార్గవర్తనుబట్టి'. అన్నారు. ఈ వాక్యం పై వాక్యాలను రెంటినీ ఛిన్నాభిన్నం చేసి పారేస్తోంది.

ఆస్కార్ వైల్డు జీవితాన్ని సంగ్రహంగానైనా తెలుసుకున్నవారెవరూ ఆయన తొలినాళ్ల ప్రవచనాలను వేటినీ శిరోధార్యాలుగా గ్రహించరు.

ఒక కవి ఒక అభిప్రాయాన్ని వెల్లడించాడంటే ఆ కవి ఆ అభిప్రాయాన్ని, ఏ అనుభవంతో, ఏ సందర్భంలో, ఎందుకు వ్యక్తపరిచాడు, అని ఆలోచించకుండా, గాలిలో ఎగురుతూ వుండే ప్రతి అభిప్రాయాన్ని దొరకపుచ్చుకుని ఆ ప్రకారం మనం ఊరేగటం మొదలుపెడితే కుక్కతోకపట్టి గోదావరి యీదట మాతుంది.

ముఖ్యంగా ఆస్కార్ వైల్డులాంటి జీవిత చరిత్రగల రథయితల విషయంలో ఈ జాగ్రత్త చాలా అవసరం.

అన్నిటినీ తలదన్ని ఆస్కార్ వైల్డు ప్రవచించింది, వీరు శిరోధార్యంగా సేకరించింది, మరో వాక్యం:

*'All art is quite useless.'*

'యావత్కళా
నిష్ప్రయోజనకరం

'కటిక నిష్ప్రయోజనకరం' అనివుండవల సిందిగాని, ఎందుకో దయదలిచి, ఆ ముక్కను వది లేశారు. ఇదంతా కటిక నిష్ప్రయోజనకరం అంటే, దాన్నంతా అచ్చేసి జనంనెత్తిన యెల్లా రుద్ద వీలౌ తుంది అని కొంచెం వెనకాడారో యేమో! 'క్రియేట్ యూస్ లెస్' అన్న ఆస్కార్ వైల్డు కూడా యీలాగే ఏమాత్రం ఔచిత్యాన్నీ పాటించకుండా సంపుటాలతరబడి రచనలు చేసి జనంమీద పార వేశాడు. ఇంతమాత్రాన, ఆయన సర్దాగా అన్న ఈ మాటనుబట్టుకుని, మనం ఆయన సాహిత్య సేవనంతా కొట్టి పారెయ్యటానికి కూడా సంసిద్ధులుగా లేము. 'హాప్పీ ప్రిన్స్' అనే కథను వ్రాసిన మహామహుడు 'యావత్తు కళా కటికనిష్ప్రయోజనకరం' అని హృదయపూర్వకంగా అన్నాడని మనం మాత్రం ఎలా విశ్వసించుతాం? కాని ఈ సంకలనం చేసిన వారు మాత్రం, ఈ వాక్యాలను ఆ దృష్టితో గ్రహించినట్టు, ఈ సంపుటిలో ప్రచురించిన రచన లనుబట్టి మనం అనుమానించవలసి వస్తున్నది.

ఆస్కారువైల్డు ప్రత్యేకం ఆ రచనలో వ్యక్తం చేసిన భావాలే తాడూ బొంగరంలేనివి; వాటికితోడు వీరి అనువాదంతో మరింత అయోమయస్థితి యేర్పడు తోంది. మచ్చుకు:

*'All art is at once surface and symbol those who go beneath the surface do so at their peril; Those who read the symbol do so at their peril.'*

దీనికి వీరిచ్చిన అనువాదం:

'యావత్కళా సువ్యక్తం, సంకేతం. సువ్యక్తాన్ని శోధించేవారు స్వవినాశనానికి. సంకేతాన్ని చదివేవారు స్వవినాశనానికి.'

పై ఇంగ్లీషుమాతృక ఎదట లేకపోతే, తల పగులగొట్టుకున్నా ఈ తెలుగు వాక్యాలు అవగతం కావు.

ఈ రెండు రచనలకూ అనంతరం ఈ సంపుటిలో వున్న మూడవ రచన శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారిది. ఈ రచన మొత్తం 12 పేజీలు. రామకృష్ణ రావుగారి పూర్వరచనలకూ దీనికి యెక్కడా పోలిక లేదు. కావ్యగుణం యేకోశానా లేని వచన వ్యాసం. గేయంలా కనపించేలాగు అచ్చువేశారు. ఈవ్యాసంలో రామకృష్ణరావుగారు, వర్తమానాంధ్ర సాహిత్య రంగంలోని అన్నిరకాల కవులనూ, పద్ధతి బాగు లేదని మందలించారు. కాని వారు ఆశించుతున్న పద్ధతి యేమిటో సెలవిచ్చారు కారు. ఇందులో కొంత భాగం శ్రీరంగం శ్రీనివాసరావుగారిని మందలించటం. ఇందుకు ఇలాంటి కావ్యరచనకు పూనుకునేకంటే రామకృష్ణరావుగారు, శ్రీనివాసరావుగారి పేర ఒక కార్డుముక్క వ్రాసి పోస్టులో వేయించివుంటే బాగుండేది.

ఇందులో మరోచోట తాము లోగడ చేసిన రచనలను ఆధునికులలో కొందరు అనుకరించుతూ 'పెళ్లికొడుకులకు మళ్లే వీధి వీధి విహరింతురు' అని నేరారోపణ చేశారు ఇది చాలా అన్యాయం. నేటి ఆధునికులలో నిజానికి, ఎవరికివారే ఒక మహా కవి. ఏ వాక్యమైనా తేలికగా అచ్చయిపోతుంది. ఒకరిని అనుకరించాలిసినంత అవసరం యెవరికి మాత్రం యేముంది? ఈ భాగంలోనే రామకృష్ణరావు గారు:

'తెలుగుదారి వెలిగించే

వెలుగుదారి తెలిగించే'

అని, ఒక పదబంధాన్ని గారడీ చేసినట్టు మన మీదికి విసిరేశారు ఈ రకంమాటల గారడీలు ఈ సంపుటంనిండా పుష్కలంగా వున్నాయి

రామకృష్ణరావుగారి రచన అనంతరం, శ్రీరంగం శ్రీనివాసరావు గారి 'వృషభం.' ఇది రోడ్డుకు అడ్డంగా పడుకుందిట.

'ఎవరు పొమ్మనగలరీ ఎద్దుని
ఎలా చూస్తోందో చూడు
ఏయ్ఏయ్ మోటారుకారూ
ఏమిటి నీతొందర
భాయ్‌భాయ్ సైక్లిస్ట్
భ్రదంసుమీ ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్రవిరోధి అహింసావాది శాఖాహారి
మద్యనిషేధ ప్రజ్ఞాశాలి
నగరం నడివీధిలో
నాగరికతగమనాన్ని నిరోధిస్తూ
ఇలా ఎంతసేపైనా సరే
ఈయెద్దు నిలబడగలదు.

ఎద్దుకు లేకపోతే బుద్ధి
మనిషికైనా వుండవద్దా—'

ఇది శ్రీనివాసరావుగారి కవనం; ఇవి వీరి భావాలు; 'మద్యపానం నాగరికతకు చిహ్నం. మద్య

పానం కూడదనేవాడు నాగరికతను నిరోధిస్తూ అడ్డం నిల్చున్న బుద్ధిలేనిఎద్దు'—

శ్రీనివాసరావుగారి కవనం, అభిప్రాయాలూ ఎలాంటివైనా మద్యపానమే నాగరికతకు చిహ్నమైతే — అలాంటి నాగరికత తక్షణం నశించటం అవసరం.

ఇందులో 'శాఖాహారి' అనే ప్రయోగం ఒకటి వుంది. ఇది అచ్చుతప్పో లేక రచయిత ఇందులో యేమైనా శ్లేషించారో మనకు తెలియదు.

మిగతా రచనలలో కుందుర్తివారి 'ఉత్తరం' ఒకటి వుంది. ఉత్తరం వ్రాసినట్టే పొడివచనం. బిళ్లలు లేకుండా మనపేర టపాలో వేస్తే 'బేరింగు' దండుగ.

'ఆరుద్ర' గారి 'సమస్తా ప్రేమగీతం' ఒకటి వుంది. ఈ 'సమస్తా' గాని ఈ 'ప్రేమ' గాని యీ దేశం బాపతు గాదు. టి. యస్. ఇలియట్ దేశానిది. భాష కూడా అదే. 'ఆరుద్ర' ఇక తెలుగులో వ్రాయటం మానేసి ఆంగ్లభాషలో రచించటానికి పూనుకోవటం ఉత్తమం.

'టాక్సీ వెయిటింగ్ చార్జీలు పెరుగుతున్నాయ్, బేస్టాటులోనే తొందరగా ప్రేమమాటలు ముగించేద్దామా? ప్రేమ ఎక్స్‌ప్రెస్ చెయ్యటానికి ఐడియల్ వెదర్ డార్లింగ్; సంజ సముద్రతీరాన పకోడీలు కొనడం ఎందుకు, ఐస్‌క్రీం పార్లర్‌లో పీచ్‌మెల్బా ఇప్పించనా హనీ: రోడ్డువార మూడు మూరల సన్నజాజులదండకన్నా ఈవినింగ్ బజారులో కూ్య బెకున్న కొని ప్రజెంటు చేస్తా; టెక్నికలర్ హాలీవుడ్ త్రీ-డీ మేటనీకి వెళ్దామా స్వీట్! వచ్చే సండేనాడు సింప్లీ మార్వెలస్ సినిమా వుంది'—

ఈబాపతు ఇంగ్లీషుభాష తెలుగువర్ణక్రమంలో ఇమడటం కష్టం. రచయిత కష్టపడి యిరికించినా చదివేవాళ్ళని వేధించటం అందుకే యేకంగా ఇంగ్లీషు వ్రాసెయ్యమనటం—అదికవనమైనా కాకపోయినా.

శ్రీ బెల్లపుకొండ రామదాసుగారి 'నిష్క్రమణం' అనే రచన అర్థంపర్థంలేని నిరాశావాద ధోరణిలో యీ సంపుటిలోని యితర రచనల కేమాత్రం తీసిపోకపోయినా, రచనలో కావ్యగుణం కొంతవుంది.

'నాకు లోకం లేదు
నాకు శోకం లేదు
నాకు బాసలు లేవు
ఏదో చల్లనైంది
నాలో నేను'—

ఈరకం వాక్యాలు చదువుతుంటే వట్టి పుణ్యానికి మనకు వికారమేస్తుంది. ఇలాంటి నిస్పృహను జాతికి కలిగించటం ప్రమాదకరం. జాతి నీస్లుగారి ఎందుకూ కొరగాకుండా నశించుతుంది.

స్వతంత్ర రచనలమాట అటుంచి, పాశ్చాత్య రచయితల రచనలలోనుంచి, వీరి ధోరణికి అనుగుణంగా వుండే కొన్ని రచనలను సేకరించి అనువాదం చేసివేశారు. వీరిలో డిలన్‌థామస్, డి. హెచ్. లారెన్స్, రాంబో, టి. ఇ. హ్యూమ్ మొదలైనవారి రచనలున్నయ్.

ఈ రచనలనుగురించి ఒకమాట చెప్పవలసి వుంది. మానవకళ్యాణానికి యుద్ధతంత్రమే పరమ సాధనంగా, పాశ్చాత్య నాగరికత యింతకాలం నడిచింది. గత రెండు ప్రపంచయుద్ధాల అనుభవంతో ఆ పద్ధతి నిరుప్రయోజనకరమని తేలిపోయింది. మరొక పంథా యేమిటో తోచని అయోమయావస్థ యేర్పడ్డది. పైపెచ్చు యీ రెండు యుద్ధాలతోనూ యూరపియన్ దేశాలన్నీ సర్వనాశనమై ద్రవ్యోల్బణాది యీతిబాధలతో దిక్కుతోచకుండావున్నయ్. ప్రజలలో వ్యాపించిన ఈ మానసిక నిరాశనే అక్కడి కవులుకూడా వ్యక్తం చేస్తున్నారు—అధోగతికి దిగజారిపోతున్న నిరాశావాదం: ఈ రకం రచనలను సేకరించి అనువాదం చేసి మన ప్రజలలో ప్రచారానికి తేవటానికి పూనుకోవటం అనవసరమైన పనేగాక, అనర్థదాయకం. మనది పారతంత్ర్యపు మృత్యువునుంచి పునఃజీవించి అనంతమైన ఆత్మవిశ్వాసంతో పురోగమించుతున్న జాతి; సాహిత్యం ఈ ఆత్మవిశ్వాసానికి బలం చేకూర్చేదిగా వుండాలిగాని, దాన్ని నశింపజేసేదిగా వుండకూడదు. మన మార్గమేదో మనకు వెలుగుబాటగా కనుపించుతోంది. జాతిలో వున్న బలాన్ని కూడదీసుకుని మనం ముందుకు సాగాలి.

శ్రీమతి ఛాయాదేవిగారు ఈ విషయాన్ని గుర్తించి, ముమ్ముందు తగిన విధంగా ఈ పత్రికా నిర్వహణను సాగించగలరని ఆశించుతాము.

మనదీ ఒకజాతి; మనకూ ఒక సాహిత్య సంప్రదాయం వుంది. పాశ్చాత్య రచయితలలోనుంచి ఏ రచనను తెచ్చుకున్నా దాన్ని మనం జీర్ణం చేసుకుని, మన పంథాలోకి మనకు బల తేజాలు కలిగేలాగు మలచుకోవాలిగాని, ముక్కు కోసుకుపోయేదిగా వుండరాదు. నవ్యాంధ్ర సాహిత్యారంగంలో అర్థశతాబ్దిగా జరిగిన కృషికి ఈసంపుటి పరిణామమంటే, నవ్వు బాట్లపనిగా వుంటుంది.

మన జాతి యేమిటి మన సాహిత్య మేమిటి మన బలమేమిటి; మన ప్రజలేమిటి మనకున్న సాధకబాధకాలేమిటి వీటిని సర్దుకుని మనం యెలా ముందుకు పోగలం? అన్న దృష్టి ఈ దశలో చాలా అవసరం.

అంతేగాని యెప్పుడో యెవరో అన్నారని, 'యావత్కళా నిష్ప్రయోజనకరం' అంటే మీ ప్రయత్నం వట్టి నిష్ప్రయోజనకరమని యితరులు అనవలసి వస్తుంది.

ఈ సంపుటిని ఆదినుంచి తుదివరకూ ఓపికపట్టి యెవరేనా చదవగలిగితే ఆ వ్యక్తికి అర్థంలేని యేదో బెంగపట్టుకుని, వారం దాకా వదలదు. వచ్చే సంపుటికైనా పాఠకులకు ఇలాంటి బాధ కలిగించకుండా వుంటారని విశ్వసించుతున్నాం.

## బాలభాగవతము

[ప్రథమ సంపుటము]

పద్య కావ్యము:- రచన: రాజ రాధాకృష్ణ శాస్త్రి; ప్రాప్తిస్థానం: సరస్వతీ బుక్ డిపో, విజయవాడ. మూల్యము రు 0-12-0.

ఈ ప్రథమ సంపుటిలో కృష్ణజననం మొదలు తృణావర్తుని వధవరకూ గల కథ వుంది. సరళమైన గ్రాంథికంలో బాలబాలికలకు తేలికగా అర్థమయ్యేలాగు రాధాకృష్ణశాస్త్రిగారు యీ పద్య రచనను నిర్వహించారు; ఆటవెలదులూ, గీతాలూ, కందాలూ, ముచ్చటగా రచించారు. రసనిర్వహణలో తొలినాటి రచయితల చాకచక్యాన్ని సాధించుకున్నారు. మచ్చుకు:

"నన్ను గన్నవాడు, నాతండ్రి నాకంటి
వెలుగు, నల్లనయ్య వెలసెనంట
ఇచట నెటనో మందః నే నాతనిం జేర
నురికివచ్చి తిరుగుచుంటినమ్మ!"

## : జోగిరాజుగారి రచనలు :

శ్రీ గోటేటి జోగిరాజుగారు వ్యవసాయ శాస్త్రంలో పండితులు: లోగడ వ్యవసాయ శాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంథాలు రచించి ఆంధ్ర ప్రజల మన్ననలందుకున్నారు. ఇప్పుడు మరి మూడు గ్రంథాలను ఆంధ్రప్రజలకు అందజేస్తున్నారు:

(1) కాయధాన్యములు: కంది, పెసర, సెనగ, వగైరా కాయధాన్యములను గురించి విపులంగా ఈ గ్రంథంలో వివరించారు. సచిత్రం; రు. 1-8-0.

(2) పశువుల గ్రాసములు, పచ్చి యెరువులు, పంటచెరుకు వగైరాలు: సచిత్రం 3-8-0.

(3) తృణధాన్యములు: వరి, మొక్కజొన్న మొదలైనవి. సచిత్రం: వెల 4-0-0.

ఈ గ్రంథములు మూడూ రైతాంగానికి చాలా ఉపయోగకరమైనవి. ఈ గ్రంథాలకు తప్పకుండా ఆంధ్రప్రజల ఆదరణ వుంటుంది. ప్రాప్తిస్థానం: ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు, పసుమటలంక.

## : విరులసరులు :

ఖండకావ్య సంపుటి; రచన: శ్రీమతి చుండూరి రమాదేవి: ప్రాప్తిస్థానము: వెంకటరామా అండ్ కో, విజయవాడ; వెల 0-12-0.

## : పరిణామం :

నాటిక; రచన: శ్రీ చిల్లర భావనారాయణ; ప్రచురణ నవ్యకళాసమితి, సికింద్రాబాదు.

## : ప్రతాపసింహము :

రాణాప్రతప్ చరిత్ర: గ్రాంథిక వచనము; రచన: కోతి సత్యనారాయణ చౌదరి; ప్రచురణ: విజయా పబ్లిషింగ్ కంపెనీ - గుంటూరు. వెల 1-2-0.

## : శ్రీ తత్వానందస్వామి :

శ్రీ తత్వానందస్వామిగారి స్మారక సంపుటి; ప్రచురణ శ్రీ తత్వానంద శిల్పాశ్రమము మంగళగిరి: అమూల్యం.

## అంజలి :

తెలుగు తల్లికి అంజలి: గేయాలూ, గీతాలూ: రచన: గోపశ్రీ; ప్రాప్తిస్థానం: యస్. గోపాల్ రెడ్డి; సామిరెడ్డిపల్లె; పులికల్లు పోస్టు; చిత్తూరు జిల్లా; అమూల్యం.

## కమలనాథ్

నవల; రచన: పోతుల సుబ్బారావు; ప్రకాశకులు: మాదిరెడ్డి జగన్నాథరావు అండు కో; కాకినాడ వెల 0-12-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

"ఎంతో తెల్లనిది—ఎంతో శుద్ధమైనది

# లక్స్ టాయ్‌లెట్ సబ్బు యొక్క నురగ

ఎంతో మెత్తగాను, సువాసనగాను వుంటుంది"

అని *పద్మిని* చెప్పుచున్నది






లక్స్ టాయ్‌లెట్ సబ్బులో పరిశుద్ధ నూనెలే ఉపయోగించబడుతాయని మీకు తెలుసా? అందుకే అది అంత తెల్లగా వున్నది. పద్మిని ఇలా చెప్పుచున్నది: "నా ముఖవర్చస్సుకు లక్స్ టాయ్‌లెట్ సబ్బు దివ్యమైన సౌందర్య సహకారి అని నేను తెలుసుకొన్నాను. దాని సమృద్ధియైన మెత్తని నురగ చర్మ రంధ్రాలందు లోతుగా చొచ్చి, నా చర్మాన్ని మృదువుగాను, సుందరముగాను ఉంచుతున్నది. దాని మనోహరమైన నిలిచివుండే సువాసనం చేకూడా నాకు మిక్కిలి ఇష్టము!"

"...దుకే నా ముఖవర్చస్సును ఆకర్షణీయముగా నుంచుటకు నేను లక్స్ టాయ్‌లెట్ సబ్బును వాడుతాను."

శరీరమంతా సౌందర్యముగా నుండుటకు క్రొత్త

**వ... జు సబ్బు**

ఇప్పుడు దొరకుచున్నది ఇవ్వాళే దానిని వాడి చూడండి!

**...మా తారలకు సౌందర్య...**

LTS. 431-X52 7

Bharathi, 7th November 1954.

Regd. No. 1856



అలసట మానవుని జయిస్తుంది



# తేనీరు

అలసటను
జయిసుంది

టీ బోర్డు ప్రకటన.

PSTB 126